# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు







భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చి
సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్.

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖ**



మా ఇంటిలోలాగే ప్రతి ఇంటిలోను ఒక వి బి సి
మినీ వెట్ గ్రైండర్ ఉంటే జీవితం ఎంత
ఆనందంగా ఉంటుందో!



ఇడ్లి, దోసెలు,
అడలు, చట్ని,
మసాలా....
నానబెట్టిన
అన్ని ధాన్యాలను
రుబ్బుటకు
శ్రేష్ఠమయిన
వి బి సి మినీ
వెట్ గ్రైండర్



0.75 లీటర్
పట్టేటంత
-చిన్న
కుటుంబానికి
అనుకూలమైనది.

CCC.VBC 128

- సావకాశంగా రుబ్బుకోవచ్చు—సహజమైన రుచి తగ్గదు
- "ఎవర్‌సిల్వర్" పాత్రములతో చుట్టే సరియైన 'టేబిల్' మాడెల్
- కరెంట్ ఖర్చు తక్కువ
- భద్రతకు 'నియాన్' దీపం
- 1 సంవత్సరం గారంటీ
- మరియు "మిడి" వెట్ గ్రైండర్ 1.25 లీటర్-మధ్యమ తరగతి కుటుంబాలకు తగినది

76 సంవత్సరములుగా శ్రేష్ఠతకు పేరుపొందిన
ఆభరణవాణిజ్య ప్రముఖులు వి బి సి వారిచే మీకు సమర్పింపబడుతున్నది.

పనగల్ పార్క్ షోరూమ్:



**ఉమ్మిడి బంగారు శెట్టి & కో.**
3, నాగేశ్వరరావు రోడ్, టి. నగర్, మద్రాసు-600 017
ఫోన్: 442407

**STOCKISTS**

Messrs. Enlar Enterprises,
35, II Main Road,
Shanthi Nagar, Hyderabad-500 028
Phone: 37107

Messrs. Beldesons,
141, Rashtrapathi Road,
Secunderabad-500 003
Phone: 76516

M/s. Sri Dhanalakshmi Engineering Enterprises,
12-15-29, P. J. Nehru Road,
Post Box No. 65, Vijayawada-520 001
Phone: 62272

Messrs. Sri Sri Auto & Electronics,
Darbar Road, Chirala-523 155
Phone: 545

Messrs. Sri Venkataramana Electricals,
Bose Road, Tenali
Phone: 401

విధాత ఒక బొమ్మను తయారు చేసి దానికి ప్రాణం పోస్తాడనే మూఢ నమ్మకాలకు గొడ్డలి పెట్టు 'టెస్ట్‌ట్యూబ్ బేబీ' ఆవిర్భావం. స్త్రీ అండాన్ని బయటకు తీసి టెస్ట్‌ట్యూబ్‌లో ఫలదీకరింపజేసి తిరిగి గర్భాశయంలో ప్రవేశపెట్టి సహజంగా ప్రసవింపజేయడం నిజంగా చరిత్రలో అపూర్వ విషయం. ఒక్క మృత్యువును తప్ప మానవుడు అధిగమించనిదేదీ ప్రపంచంలో లేదు. కుంభ సంభవులుద్భవించారని పురాణాలలో విన్నది నిజమేనేమో! మాతృత్వం స్త్రీకి ప్రకృతి ప్రసాదించిన వరం. వివాహమైన 2, 3 సం॥ల తరువాత సంతానం కలగకపోతే స్త్రీ అసంతృప్తికి లోనవుతుంది. 'అమ్మా' అనే తీయని పిలుపు కోసం అలమటిస్తుంది. ఆ అదృష్టానికి నోచుకోని వనితల మానసిక వేదన వర్ణనాతీతం.

మనే ముఖ్యాతి ముఖ్యమైన ఘట్టాన్ని నిర్లక్ష్యం చేస్తోందని చెప్పక తప్పటంలేదు. ఈ విషయంలో కూడా ఈ సంస్థ మరికొంత శ్రద్ధ చూపిస్తే, నాలాంటి ఎందరో గృహిణులకు ఎన్నో ఇక్కట్లు తొలగించినవారవుతారని భావించి చేస్తున్న నా లేఖలోని సూచనలు గ్రహించవలసినది. 1. కల్తీకి అవకాశం లేకుండా సీసా మూతకు అడ్డంగా సీలు వేయడం గానీ, లేదా 'పాలిథిన్' సంచులలో గాని పాలు సప్లయి చేయడం. 2. నిరుద్యోగులైన యువతీ, యువకుల ద్వారా గానీ లేక సమర్థవంతమైన సిబ్బంది ద్వారా గానీ పాలను యింటింటికీ సప్లయి చేయడం 3. నెల జీతగాళ్ళకు, తదితరులకు నెలవారీగా పాల ధరల వసూళ్లు; హోటల్ భోజనం టిక్కెట్లు అమ్మినట్టుగా 30 లేక 60 టిక్కెట్లు పుస్తకాన్ని పాల వినియోగదారుకు విక్రయించే ఏర్పాటు చేయాలి. ఈ సంస్థ వారు తయారు చేస్తున్న పాల పౌడర్‌ను విరివిగా


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 4 సంచిక: 5

నవంబర్: 1978

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవైనాలుగు రూపాయలు

శ్రీలంక: రూ. 2-00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు – 600 026




ఈ పేజీలలోని ప్రతి లేఖకూ చిన్న పారితోషికం– ఐదు రూపాయలు

ఎన్నో నోములు నోచి కనబడ్డ దేవునికల్లా మ్రొక్కుతూ, తోచిన మందులను వాడి నిరాశ చెందిన వారెందరో నిత్య జీవితంలో కనబడుతుంటారు. తల్లి కాలేక నిరాశ చెందిన వనితల హృదయాన పన్నీటిజల్లులు కురిపించే రోజులు వచ్చాయి. స్త్రీ ప్రసవవేదన అనుభవించకుండానే టెస్ట్‌ట్యూబ్‌లోనే శిశువు పెరిగే విధానాన్ని కూడా రూపొందించగలుగుతారేమో — ఈ వైజ్ఞానిక యుగంలో మన శాస్త్రజ్ఞులు ఘన విజయం సాధించారని చెప్పవచ్చు. శ్రీమతి లెస్లీ బ్రౌన్‌కు సంతానాన్ని ప్రసాదించిన డా॥ స్టెప్టో, డా॥ ఎడ్వర్డ్స్ అభినందనీయులు.

మంత్రి అరుణ — పుల్లెంల

సెప్టెంబర్ నెలలో ప్రచురించిన 'పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ' పరిచయ వ్యాసం చదివితే, ఉత్పత్తి మొదలు, రవాణా వరకు అత్యంతశ్రద్ధ తీసుకొనే ఈ సంస్థ–వినియోగదారుకు పాలు అందజేయట

మార్కెట్‌లో (కేవలం సూపర్ బజార్‌లలోనే గాకుండా ప్రతి చిల్లర దుకాణంలోనూ) ఎల్లవేళ్ళలా దొరికేలా చేయాలి. ఇందువల్ల ఏ గృహిణికీ పాలకోసం గంటలతరబడి 'క్యూ'లలో నిరీక్షణలూ, వస్తాయో రావోనని బెంగలూ, రాకపోతే నిరాశలూ, రోజూ ఉదయాన్నే పాలకు తగిన డబ్బులుకోసం వెదుక్కోటమూ, చిల్లర లేకపోతే వాళ్ళచేత నీచంగా మాట్లాడించుకోడమూ, పాల సీసాలు ఓ ప్రక్కన కనుపిస్తుండగానే 'లేవండీ' అని నిర్భయంగా చెప్పించుకోవడమూ, చిక్కటి పాలు దొరుకుతాయనే ఆశేతప్ప, లేకపోతే డబ్బులు మనం ఇచ్చుకుంటూ ఇన్ని ఇబ్బందులు ఎందుకుపడాలి....మన ఖర్మకాకపోతే – అని మనం బాధపడటమూ తప్పుతాయి.

నండూరి వసంత — విజయవాడ

అక్టోబరు సంచికలోని "తరతరాల భారత సంస్కృతిలో స్త్రీ" గుంటి సరస్వతిగారి వ్యాసం హృదయానికి హత్తుకునేలా వుంది. ఒక విధంగా చెప్పాలంటే తరతరాల నుండి మేము అన్యాయాలకు బలైపోతున్నాం, దురాచారాలకు గురైపోతున్నామంటూ వాపోతూండే స్త్రీలకు కనువిప్పు కలిగించేదిలా వుంది ఆ వ్యాసం. స్త్రీ స్వాతంత్ర్యం, సమానత్వం అంటూ వేదిక లెక్కి ఉపన్యాసాలు దంచే వాళ్ళలో నిజానికి ఎంత మందికి 'విమెన్స్‌లిబ్' అంటే అర్థం తెలుసు? సమానత్వం అంటే మేం వంట చేస్తున్నాం మీరెందుకు చేయకూడదూ అనా? లేక మేము పిల్లల'కేర్' తీసుకుంటున్నాం, మీరెందుకు పిల్లల పని చూడకూడదూ అనా? 'కార్యేషు దాసి' అన్న శ్లోకానికి ఎంతో చక్కగా అర్థాన్ని వివరించారు రచయిత్రి. సలహా సంప్రదింపుల్లో మంత్రివలె అంటే ఏ విషయంలోనైనా భార్య సలహా తీసుకోమనే కదా పెద్దల ఉద్దేశ్యం. అదే నిజమైతే మనల్ని తక్కువగా చూస్తున్నట్లూ, నిర్లక్ష్యం చేస్తున్నట్లు ఎందుకు అనుకోవాలి మనం? నువ్వు తప్పు చేస్తున్నావు కాబట్టి నేనూ పరాయివాళ్ళతో తిరుగుతాను అని స్త్రీ అనుకుంటే



తెలిసిన విలువలు (27 వ పేజీ) కథ రాసిన శ్రీమతి బి. ప్రేమ్ లీలారావ్–పెద్దాపురం మిషన్ హైస్కూల్లో సైన్స్ అసిస్టెంట్‌గా పని చేస్తున్నారు. ఆమె – బి. ఎస్‌సి. బి. ఎ. బి. ఇడి. ఇరవై సంవత్సరాలుగా వివిధ పత్రికల్లోనూ కథలు, వ్యాసాలూ రాస్తున్నారు. ఆమె రచనలు ఎక్కువగా వార పత్రికల్లో వచ్చాయి. "ఎప్పుడైనా తీరిక దొరికినప్పుడు కథలు, వ్యాసాలూ రాయడం తప్పించి, ఈ రచనా వ్యాసంగాన్ని నేనెప్పుడూ ఒక వ్యాపకంగా తీసుకోలేదు. 'వెలుగురేఖ' అనే ఒకే ఒక నవల రాశాను. నవలలు రాయాలనే కోరికా, తీరికా కూడా లేవు నాకు!" అంటున్నారామె.

అది తన నైతిక పతనానికి నాంది అనే నా అభిప్రాయం.

వి. ప్రతిమ వాయురుపేట

నది సముద్రంలో పయనించే నావ ఒక్కొక్కసారి అనుకోని తుఫానుకు గురి అవుతుంది. చేయూత దొరికి ఒడ్డుకు చేరితే బాగుచేయబడి రూపు దాల్చుతుంది. లేకుంటే సముద్ర గర్భంలో కలిసిపోతుంది. కొందరు అతివల జీవితాలు కూడా ఆ నావలాంటివే. చిన్నతనంలోనే భర్తను కోల్పోయి ఏకాకిగా జీవితం గడపలేక కృంగి, కృశించిపోయే అభాగ్యులకు 'ఆఫ్టర్ కేర్ హోమ్'లు గాలికి అల్లల్లాడే లతకు అందిన పందిరిలాంటివి. సాంఘిక వ్యవస్థ ప్రభావంతో, మంచీ చెడూ గ్రహించలేని వయసులో అన్నెం పున్నెం ఎరగని కన్నెలు తాము అడుగు పెట్టేది నిప్పులకుంపటిపై అని తెలియక ప్రలోభాలకు లొంగి దిగజారి పోతున్నారు. అట్లాంటి జీవితాలు అట్టడుగున పడిపోకుండా వారికి రక్షణ కల్పిస్తున్నవి ఈ హోమ్‌లు. మారుమూల పల్లెల్లో మగ్గిపోతున్న ఇట్లాంటి వనితల బీటలువారిన హృదయాలపై 'ఈ హోమ్‌ల పరిచయం' కురిసిన పన్నీటిజల్లు.

దేవులపల్లి శిరీష వికారాబాదు

"ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవ్వరెదురైనా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలపరా నీ జాతి నిండు గౌరవము"....

అన్న ఒక దేశభక్తి కవి సూక్తి నేటి ఏ కథల్లో వెతికినా మచ్చుకైనా కానరావడం లేదు. కథల్లో హీరోని మెడిసిన్ చదవడానికి అమెరికా పంపిస్తారు. హీరోయిన్ అందంగా కనిపించాలంటే జపాన్ జార్జిట్ చీరను కట్టిస్తారు. నేటి రచయి(త్రు)తలు ఇలాంటి చిన్న విషయాల్లో కూడా స్వదేశ ప్రసక్తిని తీసుకురారు. ప్రతి వస్తువు మీద పరదేశపు పేరుంటే చాలు–ఎంత విలువైనా కట్టి ఆనందంగా స్వీకరిస్తారు. అదే హస్త కళా నైపుణ్యమైన స్వదేశ వస్తువుకు ఆ విలువ కట్టడానికి ఆలోచిస్తారు. నానాటికి విదేశాభిమానం వటవృక్షంలా పెరిగిపోతూన్న తరుణంలో.... అక్టోబర్ నెల వనితలో ప్రచురించిన "ఐదు మాసముల ఇరువది దినములు" కథను చదువుతూన్నంత సేపూ – రచయిత్రి కీ॥ శే॥ కనుపర్తి వరలక్ష్మమ్మగారి సామాజిక స్పృహకు దర్పణం పట్టింది. ఇంత చక్కని దేశభక్తి



ఈ సంచికలోని 'నిర్ణయం' (61 వ పేజీ) కథ రాసిన కుమారి కందాళ మృణాళిని — ఈ సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఎం. ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యారు; హైద్రాబాదులోనే వుంటున్నారు. ఎక్కువగా 'ఆకాశవాణి' కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటారు; తాత్కాలికంగా 'అనౌన్సర్'గా కూడా పని చేస్తూ వుంటారు. పుస్తకాలు చదవడం; కథలు రాయడం ఇష్టం. మూడు కథానికలు ఇదివరలో రేడియోలో చదివారు. అవికాక ఇంకొకటి పత్రికలో వచ్చింది. 'నిర్ణయం' కథ పత్రికల్లో వచ్చిన ఆమె రెండవ కథ.

ప్రబోధించే కథను మాకందించిన "వనిత"కు వనితగా నా సాహిత్యాభివందనములు.

విస్సాప్రగడ సుబ్బలక్ష్మి రాజమండ్రి

'చేను మేసే కంచెలు' అన్న వ్యాసంలో 'బాల' గారు అన్నట్లు స్త్రీమూర్తిని పవిత్రంగా భావించే పుణ్యభూమి మనది. భగవంతుని తరువాత మనం ఋణపడేది స్త్రీలకే. కారణం ఒకటి జన్మ నిచ్చినందుకు; రెండవది జీవితాన్ని సుఖమయం చేస్తున్నందుకు అన్న 'బాపీ' సూక్తి ఒక్కసారి స్ఫురణకు తెచ్చుకుంటేచాలు. కానీ స్త్రీ జాతికి నేడు తగిన రక్షణ కనుపించుటలేదు. ఈ లోపం ఎక్కడ నుండి వస్తున్నది? దేశ సౌభాగ్యానికి వన్నె తెచ్చి వీరమాతగా నిలిచే ప్రతి స్త్రీమూర్తి నేడు సమాజంలో గౌరవస్థానాన్ని, రక్షణను కోల్పోతున్నప్పుడు, ఆమె హృదయం మూగగా విలపిస్తున్నప్పుడు, దేశం సర్వ సౌభాగ్యంతో ఎలా తులతూగగలదు? ఈనాడు సమాజంలో స్త్రీ బయటికి అడుగుబెడితే ఎన్నో క్లిష్ట సమస్యలను ఎదుర్కొనవలసి వస్తున్నది. ఆ 'స్త్రీ' యింటికి క్షేమంగా వచ్చేంతవరకు భయమే. ఏవేళప్పుడు ఏ 'కబంధ హస్తలతో' కబళింపబడుతుందా అని. పవిత్రమైన సంబంధాల పేరిట అత్యాచారం జరిపే నరరూప రాక్షసులు వున్నంతకాలం స్త్రీకి విలువలేదు! రక్షణశాఖ తప్పనిసరిగా నైతిక విలువలను పాటించి స్త్రీకి రక్షణను కల్పించాలి. ప్రభుత్వం తగిన చర్యలను తీసుకున్నప్పుడే 'స్త్రీ' ధైర్యంగా తల ఎత్తుకుని బయటికి అడుగుబెట్టగలదు.

చేరాల ప్రమద్వర గుంటూరు

POST CARD
To
The Editor,
'VANITHA' Monthly,
CHANDAMAMA BUILDINGS
MADRAS - 26
PIN 600026

From:—
Akondi Venkata Lakshmi,
W/o Sri A. Siva Ram (PhD)
Kameswari Nilayam, 30-10-13,
Pidapartivari Street,
Dabagardens,
Vizag - 530004,

'అక్టోబరు నెల వనిత'లో ప్రచురించిన "ఐదు మాసముల ఇరువది దినములు" కథ చదివాను. చాలా చైతన్యవంతమైన, ఉత్తేజకరమైన రచన. ఈ రచన కథలాగాకుండా వాస్తవగాథలాగుంది. నిజంగానే ఆ రోజుల్లో రుక్మిణిలాంటి యువతులు ఎంతమందో దేశం కోసం ఎన్నో త్యాగాలు చేశారు. నవలలు, కథలు చదివి ఎవరూ మారకున్నా, ఈ కథ చదివిన తరువాత కనీసం ఏ కొద్దిమందైనా విదేశీ వస్తు బహిష్కరణ కావించి వుంటారు. మన మనస్సుకు హత్తుకునిపోయి మనలో ఒక ప్రత్యేకమైన ఆలోచన రేకెత్తించేదే మంచి రచన అని నా నమ్మకం. ఆ కోవకు చెందినదే ఈ రచన.

—సి. అరుణారెడ్డి, కాజీపేట

అక్టోబరు వనితలో కీ. శే. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి కథ చదివి పులకితురాలనయితిని. బాపట్ల నివాసినైన నేను ఆమెతో ప్రత్యక్ష పరిచయము కలిగి ఉన్నను ఆమె సాహిత్యమును పూర్తిగా చదువలేకపోయాను. వనిత ద్వారా ఆమె కథను చదువ గలిగినందులకు ఎంతో సంతోషించుచున్నాను!

—కోటంరాజు భవానీదేవి, బాపట్ల

47 సంవత్సరాల క్రిందటి కథ 'ఐదు మాసముల ఇరువది దినములు' చాలా బావుంది. ఈ అమూల్య కానుకను అందించిన వనితకు మా కృతజ్ఞతలు.

—ఎమ్. లక్ష్మి, వాల్తేరు

అక్టోబరు వనితలో రాజమండ్రిలోని కె. వి. స్టేట్ హోమ్, మరియు మచిలీపట్నం కలంకారి గురించి చాలా విషయాలు తెలుసుకున్నాము.

—ఆలమూరి రేచల్ సుగుణాశామ్యుల్, విశాఖపట్నం

మేము మా శ్రీవారి ఉద్యోగం కోసం ఆంధ్రప్రదేశ్‌ని, ఆంధ్రులను, ఆంధ్ర భాషను వదలి వచ్చీరాని బెంగాలీతో ఇరుగు పొరుగు వారితో స్నేహం కలుపుకొని కాలక్షేపం చేస్తూ ఒకనాడు బజారులో వనిత పత్రిక అమ్మడం చూశాము. ఆప్తమిత్రుడు కనుపించినంత సంతోషం కలిగింది. వనిత కొని ఇంటికి వచ్చి పేజీలు త్రిప్పి చూచాం. ముగ్గులు, వంటకాలు, వైర్‌బ్యాగ్‌లు' వైద్య సలహాలు ఇంకా ఎన్నో విషయాలు నేర్చుకుంటున్నాం. ఎక్కడకు వెళ్ళడానికీ అవకాశం లేని వనితలకు ఇంట్లో కూర్చునే అన్నీ నేర్చుకునేలా సహకరించే వనితంటే మాకెంతో అభిమానంగా ఉంది.

—టి. కల్యాణీ నమ్మాళ్వార్, కలకత్తా

అక్టోబర్ సంచికలో రాజేశ్వరీ మల్లికార్జునరావుగారు తెలియజేసిన పూసలతో పల్లకి తయారుచేశాము. చాలా బాగా వచ్చినది. పోతే టాప్ (పల్లకీ పైభాగము) నిలుబడుట లేదు. టాప్ భాగం ఎలా నిలబెట్టవలెనో సరిగ్గా తెలియజేయమని రాజేశ్వరిగారికి నా మనవి.

—బి. రాణి, కాకినాడ

'అవి-ఇవి' శీర్షికలో చేమంతిపూల బేగ్‌ను తెలియ చేసిన మంగళాకందూర్‌గారికి నా అభినందనలు.

—కె. శోభారాణి, చీపురుపల్లి

అక్టోబరులో మీరు ప్రచురించిన 'ఆధునిక నాట్య కళాకారిణి, ఆషాకుర్లావాలా గురించి చదివి మేమెంతగానో సంతోషించాం. మన దేశంలో ఆధునిక నాట్యాన్ని అభ్యసించేవారు వున్నారని మాకు ఇప్పుడే తెలిసింది. మీరు ప్రచురించిన ఆమె యొక్క నాట్య భంగిమలు మమ్మల్ని ఎంతగానో ఆకర్షించాయి.

—లక్ష్మి, తాడేపల్లిగూడెం

గత సంచికలోని శ్రీమతి, శ్రీవారు కథానిక మాకు నచ్చనేలేదు. మంచి మంచి కథలే వనితలో చదవడం అలవాటయిన మాకు ఈ కథానిక చాలా నిరాశ కలిగించింది. వనితలో శిరోజాలంకరణ గూర్చి తెలిపే వ్యాసాలు (ఫోటోలతో) ప్రచురించవలసినదిగా కోరుతున్నాను.

—ఆర్. ఇందిర, కోరగుంటపల్లె

అక్టోబరు '78 'వనిత'లో ప్రచురించిన వీణా విద్వాంసురాలు గాయత్రిగారిని గురించి వ్రాసిన వ్యాసము నా లాంటి సంగీత ప్రియులకు మార్గదర్శకముగా నున్నది. ఆ సంచికలోనే గుంటి సరస్వతిగారన్నట్లు, నేటి స్త్రీలు చాలామంది వేదికపైనెక్కి వరకట్నమును నిషేధించాలని చెపుతూ, మరొకవైపు తమ బిడ్డలకే ఎక్కువ కట్నం కోరటం చాలా శోచనీయము.

—జి. సుజాత, అనంతపురము

'వనిత'లో 'నేర్చుకున్న గుణపాఠం', 'మరుపురాని సంఘటనలు' శీర్షికలు వచ్చాయి. అలాగే 'ఫలించిన కల' కొత్త శీర్షిక ప్రవేశపెడితే బాగుంటుందని మా అభిప్రాయం.

—కె. జి. హేమలత, కుప్పం

పురుషులతో సమానత్వం కావాలి' అంటూ స్లోగన్సు ఇస్తారు మన మహిళలు. కాని నిజానికి వారికి మనం పురుషులతో సమానంగా ఉన్నామా లేదా అన్నది కూడా తెలియదు. అసలు సమానత్వం అంటే కూడా తెలియనివారున్నారు. మనకున్న అర్హతలు, సామర్థ్యం వలన పురుషులతో సమానం కావటం కాకపోవటం అనేది ఉన్నది.

—చందు సుజాత, తెనాలి

తన దేశాభివృద్ధి కోసం, ప్రజాభ్యుదయం కోసం నిరంతరం పాటుపడడమే తన స్థిరలక్ష్యమని చీనా రచయిత్రి హాన్‌సూయిన్ రచన నూతనోత్తేజాన్ని కలిగించింది. పలు భాషలు నేర్చుకోవాలని ఉత్సుకత చూపేవారికి భాషలు నేర్చుకోండి శీర్షిక సహకరిస్తూంది. పక్షపత్రిక నుండీ మాసపత్రికగా మారినప్పటికీ వనితలో ఒకే ముగ్గు వేయడం చాలా విచారకరం.

—కె. జి. సరళకుమారి, కుప్పం

లోపల




ప్రపంచంలో గత కొన్ని దశాబ్దాలలో ఎంతో మార్పు కనిపించింది. అనేక రంగాలలో ప్రపంచం పురోగమించింది. శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో గొప్ప విజయాలు సాధించబడ్డాయి. మారుతున్న ప్రపంచంలో వనిత తన స్థానాన్ని నిరూపించుకుంటూ ముందడుగు వేయడం ప్రారంభించింది.

ఈ రోజున వనిత గృహిణిగానే 'మిగిలిపోకుండా' ఆర్థిక స్వాతంత్రాన్ని కోరుకుంటోంది. వైవాహిక జీవితంలో తనని అర్థం చేసుకుని గౌరవించగల భర్త కోసం ఎదురు చూస్తోంది. తను 'మహారాణి'గా బ్రతకడానికి సొంత ఇల్లు కావాలని వాంఛిస్తోంది. ఈ కోరికలన్నీ కలిసికట్టుగా నెరవేరినా నెరవేరకపోయినా ఆర్థిక స్వాతంత్ర్యం సాధించడానికి వనిత ఏ మాత్రం వెనకడుగు వేయడం లేదు. అందుకు పెద్ద చదువులు చదువుతోంది.

ప్రపంచ వ్యాప్తంగా ఈ మధ్య జరిపిన ఒక సర్వేలో కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెల్లడయ్యాయి. 1960 ప్రాంతాలలో పోస్టుగ్రాడ్యుయేట్, డాక్టరేట్ డిగ్రీలు వున్న వారిలో కేవలం తొమ్మిదిశాతం మటుకే వనితలు వుండేవారు. 1977 కి ఈ శాతం 36.3 కి పెరిగింది. అంటే వనితలు సాధించిన అభివృద్ధిలో 300 శాతం కనిపించింది! అలా అనేక విభాగాలలో ముందడుగు వేసిన వనితలు ఈ రోజున, ఒక రోజున పురుషులకే పరిమితమైన ఉద్యోగాలలో ప్రవేశించి ప్రకాశిస్తున్నారు. ఒకసారి అమెరికా కేసి చూద్దాం.

అమెరికాని అన్నివిధాలా ముందంజవేసిన దేశంగా చెప్పుకుంటారు. ఆ అమెరికాలో నేడు మూడు కోట్లతొంభై లక్షలమంది వనితలు ఉద్యోగాలలో వున్నారు. ఉద్యోగాలు చేస్తున్న ఐదుగురిలో ఇద్దరు వనితలు కనిపిస్తారు. పదహారు సంవత్సరాలు పైబడిన వనితలలో నలభై ఒక్కశాతం ఉద్యోగాలు చేస్తున్నవారు కాని లేక ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నవారు కాని వున్నారు. ఈ శాతం 1960లో ముప్పైమూడు మటుకే వుండేది.

అమెరికన్ ఆర్థికశాస్త్ర నిపుణుడు కర్టిస్ గిలోరి "అమెరికాలో, పని చేయవలసిన అవసరం వుంది కనుక వనితలు పని చేస్తున్నారు. పురుషులకి తాము ఏ మాత్రమూ తీసిపోమనే ఆత్మవిశ్వాసం వారిలో ఏర్పడింది. కుటుంబ నిర్వహణలో తమకీపాత్ర వుందనే నైతికబాధ్యతని వారు గుర్తించారు" అన్నాడు.

అలాగే, మన దేశంలోనూ వనితలు చెప్పుకోదగ్గగా పురోగమించారు. 1959 – 60 మధ్య కాలంలో ఏదో ఒక ఉద్యోగంలో వున్న వనితల సంఖ్య ఒక కోటి తొంభై లక్షలయితే అది ఈ రోజున మూడుకోట్ల పదమూడులక్షలకి పెరిగింది. అనాదిగా వస్తున్న మూఢ ఆచారాలని అవతలకు నెట్టి, మంచి సంప్రదాయాలను గౌరవిస్తూ భారతీయ వనిత సాధిస్తున్న విజయాలను ప్రపంచం హర్షిస్తోంది.

ప్రముఖ దేశాలలో ఒకటయిన చైనాలో ఆర్థిక వ్యవస్థను మెరుగుపరచడానికి వనితలు ఎంతగానో శ్రమిస్తున్నారనే వార్త ఈ మధ్యనే పూర్తి వివరాలతో వెలుగులోకి వచ్చింది. చైనాకి ఇతర దేశాలకి మధ్య వున్న మంచుతెరలు కరిగిపోతూ, మాయపొరలు తొలగిపోతున్న సమయంలో వెలువడిన ఈ వార్తకి ఎంతో ప్రాముఖ్యం లభించింది.

పెకింగ్‌లో 'నేషనల్ విమెన్స్ కాంగ్రెస్' సమావేశం ఈ మధ్యనే జరిగింది. పన్నెండు సంవత్సరాలుగా చైనా వనితలకి 'సాంస్కృతిక విప్లవం' ధర్మమా అని ఏ విధమయిన సంఘటిత కార్యమూ సాధించడానికి అవకాశం కలసిరాలేదు. అలా పుష్కరకాలం తర్వాత సమావేశమయిన 'నేషనల్ విమెన్స్ కాంగ్రెస్'లో శక్తివంతమయిన ఆధునిక సోషలిస్టు సామ్రాజ్యంగా చైనాని రూపొందించాలని వనితలు తీర్మానించారు. ఆ లక్ష్య సాధనకోసం వారు కొత్త 'రాజ్యాంగం' రూపొందించుకున్నారు.

ఆ సమావేశంలో రూపొందించుకున్న కార్యక్రమంలో ముఖ్యమయిన అంశాలు వర్గపోరాటంలో ప్రముఖపాత్ర వహించడం, ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి కృషిచేసి ఆర్థికవ్యవస్థని మెరుగుపరచడం, శాస్త్రీయ సాంకేతిక విద్యలని క్షుణ్ణంగా అభ్యసించడం, ఇంటి పనులు చకచకా చేయడానికి ఆధునిక విధానాలు ప్రవేశపెట్టడం, ఇవన్నీ అమలులోకి రావడానికి వీలుగా జాతీయ వనితా సమాఖ్యని ఏర్పరచి దానికి అనుబంధంగా దేశం నలుమూలలా వనితా సంఘాలు పని చేయడానికి కార్యక్రమాన్ని రచిస్తున్నారు. అలా చైనాలోని వనితలు 'ప్రపంచం' దృష్టిలోకి వస్తున్నారు.

ఒకప్రక్క వనితలు వార్తలలోకి వస్తూవుంటే మరొకప్రక్క ప్రపంచంలో రాజకీయమయిన పరిణామాలు సంభవిస్తూనే వున్నాయి. ఇంకొకప్రక్క ప్రకృతి ప్రళయతాండవం చేసింది.

ఇరాన్‌లో రాజకీయమయిన అశాంతి ఏర్పడి అలజడులు, అల్లర్లు ప్రారంభమయి సద్దుమణగకుండానే ప్రకృతి విలయతాండవం చేసింది. ప్రపంచంలో కెల్లా మొట్టమొదటి సామ్రాజ్యంగా ఇరాన్‌నే చెప్పుకుంటారు. ఇరాన్‌కి 25 శతాబ్దాల చరిత్ర వుంది. 1935 వరకూ 'పెర్షియా'గా చలామణీ అయిన దేశమే ఆ తర్వాత ఇరాన్‌గా మారింది.

1941 లో సింహాసనానికి వచ్చి 1953 లో సర్వాధికారాలు స్వీకరించిన ఇరాన్ షా–మహమద్ రెజాపహ్లవీ ఎంత నిరంకుశంగా వ్యవహరించినా ప్రజాభ్యుదయానికి కొన్ని మంచి పనులూ చేయకపోలేదు. వీటిలో ముఖ్యమయినది వనితలకి ఓటింగ్ హక్కు కల్పించడం. అలాగే భూసంస్కరణలు ప్రవేశపెట్టి, పరిశ్రమలు పెద్దపెట్టున ప్రారంభించడానికి అవకాశం షా కల్పించాడు. ఈ సంస్కరణలు చాలవనీ, దేశంలో ప్రజాస్వామ్యం పూర్తిగా స్థాపించాలనీ షా వ్యతిరేక శక్తులు చేసిన ఆందోళన ఈ మధ్య తీవ్రరూపం దాల్చింది. రాజధాని టెహరాన్‌లో ఉద్యమకారులకి, సైనికులకి జరిగిన పోరాటంలో ఎంతో జననష్టం కలిగింది. సింహాసనం మీద కూర్చుని ప్రజాస్వామ్యాన్ని అమలుపరచాలని తలచడంతో షా అన్ని ఇబ్బందులని ఎదుర్కొంటున్నాడు. అలా ఇరాన్‌లో ప్రారంభమయిన అల్లర్లతో అగ్ని మీద ఆజ్యం పోసినట్లు భయంకరమయిన భూకంపం 'చేతులు' కలిపింది.

ఇరాన్‌లోని తబస్, ఫిరదౌస్ నగరాలలో సంభవించిన భూకంపంలో పదకొండువేలమంది భూమాత ఒడిలోకి చేరారు. రాజకీయమయిన అల్లకల్లోలాలకే కాక భూకంపాలు తరచు ఇరాన్‌లో సంభవిస్తూ వుంటాయి. ఈ శతాబ్దంలో అక్కడ ఇరవయివేలసార్లు భూకంపాలు సంభవించి అరవయివేలమంది మరణించారని ఒక అంచనా. □

# ఐటెక్స్
## కాటుక & తిలకము

నాణ్యతలో గొప్పవి
అందమైన రంగులు












ARAVIND LABORATORIES MADRAS-600 033

AL-TEL 42

---




# "లోధ్ర" టానిక్
# వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికీ నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికీ "లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్యమయమైన జీవితాన్ని గడపండి.

75 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

Sistas

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

PIN ____________

**కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్**

15, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు : శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు, బెంగళూరు




**1973**వ సంవత్సరం....

అందాల పారిస్ నగరంలో అంతర్జాతీయ సాంస్కృతిక కళోత్సవాలు అద్భుతంగా జరిగాయి. భారతదేశం తరఫున పాల్గొన్న నాట్యబృందం ప్రపంచ ప్రముఖుల మన్ననలు పొందింది. ఆ బృందంలో పాల్గొన్న ఓ అమ్మాయి ప్రదర్శనలను గురించి 'లే అరోరే' అన్న ఫ్రెంచి పత్రిక—"పెద్దల మధ్య ఆ పదహారేళ్ళ బాలిక రంగురంగుల దుస్తులతో, ఒక్కొక్క ప్రదర్శనలోనూ—ప్రేమ, విరహం, విషాదం లాంటి భావాలను తన అందాల కళ్ళతోనే సునాయాసంగా మవ్యక్తం చేసింది" అని జోహారులు అర్పించింది.

పదహారేళ్ళ ప్రాయంలోనే అంతర్జాతీయ కళా రంగంలో గుర్తింపు సాధించిన ఆ అమ్మాయి అలర్ మేల్ వల్లి! పదేళ్ళ ప్రాయంలో ఆమె పాదాలను అలంకరించిన మువ్వలు ఇప్పటివరకు సుమారు మూడు వందలకు మించిన ప్రదర్శనలలో ప్రేక్షక హృదయాలలో ఆనందనాదాలు వినిపించాయి!

పదో యేటనే నాట్యరంగ ప్రవేశం చేసిన ఈమె పందణైనల్లూర్ చొక్కలింగం పిళ్ళై దగ్గర భరతనాట్యం నేర్చుకున్నారు.

వల్లి భరతనాట్య ప్రదర్శనలను ఎందరో పెద్దలు ఎన్నో విధాలుగా ప్రశంసించారు. "పూర్తిగా వికసించి నిండైన రంగు—అందచందాలుగల గులాబీ పువ్వును ఒక అందాల గాజు కుండీలో అమర్చితే ఎంత ప్రకాశవంతంగా వుంటుందో అంతటి మనోజ్ఞమైనది వల్లి నాట్యం" అంటారు—అఖిల భారత సంగీత నాటక అకాడెమీలోని అధ్యక్షులు కె. పి. యస్. మీనన్.

"నాట్యశాస్త్రంలో చెప్పబడిన అన్ని లక్షణాలూ గల అలర్ మేల్ వల్లి హావభావాలు—కళ్ళు కదలికలు, ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్ర వేస్తాయి. పుట్టుకతోనే, పాదాల మీద మువ్వలతో పుట్టారా అన్న ఆశ్చర్యం కల్గిస్తుంది" అన్నారు. ప్రముఖ కళా విమర్శకులు ప్రొఫెసర్ సాంబమూర్తి!

ఇప్పటివరకు పదిసార్లు విదేశాలు పర్యటించిన వల్లి తన పదకొండవ యేటనే పారిస్‌లో జరిగిన సాంస్కృతిక ఉత్సవాలలో మొట్టమొదటిసారిగా పాల్గొన్నారు. ఆ ఉత్సవాలలో పాల్గొనడానికి వచ్చిన ఒక ఒడిస్సీ నాట్య కళాకారిణితో యేర్పడిన పరిచయం - ఈమెలో ఒడిస్సీ నాట్యం నేర్చుకోవాలనే అభిలాషకు అంకురం అయింది. భారతదేశానికి తిరిగి రావడమే తడవుగా-సుప్రసిద్ధ ఒడిస్సీ నాట్యచారులు కేళూచరణ్ మహాపాత్రోవద్ద నాట్యం అభ్యసించడం ప్రారంభించారు.

"సున్నితమైన · లయవిన్యాసాల సొంపైన మేళవింపు ఒడిస్సీ నాట్యం. ప్రదర్శనా సామర్థ్యం అనుసరించి దాని పరిపూర్ణత బయట పడుతుంది. అటువంటి పరిపూర్ణతతో, నిండుదనంతో అలర్ మేల్ వల్లి ఒడిస్సీ నాట్యం బాగా ఆకట్టుకుంది." ఆమె ఒడిస్సీ నాట్య ప్రదర్శన గురించి మెయిల్ (ఆంగ్ల) పత్రిక సమీక్ష ఇది!

మద్రాసు టెలివిజన్ ప్రదర్శించిన తొలి ఒడిస్సీ నాట్యం అలర్ మేల్ వల్లి కార్యక్రమమే. కాని ఆమెకు ఇది తొలి అనుభవం కాదు. ఎంచేతంటే ఆమె అంతకుముందే పలు విదేశాలలో, ముఖ్యంగా టెహ్రాన్ విశ్వవిద్యాలయాల కార్యక్రమాలలోనూ, నేషనల్ ఇరాన్ రేడియో టెలివిజన్ కార్యక్రమాలలోనూ పాల్గొన్నారు.

భావ, రాగ, తాళయుక్తమైన భరతనాట్యంలోనూ, కాంతి, ఆకర్షణ లయ మిళితమైన ఒడిస్సీ నాట్యంలోనూ అద్భుతమైన ప్రతిభను కనబరచే అలర్ మేల్—"నాట్య ప్రదర్శనలలో సంగీతానికి చాలా ప్రాముఖ్యం వుంది. సంగీత జ్ఞానంతో అభినయిస్తే నాట్యం బాగా రక్తి కడుతుంది. అంచేత నేను కర్ణాటక సంగీతం నేర్చుకుంటున్నాను" అంటారు.

నాట్య కార్యక్రమాలలో ప్రదర్శనకు ముందే ఆంగ్లంలో దానిని గురించి ఆమె క్లుప్తంగా వ్యాఖ్యానిస్తారు. ఇటువంటి వివరణలవల్ల విదేశీయులు కూడా వీటిని బాగా అర్థం చేసుకుని ఆనందించడానికి అవకాశం ఎక్కువ. ఆంగ్లం తెలియని విదేశాలలో కూడా నాట్య ప్రదర్శనలు ఇవ్వవలసి వుంటుంది. అందువల్ల ఆమె ఫ్రెంచి భాష నేర్చుకుంటున్నారు. వల్లి—ప్రస్తుతం మద్రాసు స్టెల్లా మేరీస్ కళాశాలలో ఆంగ్ల సాహిత్య విద్యార్థిని!

"భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను విదేశీయులు తెలుసుకోడానికి భారతీయ కళలపట్ల వారి అభిరుచిని పెంపొందించడానికి కొంతవరకైనా సహాయ పడగలిగినందుకు నేనెంతో సంబర పడుతున్నాను." అన్నారామె. హాలెండ్ రేడియోతో జరిపిన ఒక ఇష్టాగోష్ఠిలో. ఈ ఆశయానికి తగిన విధంగా విదేశీయ ప్రతినిధులకు, ప్రముఖులకు తన నాట్య కార్యక్రమాలు ప్రదర్శించి చూపడానికి అనుకూలంగా తమ ఇంటి వద్ద ఒక చిన్న వేదికను ఆమె అమర్చుకున్నారు.

"భరత నాట్యం కీర్తి ప్రపంచం నలుమూలలా వ్యాపించడానికి కృషి చేయాలి. ఒడిస్సీ నాట్యంలో ఉత్తమ కళాకారిణిగా పేరు సంపాదించాలి. ఇవే నా జీవిత లక్ష్యాలు" — అంటారు 'దీపావళి అభినందనలు' తెలుపుతున్న కుమారి అలర్ మేల్ వల్లి!

నాగభూషణం సమర్పించు




గౌరీశ్వరీ ఆర్ట్స్

# ప్రేమ చేసిన పెళ్లి

ఈస్ట్‌మన్ కలర్



స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**విజయనిర్మల**

నిర్మాత
**సి.గౌరీశ్వరి**

ఛాయ: పుష్పాల గోపీకృష్ణ
కథ-మాటలు: రాజశ్రీ
సంగీతం: సత్యం

పూర్ణా రిలీజ్





# అద్దేపల్లి వివేకానంద దేవితో గోష్ఠి



"నేటి విద్యా విధానంలో ముఖ్యమైన లోపం ముప్పాతిక మువ్వీసం అది వృత్తిపరమైనది కాకపోవడమే. దేశ పురోగమనానికి వృత్తిపరమైన విద్య ఎంతో దోహదం చేస్తుంది. వృత్తి విద్యా విధానమే మంచిది. అయితే ఈ విషయం గురించి ఎవరూ ఆలోచిస్తున్నట్లు లేదు. కర్నాటక రాష్ట్రంలో ఇరవైదాకా పాలిటెక్నిక్‌లు వున్నాయి. మరి మన రాష్ట్రంలో వున్న పాలిటెక్నిక్‌లను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చును. అందులో స్త్రీలకు ప్రత్యేకించి ఎన్ని వున్నాయో జగద్విదితం.

స్త్రీలకు నర్సింగ్ కోర్సులు ప్రారంభించవచ్చు. ఇలా శిక్షణ పొందినవారు గ్రామాంతరాలకు వెళ్ళి అక్కడ మంత్రసానులుగానో, వైద్యులకు సహాయకులు గానో వుండవచ్చును. మామూలు మంత్రసానులకన్న యిలా శిక్షణ పొందినవారు ఎంతో మేలు కదా. అలాగే ఆహారసంబంధమైన సాంకేతిక

పరిజ్ఞానాన్ని అందించే కేటరింగ్ కోర్సులు కూడా ప్రారంభించాలి. గృహాలంకరణ, టైలరింగ్‌లలోనూ డిప్లొమా తరగతులు ప్రవేశపెట్టాలి. ఇవి స్త్రీలకు ఎంతో మేలు చేస్తాయి.

ఇదివరలో అయితే యిటువంటి వృత్తిపరమైన కోర్సులకి యింతవరకు చదువుకుని వుండాలి-అన్న నియమాలేమీ వుండేవి కాదు. అందువల్ల భర్తచే పరిత్యజించబడిన యువతులు, వితంతువులు, నిస్సహాయులు ఐన స్త్రీలు ఆయా వృత్తులలో శిక్షణ పొంది వుపాధి కల్పించుకునేవారు. కాని నేడు వీటికి కూడా ఏడవ తరగతిలో వుత్తీర్ణులై వుండాలన్న నిర్భంధాన్ని విధించారు. ఇది చాలా విచారించదగ్గ విషయం. ఎందుకంటే మన రాష్ట్రంలో గ్రామ ప్రాంతాలలో....అంతెందుకు — నగరాలలో పెళ్ళికి ముందు ఎంతమంది ఏడవ తరగతివరకు చదువుకున్నారు? ఆ విధంగానే యువకులలో చాలామంది వ్యవసాయాన్నే నమ్ముకుని బ్రతుకుతున్నారు. వాళ్ళకి మామూలు డిగ్రీ చదువులు చదువుకుని వుద్యోగాలు చెయ్యవలసిన అవసరం వుండదు. అటువంటి వారికి వ్యవసాయంలో ఆధునిక పద్ధతులు నేర్పేందుకు శిక్షణా కేంద్రాలు తెరవాలి. అంతేకాని యిన్ని కళాశాలలు తెరిచాం....యింతమంది పట్టభద్రులను వుత్పత్తి చేశాం అని చాటి చెప్పడం వల్ల లాభం ఏముంది?" — అని అన్నారు ప్రముఖ విద్యావేత్త, రచయిత్రి శ్రీమతి అద్దేపల్లి వివేకానందాదేవి 'వనిత' జరిపిన యిష్టాగోష్ఠిలో నేటి విద్యావిధానం గురించి చెబుతూ.

శ్రీమతి వివేకానందాదేవి ఇరవైఅయిదు సంవత్సరాలుగా రాజమండ్రిలో విద్యాభివృద్ధికి కృషి చేస్తున్నారు. ఆ విధంగా ఆమె స్థాపించిన పాఠశాల 'నివేదిత కిశోర్ విహార్' ఈ సంవత్సరం రజతోత్సవం చేసుకుంటోంది. 1968 లో ఆమె హితకారిణి సమాజం వారి సహకారంతో కందుకూరి రాజ్యలక్ష్మి స్త్రీల కళాశాల స్థాపించారు. ఈ కళాశాల ప్రారంభించడంలో తను ఎన్నో యిబ్బందులను ఎదుర్కోవలసి వచ్చిందన్నారు ఆమె. ప్రస్తుతం యిక్కడ పదకొండువందలమంది విద్యార్థినులు విద్య నభ్యసిస్తున్నారు. గత సంవత్సరం ఆమె కోడలు స్వర్గీయ అద్దేపల్లి మహాలక్ష్మి పేరిట బి. ఇడి కళాశాలను స్థాపించారు. 175 మంది పరీక్షకు హాజరయ్యారు. అందులో ఆమె కూడా ఒకరు కావడం ఒక విశేషం!

"ఇన్నేళ్ళు వచ్చిన తరువాత యింకా చదువేమిటని ఆశ్చర్యపోతున్నారా? ఏం లేదు. మా మనవలకి యింట్లో చదువు చెప్పబోతే వాళ్ళు 'మామ్మా! నీకు ఆ కాలం చదువు తెలుసు కాని యిప్పటి చదువేం తెలుసు?' అని అనడం ప్రారంభించారు. దాంతో నేను ప్రారంభించిన బి. ఇడి కళాశాలలోనే విద్యార్థిని అయ్యాను." అన్నారామె.

ఆనాటి విద్యా విధానానికి, నేటి బోధనాపద్ధతికి గల తేడాల గురించి ప్రశ్నించగా - "మునుపటి రోజులతో పోల్చిచూస్తే ప్రస్తుత విద్యావిధానం పతనం చెందిందనే చెప్పవచ్చు. పూర్వం ఒక ధ్యేయంతో చక్కటి ఆదర్శాలతో విద్య అభ్యసించడం జరిగేది. అట్లాగే ఉపాధ్యాయులలో కూడా తాము నేర్చింది నలుగురికి చెప్పాలనే తపన ఆ రోజుల్లో అధికంగా వుండేది. కాని యిప్పుడు అంత ఓపిగ్గా చెప్పేవారూ లేరు; ఒకవేళ ఒకరో ఇద్దరో వున్నా అంత శ్రద్ధగా వినేవారూ లేరు. అంతా గైడ్‌ల మయం అయిపోయింది. డిగ్రీకోర్సు వాళ్ళకి గైడ్‌లే....మూడో తరగతి వాళ్ళకి గైడ్‌లే. పాఠ్యగ్రంథాలు కొనడం తప్ప పూర్తిగా చదివే ఓపిక విద్యార్థులలో తగ్గిపోయింది. అప్పటికీ యిప్పటికీ జీవన విధానం, ఆదర్శాలూ మారిపోయాయి మరి. అందుకు కారణం ఒకరని ప్రత్యేకించి విద్యార్థులను గాని, వుపాధ్యాయులను గాని వేలు చూపించి చెప్పలేము" అన్నారు ఆమె.

"దేశమంతటా ఒకే విధమైన విద్యాబోధన

వుండాలంటున్నారు. ఆ విధంగానే 10+2+3 విధానం క్రమక్రమంగా అన్ని ప్రాంతాలలోనూ అమలులోకి వస్తోంది. దీనిపై మీ అభిప్రాయం ?''

"10+2+3 పద్ధతి మంచిదే. దేశమంతటా ఒకే విధమైన విద్యావిధానం వుండటం శ్రేయస్కరం. ఇందులో లాభమూ, సదుపాయమూ వున్నాయి. ఏడు తరువాత గానీ, పదవతరగతి తరువాత గానీ +2 తరువాత గానీ - యిలా డిగ్రీ పొందేందుకు మధ్యలోనే ఎవరికి కావలసిన సాంకేతికశాస్త్రంలోని సర్టిఫికేటు, డిప్లొమా కోర్సులు వారు చేయవచ్చును. డిగ్రీ పూర్తయిన తరువాతనే వుద్యోగ ప్రయత్నాలు లేకుండా ఈ సదుపాయం బాగానే వుంది. అయితే పాఠ్యపుస్తకాలను జాతీయం చెయ్యడం అనవసరం అని నా భావన'' అన్నారామె.

"ఈ మధ్య భాషా సమస్య తీవ్రస్థాయి నందుకుంది. తమిళనాడువంటి కొన్ని రాష్ట్రాలు ద్విభాషా సూత్రాన్నే కోరుతున్నాయి. ప్రాంతీయ భాష, ఆంగ్లం చాలంటున్నాయి. హిందీ అవసరం లేదంటున్నాయి. మరి త్రిభాషా సూత్రం ఎంతవరకు మంచిదంటారు ?''

"విభిన్న రాష్ట్రాలకి, భాషలకి చెందిన మనదేశ వాసులకు కొన్ని దశాబ్దాలుగా వారధి వంటిది ఆంగ్ల భాష. అందుకు సందేహం లేదు. త్రిభాషా సూత్రం మంచిదే. కాని హిందీ అధికార భాషగా వుండాలని కొందరు, వుండకూడదని కొందరు వాదిస్తూ అనవసరంగా కాలయాపన చేస్తున్నారు. అసలు భారతీయ భాషలకి మాతృక సంస్కృతం. సంస్కృతం అధికార భాషగా పెడితే ఈ గొడవ వుండదు కదా. త్రిభాషా సూత్రం అమలుపరచినట్లూ వుంటుంది. భాషా సమస్యకు చెందిన గొడవా అంతమవుతుంది'' అంటూ తన అభిప్రాయం వ్యక్తం చేశారు ఆమె.

"మన పొరుగు రాష్ట్రాలయిన కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలతో పోల్చి చూస్తే ఆంధ్రరాష్ట్రంలో చదువరుల శాతం చాలా తక్కువగా వుంది. ఇందుకు కారణం - విద్యావకాశాలు లేకపోవడమా....లేక వుపాధ్యాయులు సరైన శిక్షణ యివ్వకపోవడమా?''

"ఈ రెండూ కాదు. అసలు వుపాధ్యాయుల కొరతే అధికంగా వుంది. అందుకుతోడు కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలతోనూ, కేరళతోనూ పోల్చి చూస్తే మన రాష్ట్రం ధనిక రాష్ట్రం. కాని, చదవాలి....పైకి రావాలి అనే వుత్సాహం, కుతూహలం మన యువతరంలో అంతగా కనిపించడం లేదు. కేరళలో చూడండి. ప్రతి యువతి కనీసం పదో తరగతివరకూ చదివి వుంటుంది. అక్కడ కొంత పేదరికం కారణాన జీవన పోరాటం అధికంగా కనిపిస్తుంది. విద్య అవసరం తమకు ఎంతైనా వుందన్న అవగాహన వారు పొందారు. అట్లాగే తమిళనాడులో కూడా. అందుకు తగ్గట్టుగానే వారు అవసరమైన సౌకర్యాలు ఏర్పరచుకున్నారు. మన రాష్ట్రంలో అసలు చదువుకోవాలనే వుద్దేశ్యం వున్నా అందరికీ ఆ అవకాశాలూ, సదుపాయాలూ ఏవి? ఎక్కడో మారుమూల గ్రామంలో వున్నవారు చదువుకోవాలని అనుకున్నారనుకోండి. వాళ్లు కాస్త పై చదువులకే దగ్గరలో వున్న చిన్న పట్నాలకి రావాలి. అలా నాలుగైదు మైళ్లు వెళ్ళి చదువుకుందామనుకున్నా చక్కటి రోడ్లు ఏవి? బస్సు సదుపాయాలు ఎక్కడున్నాయి? అదే మన రాష్ట్రానికి యితర రాష్ట్రాలకి తేడా.

అంతే కాదు. ఎకరం, రెండెకరాలు పొలం వున్న వాళ్లు - 'ఆఁ ఏం చదువుతాంలే వ్యవసాయం చేసుకుందాం' అని, కాస్త పొలం పుట్రా వున్నవాళ్లు ఓ మోస్తరు చదువు చదివి ఆ తరువాత 'వుద్యోగాలు చెయ్యడానికా .... వూళ్ళేలడానికా' అని ఆపేస్తున్నారు. అయితే అందరూ అటువంటి కోవకు చెందినవారు కారనుకోండి. మన గ్రామాలలోని అధిక సంఖ్యాకుల మాట నేను చెబుతున్నాను. ఇకపోతే మన రాష్ట్రంలో అధిక సంఖ్యాకులైన చదువరులు ఎవరు? అంటే - మధ్య తరగతి కుటుంబీకులని నిస్సందేహంగా చెప్పవచ్చును. వాళ్ళకి చదువుకోవడం ఎట్లాగూ తప్పదు కాబట్టి నేడు విద్యాలయాల్లో వారి సంఖ్యే అధికంగా కనిపిస్తోంది. కాని మన జనాభాలో అధిక సంఖ్యాకులు గ్రామస్తులే అయినప్పుడు. వారి పరిస్థితి ఆ విధంగా వుండడంతో నిరక్షరాసులే ఎక్కువగా కనిపిస్తున్నారు మరి'' అన్నారు ఆమె.

వివేకానందదేవి వివిధ రంగాలలో పలు పదవులు నిర్వహించారు. ప్రస్తుతం ఆమె - రాష్ట్ర సాంఘిక సంక్షేమ బోర్డులోనూ, రాష్ట్ర స్త్రీ విద్యా సమాఖ్యలోనూ సభ్యురాలుగానూ, రాజమండ్రి లేడీస్‌క్లబ్ స్థాపక సభ్యురాలుగానూ, అఖిల భారత శ్రీ శారదా సంఘం (కలకత్తా) ఉపాధ్యక్షురాలుగానూ, అఖిల భారత స్త్రీల సమాఖ్య, రాజమండ్రి శాఖకు స్టాండింగ్ కమిటీ సభ్యురాలుగానూ వుంటున్నారు.

ఆమె భర్త అద్దేపల్లి నాగేశ్వరరావు-రాజమండ్రిలోని సరస్వతి పవర్ ప్రెస్ యజమాని. వారికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

1959 లో భర్తతోపాటు వివేకానందదేవి కూడా అమెరికాలోని సంక్షేమ సంస్థల కార్యకలాపాలు పరిశీలించడానికి వెళ్ళారు. అప్పుడే ఆమె - ఇంగ్లండు, స్విట్జర్లాండు, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, హాలండ్, ఈజిప్ట్ దేశాలు కూడా పర్యటించారు.

శ్రీమతి వివేకానందాదేవి విద్యా రంగంలోనే కాక సాహిత్యరంగంలో కూడా విశేషమైన కృషి చేశారు.

1943 నుంచి ఆమె కథలు రాస్తున్నారు. ఆ సంవత్సరంలోనే ఆమె పట్టభద్రురాలు కావడం, ఆమెకు వివాహమవడం కూడా జరిగాయి.

ఆమె మొదటి నవల - 'భిన్న స్వరాలు'. 'కల్యాణ ఘడియ' ఆమె రాసిన మరో నవల. 'వెలుగు నీడలు', 'అగ్ని గుండాలు' పేరిట ఆమె రాసిన కథా సంపుటాలు వెలువడ్డాయి. ఆమె నూరుకు పైగా కథలు రాశారు. ఆమె రాసిన 'క్షేత్రయ్య' సంగీత రూపకం ఆకాశవాణిలో ప్రసారితమయింది.

అమెరికా రాయబార కార్యాలయం సాంస్కృతిక విభాగం-యు. ఎస్. ఐ. ఎస్. వారికి ఆమె పదమూడు పుస్తకాల దాకా అనువదించారు. దక్షిణ భాషా పుస్తక సంస్థవారికి కూడా చాలా పుస్తకాలు, వ్యాసాలు రాశారు. అలా రాసిన వాటిలో 'వంటింటి సౌభాగ్యం', 'అమెరికా ఉత్తమ స్త్రీ ఉల్‌వర్త్ చరిత్ర', 'నాలుగు నాటికలు', 'భారత జనాభా-కుటుంబనియంత్రణ' (డా॥ చంద్రశేఖర్ రచనకు అనువాదం), 'మన శరీర నిర్మాణం' మొదలైనవి. ప్రస్తుతం అచ్చులో వున్న రచన-చిన్న పిల్లల కోసం రాసిన 'రాము-సోము'.

ఆమె అభిమాన రచయిత్రి పెరల్ ఎస్. బక్.

నేడు సాహిత్యపు విలువలు దిగజారిపోయాయని కొందరు అంటున్నారు — దీనిపై మీ అభిప్రాయం ఏమిటని అడగగా — "అన్నిటికీ సాహిత్యపు విలువలు వుండవు. అలా వుండాలన్న నియమమూ లేదు. సృష్టిలో ప్రతిదానికి విలువ వున్నట్లే కాలక్షేపం కోసం రాసే వాటికి కూడా - వాటి విలువ వాటికి వుంటుంది. కాని ప్రమాద భూయిష్టమైన సాహిత్యం నేడు బజార్లో విరివిగా కనిపిస్తోంది. ఇటువంటి చవకబారు సాహిత్యం యువతరాన్ని పాడుచేస్తుంది. కాబట్టి అటువంటి దాన్ని మాత్రం ప్రోత్సహించకూడదు. అంతే'' అన్నారు వివేకానందా దేవి. □

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ఖ | | ಖ | ഖ | ख | ખ | ଖ |
| ఖా | | ಖಾ | ഖാ | खा | ખા | ଖା |
| ఖి | | ಖಿ | ഖി | खि | ખિ | ଖି |
| ఖీ | | ಖೀ | ഖീ | खी | ખી | ଖୀ |
| ఖు | | ಖು | ഖു | खु | ખુ | ଖୁ |
| ఖూ | | ಖೂ | ഖൂ | खू | ખૂ | ଖୂ |
| ఖృ | | ಖೃ | — | खृ | ખૃ | ଖୃ |
| ఖౄ | | — | — | — | — | — |
| ఖె | | ಖೆ | ഖെ | — | — | — |
| ఖే | | ಖೇ | ഖേ | खे | ખે | ଖେ |
| ఖై | | ಖೈ | ഖൈ | खै | ખૈ | ଖୈ |
| ఖొ | | ಖೊ | ഖൊ | — | — | — |
| ఖో | | ಖೋ | ഖോ | खो | ખો | ଖୋ |
| ఖౌ | | ಖೌ | ഖൗ | खौ | ખૌ | ଖୌ |
| ఖం | | ಖಂ | ഖം | खं | ખં | ଖଂ |
| ఖః | | ಖಃ | ഖഃ | खः | ખઃ | ଖଃ |

* తమిళంలో మన క ఖ గ ఘ లకు—ఒకే అక్షరం (க) వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# న్యాయమూర్తి సుజాతా మనోహర్

బొంబాయిలో ప్రముఖ న్యాయవాది శ్రీమతి సుజాతా మనోహర్ – ఈ సంవత్సరం జనవరి నెలలో మహారాష్ట్ర న్యాయస్థానానికి న్యాయమూర్తిగా నియమించబడ్డారు. ఆ విధంగా మహారాష్ట్రలో న్యాయమూర్తిగా నియమితురాలైన తొలి వనిత ఆమె కావడం విశేషం.

సరిగ్గా ఇరవై సంవత్సరాల క్రితం....

బొంబాయిలోని సివిల్ కోర్టులో న్యాయవాదిగా నమోదు చేయించుకున్నారు సుజాత. కాని ఆమె చేపట్టిన మొదటి కేసు మాత్రం క్రిమినల్ కేసు. ఒక బాలుడు ఒక వ్యక్తిని హతమార్చాడు:— అదీ కేసు. ఆ బాలుడి తరపున వకాల్తా పుచ్చుకుని వాదించారు సుజాత. ఆమె వాదనా పటిమ చూసిన వారందరూ భావించినట్టుగానే, ఆ బాలుడు భవిష్యత్తులో అటువంటి నడవడికకు గురికాకుండా వుండడానికి–సంస్కరణార్థం–రిఫార్మ్ స్కూల్‌కి పంపబడ్డాడు.

సుజాత విషయంలో చేపట్టిన కేసు ఓడిపోవడమన్నది చాలా అరుదుగా జరిగేది. "అసలు ఒక కేసు చివరికి ఏ విధంగా పరిణామం చెందుతుంది అనేది ఎవరూ నిక్కచ్చిగా చెప్పలేరు. ఇక ఫలితమంటారా....న్యాయవాది వాదనాపటిమ మీద, సాక్షుల మీద, క్రాస్ ఎక్జామినేషన్ మీద ఆధారపడి వుంటుంది" అంటారు ఆమె.

పాఠశాలలో చదువుతున్నప్పుడే ఆమె చదువులోనూ, క్రీడలలోనూ కూడా ప్రథమస్థానంలో వుండేవారు. ఎన్నో బహుమతులు పొందారు.

ఎలిఫన్‌స్టన్ కళాశాలలో చదివే రోజులలో ఆమె విద్యార్థి సంఘానికి అధ్యక్షురాలుగా వుండేవారు. అప్పుడే 'మిస్ ఎలిఫన్‌స్టన్'గా కూడా ఆమె ఎన్నికయ్యారు.

న్యాయశాస్త్రంలో పట్టభద్రురాలైన తరువాత సుజాత ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డ్‌కు వెళ్ళారు. అక్కడ తత్వశాస్త్రం, రాజకీయ, అర్థికశాస్త్రాలు పాఠ్యాంశాలుగా ఎం. ఏ పట్టం అందుకున్నారు. ఆ తరువాత లండన్‌లోని లింకన్స్ ఇన్ లో బారిష్టర్ పట్టం పొందారు. మన దేశ నాయకులు ఎందరో ఆ విద్యాపీఠం నుంచే న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణులు కావడం గమనించదగ్గ విషయం!

ఇంగ్లండులో కూడా ఆమె సాంస్కృతిక కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఇన్స్ కోర్ట్ విద్యార్థుల పత్రికకు సంపాదకురాలుగా వ్యవహరించారు. ఆటలలో ప్రవేశమూ, వుత్సాహమూ వున్న సుజాత టేబుల్ టెన్నిస్‌లో 'ఆక్స్‌ఫర్డ్ హాఫ్ బ్లూ' పొందారు. ఆ విధంగా 'హాఫ్ బ్లూ' పొందిన ప్రథమ భారతీయురాలు ఆమె.

మాతృదేశానికి తిరిగివచ్చిన తరువాత ఆమె న్యాయవాద వృత్తితోపాటు తన సంఘ, సంక్షేమ కార్యక్రమాలు కూడా కొనసాగించారు. ఆమె పలు విద్యా, సాంఘిక సంస్థలతో సంబంధ బాంధవ్యాలు పెంపొందించుకున్నారు. న్యాయమూర్తి పదవినలంకరించేందుకు ముందు ఆమె మహారాష్ట్ర స్త్రీల సమాఖ్య పార్లమెంటరీ కమిటీకి అధ్యక్షురాలుగా వుండేవారు.

మహారాష్ట్రలో న్యాయమూర్తిగా నియమితురాలైన ప్రథమ వనిత ఆమె కావడం విశేషమే కావచ్చు. కాని న్యాయమూర్తి పదవి వారి కుటుంబానికి కొత్తకాదు. ఆమె తండ్రి స్వర్గీయ కె. టి. దేశాయ్ గుజరాత్‌లో ప్రధాన న్యాయమూర్తిగా వుండేవారు. అసలు తండ్రిగారి నుంచి పుణికి పుచ్చుకున్న వుత్సాహంతోనే చిన్ననాటి నుంచి తనూ న్యాయవాది కావాలని వువ్విళ్ళూరేవారు సుజాతా మనోహర్.

సుజాత హాబీలలో రచనా వ్యాసంగం ఒకటి. ఆమె న్యాయవాదిగా వున్నప్పుడు స్త్రీలకు న్యాయసూత్రాలలో సలహాలిస్తూ రచనలు చేసేవారు. కాని న్యాయమూర్తి పదవినలంకరించిన తరువాత – న్యాయసూత్రాలలో గానీ, ఆ శాస్త్రం మీదగాని తన స్వీయాభిప్రాయాలు వెల్లడించడానికి వీలు లేదు కనుక, ప్రస్తుతానికి ఆ వ్యాసంగానికి అడ్డు చుక్క ఏర్పడిందనే చెప్పాలి. తీరిక వేళల్లో నాటకాలు చూడడం, సంగీతం వినడం, 'లా' పుస్తకాలు కాకుండా కాలక్షేపం కోసం యితర పుస్తకాలు చదవడం ఆమె హాబీలు.

సుజాత భర్త శ్రీ మనోహర్—బొంబాయి టాటా కన్సల్టింగ్ ఇంజనీర్స్‌లో చీఫ్ ఎలక్ట్రికల్ ఇంజనీర్. వారికి ముగ్గురు పిల్లలు.

"ఉద్యోగిని అయిన స్త్రీ తన గృహాన్ని ఒక క్రమ పద్ధతి ప్రకారం తీర్చిదిద్దుకోగలిగితే గృహిణిగా తన పాత్ర విస్మరించడానికి అవకాశమే లేదు" అంటారు సుజాతా మనోహర్.

"స్త్రీలు కనీసం పట్టభద్రులు కావాలి. తమ కాళ్ళపై తాము నిలబడ గల శక్తి సంపాయిం



వెల్లుల్లి పాయల్ని తరచుగా తింటూ వుంటే వెంట్రుకలు నెరియవు. అయితే గర్భిణీ స్త్రీలు-వీటిని తినకూడదు. వెల్లుల్లి పాయల పొట్టు విడిగా తీసుకుని వాటిని కాల్చి - ఆ మసిని ఆలివ్ నూనెలో కలిపి రోజా స్నానానికి ముందు తలకు రాసుకుంటే వెంట్రుకలు బాగా పెరుగుతాయి. నిగనిగలాడుతూ అందంగా వుంటాయి కూడా.

చాలి. తలిదండ్రులు తమ కుమార్తెలకు సాధారణంగా అన్ని సౌకర్యాలు అమరుస్తారు. కాని వారి చదువు విషయంలో మాత్రం అశ్రద్ధ చూపుతారు. ఆ విధంగా వుండకూడదు. స్త్రీ వివాహం అయిన తరువాత భర్త నీడన బ్రతకగలదనుకోవచ్చు. అది వేరే విషయం. కాని స్త్రీలకు కూడా ఆర్థికంగా తమంతట తాము స్వతంత్ర జీవనం గడపగల శక్తి సమకూరాలి.

అలాగే స్త్రీ కేవలం వివాహం మాత్రమే తమ ధ్యేయంగా భావించకూడదు. తనకంటూ ప్రత్యేకమైన ఒక వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకోగలగాలి. తాను కూడా ఈ సమాజంలో బాధ్యత గల వ్యక్తినని భావించి—అలా వుండడం నేర్చుకోవాలి. అప్పుడే ఆమె విలువ లోకానికి తెలుస్తుంది. అలా జరిగిననాడు – ప్రతి వనితను పరిపూర్ణ స్త్రీగానూ, భావిపౌరులను తీర్చిదిద్దగల బాధ్యురాలైన తల్లిగానూ, ఒక చక్కటి భార్యగానూ భావించి సమానత్వంతో ఆదరించడం జరుగుతుంది''— అంటారు సుజాతా మనోహర్.

—డాలి రిజ్వీ






CONTEST NO. 9

Vision

మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం.మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి :

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 31.12.1978**

---

**Join Camel School of Art Correspondence Course.**
**Contact the above mentioned address for details.**

**Results of Camel Vanitha Crylin Painting Contest No. 7 held in July 1978.**

*1st Prize* : Rs. 100/- T. Satyavathi Bobbili 532 558. *2nd Prize :* Rs. 75/- A. V. Savitri, Kurnool 518 001, *3rd Prize*: Rs 50/- Km. P. Padmavathi, Narsapur. *Certificate of Merit* : S. Vani Devi, Hyderabad. Smt. Vasantha Lakshmi, Salem 636 007. Miss. P. Santi, Kakinada-4. Miss Mehjabeen, Amalapuram 533 201. Mrs. Aron Olleri, Kurnool 518 001. Mrs Tajunnisa, Madras 600 004 Mrs Daya Uppin, Gulbarga



# వర్ధమాన మెజీషియన్ ఆషా

అక్కడ మాజిక్ ప్రదర్శన జరుగుతోంది.

ప్రేక్షకుల దృష్టి రంగస్థలం మీదనే కేంద్రీకృతమై వుంది. అందరూ ఉత్కంఠతో చూస్తున్నారు. ఒక పదహారేళ్ళ అమ్మాయి – స్టేజి మీద తన చక్కటి కంఠస్వరంతో వ్యాఖ్యానం చేస్తూ మాజిక్ ప్రదర్శన యిస్తోంది.

ఆమె–ఒక చేతిలో పళ్ళెరం మరో చేతిలో తన మంత్రదండం పట్టుకుని వుంది. పళ్ళాన్ని అటూ యిటూ తిప్పి అందరికీ చూపించింది. ఆ పళ్ళెరంలో ఏమీ లేదు. ఆ తరువాత పళ్ళెంలో కర్పూరం వెలిగించింది. పళ్ళాన్ని చేత్తోపట్టుకుని మరో చేతిలోని 'మంత్రదండం'తో మంత్రోచ్చారణ చేస్తున్న దానిలా పళ్ళెరాన్ని తాకింది.

అంతే.

మరుక్షణం చూపరుల కనులు విస్మయంతో మెరిశాయి. వారి ఎదుట ఒక అద్భుత దృశ్యం సాక్షాత్కరించింది. కొందరైతే నమ్మలేనట్లుగా కనులు నులుముకుని చూశారు.

అంతవరకు ఖాళీగా వున్న పళ్ళెంలోకి రకరకాల పువ్వులు కాడలతో సహా వచ్చాయి.

మరుక్షణం సభాస్థలి చప్పట్లతో మార్మోగింది. ఆమె చిరునవ్వు నవ్వుతూ పళ్ళెరాన్ని పక్కనపెట్టి మరో అంశం ప్రారంభించింది.

ఆ యువతి కుమారి ఆషా పద్మనాభన్!

ఆ ప్రదర్శన జరిగిన స్థలం మద్రాసు మహాలక్ష్మీక్లబ్‌లోని మిని థియేటర్. అప్పటికి సుమారు ఇరవైదాకా మాజిక్ ప్రదర్శనలు యిచ్చింది ఆషా. కాని తన గురువుగారి ఎదుట ఆమె యిచ్చిన తొలి ప్రదర్శన అదేకావడం విశేషం!

''ప్రొఫెసర్ చిన్నా మా బంధువు. ఆయన మాజిక్ ప్రదర్శనలను నేను చిన్నప్పటి నుంచి వుత్సాహంతో చూస్తూ వుండేదాన్ని. దాంతో నాకూ మాజిక్ నేర్చుకోవాలన్న కుతూహలం కలిగింది. ఆ మాటే ఆయనతో చెబితే మొదట నవ్వి వూరుకున్నారు. ఆ తరువాత నువ్వు మరీ చిన్నదానివి అని తప్పించుకోబోయారు. చివరికి నా పోరుపడలేక నాకు మాజిక్ నేర్పించడానికి అంగీకరించారు''– తను మాజిక్ నేర్చుకోవడం ఎలా జరిగిందన్న విషయం గురించి చెబుతూ అంది ఆషా.

ఆ విధంగా మాజిక్ నేర్చుకున్న ఆషా తన తొలి ప్రదర్శనను – తను చదివిన చర్చ్‌పార్క్ కాన్వెంటులో యిచ్చింది. 'మా పాఠశాలే కాబట్టి నేను మొదటిసారిగా స్టేజి మీద మాజిక్ ప్రదర్శన యిస్తున్నప్పటికీ నాకు భయం వెయ్యలేదు' అంటుంది ఆషా.

మద్రాసు నగరంలోనే కాక గౌహతిలో కూడా విజల్ నగరాలలో రక్షణ దళాల ఎదుట ఆమె తన మాజిక్ ప్రదర్శనలు యివ్వడం విశేషం. అంతే కాదు. మద్రాసు టెలివిజన్‌లో కూడా ఆమె మాజిక్ ప్రదర్శన యిచ్చింది. ఆమె సోదరుడు అరవింద్ ఈ ప్రదర్శనలలో ఆమెకు సహాయపడుతూ వుంటాడు.

చర్చ్‌పార్క్ కాన్వెంటు ద్వారా ప్రథమశ్రేణిలో వుత్తీర్ణురాలైన ఆషా ప్రస్తుతం మద్రాసు స్టెల్లామారీస్ కళాశాలలో ప్రియూనివర్శిటీ విద్యార్థిని.

మాజిక్‌తోపాటు ఆమె వీణ, భరతనాట్యం నేర్చుకుంటున్నది. తమిళనాడు మాజీ గవర్నర్ కె. కె. షా ఎదుట ఆమె భరతనాట్య ప్రదర్శన యిచ్చింది కూడా.

'మాజిక్ నేను హాబీకోసం నేర్చుకున్నాను. అయితే యిది చాలా ఖరీదైన కళ' అంటుంది ఆషా.

కథలు రాయడం ఆమె మరో హాబీ. ఆమె అభిమానించే నర్తకి – పద్మా సుబ్రమణ్యం. అభిమానించే మెజీషియన్స్ – పి. సి. సర్కార్, భాగ్యనాథ్.

''మాజిక్ అంటే అదేదో క్లిష్టమైన విద్య అని చాలామంది అనుకుంటారు. అభ్యసించడం కొంచెం కష్టమే అయినా ఏకాగ్రత వుంటే అసాధ్యమైనది కాదు. అలాగే మాజిక్ అంటే అందరూ ఏవేవో భాష్యాలు చెబుతారు. అటువంటిదే నేనూ ఒకటి చెప్పనా?—'నిజానికి మాజిక్ అంటే మరేమీ కాదు. చూపరుల కళ్ళను కప్పడమే' '' అంటారు ఆషా. □

—పూర్ణిమ



## ప్రశ్నలకు జవాబులు

**భాగ్యలక్ష్మి, జనగామ**

బామ్మగారూ! చీకట్లో పువ్వులు కోయకూడదంటారు, ఎందుకనండీ?

రాత్రివేళల్లో చెట్లు ముట్టుకోకూడదర్రా. ఎంచేతంటే, అవీ మనలాగే రాత్రిపూట నిద్రపోతాయి మరి! మనం ముట్టుకున్నాం అనుకోండి – వాటికి నిద్రాభంగం కలుగుతుంది. ఇంకో కారణం ఏమిటంటే చెట్ల మీద పురుగూ పుట్రా జేరతాయి. చీకట్లో మనం తెలియక చెట్లు ముట్టుకుంటే, అవి మనకి హాని కలిగించవచ్చుగదా! ఈ కారణాలుగానే, రాత్రివేళల్లో చెట్లు ముట్టుకోకూడదన్నమాట.

**సిహెచ్. గిరిజ, తెనాలి**

పెరుగు అన్నం తిన్న వెంటనే పాలు త్రాగకూడదంటుంది మా అమ్మ. ఎందుకని బామ్మగారూ?

ఎందుకనేమిటమ్మా-పెరుగు అన్నం తింటేనే, కడుపు బరువెక్కిపోతుంది. దాని మీదట ఎవరైనా పాలు తాగగలరా! ఒకవేళ, మీలాటి వాళ్ళు తాగారే అనుకోండి-అజీర్ణం చేస్తుంది. కాకపోయినా, పెరుగు అన్నం తిన్న మీదట వెంటనే పాలు తాగితే రెంటికీ పొత్తుకుదరక, కడుపులో వికారం పెడుతుంది!

**జొన్నల విజయా భాస్కర్, అత్తిలి**

జీవితంలోని కష్టనష్టాలకు ఓర్చుకుని, జీవితాన్ని చాలించే చివరి గడియల్లో మనిషిని మంచం మీద నుంచి కిందికి దింపుతారెందుచేత? అలా దింపిన ప్రాణికి నోట్లో తులసితీర్థం పోస్తారెందుకని?

మంచం మీద ప్రాణాలుపోతే – అవి అనంత వాయువుల్లో కలవవనీ, భూమి మీద అయితేనే కలుస్తాయనీ పెద్దవాళ్ళ సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి సాక్ష్యాలు కనిపించవు గాని, ఒకటయి వుంటుంది. మనిషి చావుబతుకుల్లో వున్నప్పుడు, ఇంట్లోంచి బయటకు తీసుకెళ్ళి, అరుగు మీద పడుకోబెడతారు. ఎంచేత?– ఆ ప్రాణి, దేహం విడిచేసమయం మంచిది కాకపోతే, ఆ ఇల్లు వదిలేయాలి. ఆ గడియ ఎలాంటిదో తెలీదు గనక, ఆ ప్రాణం బయటే పోతే – అది ఎలాంటి గడియయినా ఇల్లు వదిలేయవలసిన అవసరం రాకపోవచ్చు. మంచం మీద నుంచి కిందికి దింపడమూ ఇలాంటిదే – అయివుండాలి. తులసితీర్థం సంగతా-నేను ఇదివరకే 'వనిత'లో విపులంగా రాశానమ్మా–మీరు చూడలేదూ! తులసి రసానికి మృతశరీరాన్ని తొందరగా కుళ్ళనివ్వని గొప్ప గుణం వుంది! అదీ అసలు కారణం. పైగా తులసి దేవతా వృక్షం. ప్రాణం పోయేటప్పుడు భగవన్నామస్మరణ చెయ్యడం లాటిదే ఇదీనూ.

**కె. గీత, నాయుడుపేట**

పేరంటానికి రమ్మని పిలిచేటప్పుడు, నుదుట కుంకుమ పెట్టి ఎందుకు పిలుస్తారు? పండు గాని, పువ్వు గాని ఇచ్చి పిలవవచ్చుగదా!

కుంకుమ మనకి పవిత్రకరమైనది; మంగళకరమైనదీ. ఎవరింటికైనా వెళ్ళి, తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు కూడా వాళ్ళు కుంకం పెట్టి పంపుతారు. పేరంటాళ్ళను పిలిచేటప్పుడూ, వాళ్లని సాగనంపేటప్పుడూ కుంకం పెట్టడం మన ఆచారం, సంప్రదాయం. "బొట్టుపెట్టి పిలవడం....." అంటే అందులో అంత మర్యాద, ఆప్యాయత – వున్నాయన్నమాట. ఇక, ముఖాన బొట్టు ఎందుకంటారా-ఈ విషయం ఇదివరలోనే చాలా చర్చించుకున్నాం.

**ఇందుకూరి లక్ష్మీదుర్గావతి, దువ్వ**

చాలామంది ఉదయాన్నే నిమ్మరసం నీటిలో కలిపి, పుచ్చుకుంటారు. అందులో కొంతమంది తేనె కూడా కలుపుతారు. తేనెవల్ల లాభమా? నష్టమా? అలా రెండూ కలిపి తీసుకోడం వల్ల ఏమిటి లాభం?

పరగడుపున తేనె తీసుకోడం వల్ల చాలా లాభాలు వున్నాయి. తేనె ఎన్నో రకాలుగా శరీరానికి మేలు చేస్తుంది. అయితే, దానికి వేడి చేసే గుణం వుంది. అంచేతనే, సమపాళ్ళలో తేనె, నీరు, నిమ్మరసం కలిపి పుచ్చుకుంటారు. నిమ్మరసం కూడా వొంటికి మంచిది. ఈ రెండూ కలిపి పుచ్చుకోడం వల్ల, శరీరంలో వున్న 'నీరు' తగ్గుతుంది; ముఖం కాంతివంతమవుతుంది. ఉదర వ్యాధులు, దగ్గు, గుండెనొప్పి-లాటివి కలగకుండా వుంటాయి.

**ఆర్. వి. లక్ష్మి. పార్వతీపురం**

బామ్మగారూ! సప్తద్వీపాలు అంటారు. అవి ఏవో తెలియడం లేదు. మీకు తెలిస్తే చెప్పరూ!

ఎందుకు చెప్పనూ—తప్పకుండా చెబుతాను. అవి-జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము.

# ప్రశ్నలు - జవాబులు

కె. జి. సరళకుమారి, కుప్పం

ఈ మధ్య కచ్‌వర్క్ రకరకాల డిజైనులలో రంగురంగుల దారాలతో చిత్ర విచిత్రంగా దుస్తుల పైన వేస్తున్నారు. కచ్‌వర్క్ గురించి వివరాలు తెలియజేయవలసిందిగా కోరుతున్నాను.

దీనికి సింధీకుట్టని మరొక పేరు. పెద్దగళ్ళుంటే 4 మొదలు 6 పొరలవరకూ తీసుకోవాలి దారాన్ని. అద్దాలు వేసి ఈ కుట్టు కుడ్తారు. చమ్కీబిళ్ళలు



వేసి కూడా కుట్టుకోవచ్చు. చీరలపైకి తెగకుట్టుకుంటారు దీనిని. కుట్టే విధానం తెలిస్తే చాలు. రకరకాలు వేయవచ్చు.

మొదటి వరుస చదరాలు సరిగ్గా కుడితే, రెండవ వరుస ఆటోమాటిక్‌గా కరెక్ట్‌గా వస్తుంది. ఒక వరుస








నిర్వహణ.
మంగళా కందూర్

ఒక రంగు దారం, ఇంకొక వరుస వేరొక రంగుతో కుట్టినా బాగానే వుంటుంది. మొదటి బొమ్మలో లాగా మొదటి వరుస కుట్టుకోవాలి. చదరంలోని దారాలలో ఒక కొన పైకి వుంటే, ఇంకొక కొన




లోనికి వుండాలి. అణగివున్నదాన్ని పైకి లేపాలి. పైకి లేచినదానిని అణగదొక్కాలి. సోషలిజం పాటించాలన్నమాట. ఇది తప్పనిసరి ఈ కుట్టులో. ఇలా లేకపోతే కుట్టు అసలు రాదు. దీని రూట్ తెలుసుకోవటం మరో సమస్య. చెయ్యి వదలకుండా గీసే బొమ్మ లాగా ఎక్కడా ఆగకూడదు. అందుకే ముందుగానే దారి తెలుసుకొని పయనించాలి కాని




కొన్ని డిజైన్లు వుంటాయి. వాటికి మాత్రం అక్కడక్కడ ఆగి మరీ వెళ్ళాలి. కాని కంటిన్యుటీ దెబ్బ తినకూడదు. మొదటిమారు చదరం కుట్టేటప్పుడు కొనలు చదరం కన్న పాయింట్ వన్ అంగుళం ఎక్కువగా వుంటే రెండవమారు కుట్టేటప్పుడు ఇబ్బంది వుండదు.




రెండవ బొమ్మ చూస్తే రెండవ వరుస ఎలా కుట్టాలో తెలుస్తుంది. యారోమార్క్‌ను అనుసరించి కుట్టాలి. మొదటిమారు కుట్టు పైకి వుంటే రెండవ మారు కుట్టు దానిని అణచి వేస్తుంది. ప్రతి కుట్టూ ఇలానే అణుస్తూ పైకి లేపుతూ కుట్టాలి. మనం పొరపాటు చేస్తే తక్షణం తెలుస్తుంది. అంటే కుట్టు నిలవక జారిపోతుంది.



కొన్ని డిజైన్లలో ఒకేమారు 4, 5 చదరాల దూరం వెళ్ళవలసి వస్తుంది. అప్పుడు పైనుండి వెళ్ళాలో, క్రింది నుండి వెళ్ళాలో తోచదు. అక్కడ ఓ క్షణం ఆగి చూడండి. దీనికి చిన్న కిటుకు వుంది. III వ బొమ్మ చూడండి. ఒకటి నుండి రెండుకు వస్తారు. ఇక్కడి నుండి పైనుండే వెళ్తుంది దారం. ఇంతదాకా బాగుంది. 3 దగ్గర ఎలా వేయాలో ఆలోచించాలి. ఇక్కడ కూడా పైనుండి వెళ్తే

③



చిక్కుల్లో వడ్తారు. ఎప్పుడు పైకి వెళ్ళాలి, ఎప్పుడు అడుగుకు వెళ్ళాలి తెలుసుకోటానికే ఈ కిటుకు. 2, 3 కు మధ్య A, B, C, D లనే 4 గళ్ళు వున్నాయి కదా. సరిసంఖ్యలో గళ్ళు మధ్యన వుంటే ఒక కొస పైకి వుంటే ఇంకొక కొస కూడా పైకే వుండాలి. ఒక కొస క్రిందుగా వుంటే ఇంకొక కొస కూడా కిందుగానే వుండాలన్న మాట. మధ్య గళ్ళు సరిసంఖ్యలో వుంటే అపూర్వ సహోదరుల్లాగా ఒకలాగే వుండాలి. బేసి సంఖ్య గళ్ళు గనుక మధ్యన వుంటే బద్ధ వైరుల్లాగా విరుద్ధంగా వుండాలి. ఒక కొస పైకి వుంటే, ఇంకొక కొస లోనికి వుండాలి.

ఈ చిన్న కిటుకు తెలియకపోతే ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే వుంటుంది.

చీరలకు, జాకెట్ మెడ, చేతులకు, పిల్లల లంగాలు, గౌనులకు, బెడ్‌షీట్, కర్టెన్ల పైన ఎక్కడ కావాలంటే అక్కడ ఏ సైజులోనయినా అవలీలగా కుట్టుకోవచ్చు.

**జి. శైలజ, కొవ్వూరు**

మీరు చెప్పినట్లే మేము కుక్క బొమ్మ చేశాము. కాని ముఖంలో కొసవైర్లతో రెండు వైపులా ఆరేసి పువ్వులు వేయమన్నారు. అలా వేస్తే ముఖం పొడుగై తల పొట్టిదవుతోంది. చెవులకు పువ్వులు ఎలా వేయాలో ఎక్కడ వేయాలో కాస్త విపులంగా తెలియజేయండి.

వ్రాసింది జాగ్రత్తగా పాలో అయితే రెండు వైపులా ఆరేసి పువ్వులు వేసినా ముఖం పొడవు అవదు. ఎక్కడో చిన్న పొరపాటు జరిగివుంటుంది. చెవికి వేసిన మూలలు ఒకవేళ తప్పుగా వుండి వుండవచ్చు. 3 వ బొమ్మ చూడండి. ముఖంలో 4 స్మాష్‌లు వుంటాయికదా. ఎక్కడ వుండాలో చెబుతాను. దాని ప్రకారం వేస్తే కరెక్ట్‌గా రావచ్చును. చిన్న చిన్న అడ్డుగీతలు వెనక భాగాన్ని తెలుపుతాయి. చెవి దగ్గర మధ్యలో ఒక పువ్వు. నాలుగు వైపులా నాలుగు పువ్వులు వస్తాయి. పైనొక ముక్కోణం, క్రింద ఒక ముక్కోణం వుంటుంది. రెండు వైపులా అలా వున్నాయి చూడండి. ఎడమవైపు పైన A B అని వ్రాశానే, అక్కడ మొదటి స్మాష్ అయింది



B ముందున్న వయరు లోనికివెళ్తే A ముందున్న వయరు 1 లో నుండి 2 పైకి, తిరిగి 3 పైకి 4, 5 లలో నుండి, 6, 7 పైకి తిరిగి 8 లోనికి వెళ్లాలి వయరు. అక్కడ కత్తిరించాలి. అలాగే కుడివైపు కూడా చేయబడింది. రెండవమారు స్మాష్‌లు క్రింద వున్న A B ల దగ్గర జరుగుతుంది. అక్కడ ఎలా చేయాలో వ్రాశాను దాని ప్రకారం చేస్తే అక్కడ చదరం వస్తుంది. ఎడమవైపు చూడండి. B లోనికి వెళ్ళిపోతుంది. A ను 1 లో నుంచి 2, 3 పైకి 4, 5 అడుగుకు 6, 7 పైకి, తిరిగి 8 దగ్గర లోనికి వెళ్తుంది వయరు. అలాగే కుడివైపున కూడా చేయాలి. 4 తర్వాత 7 లో నుండి 5, 8 లకు పైనుండి 6 కు లోనుండి వెళ్తుంది వయర్. దీనిలో తమాషా ఏమిటంటే ఒకే చదరంలో రెండు వయర్లు అటు ఇటు వస్తాయి. ఇక్కడ వీటి కొసలను కత్తిరిస్తాం. చెవి వెనక భాగంలో ముక్కోణాలు ఆటోమాటిక్‌గా వస్తే, ముందువైపు స్మాష్‌ల ద్వారా వస్తుంది. జాగ్రత్తగా చూసి వేయండి. తప్పకుండా బాగా వస్తుంది.

## వనిత మాటల కొలువు - 39

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 అ | ను | 15 మ | 16 తి | | 2 బ | వు | 17 డు |
| నా | | 3 హి | మ | | ర | | క్కు |
| 4 ది | 18 ము | ళ | | 5 కా | ణ | 19 యా | చి |
| | ద్దు | | 6 నో | రు | | త | |
| 7 వి | రా | 20 మ | ము | | 8 పు | న | డ |
| 9 వి | లు | వ | | 10 వా | న | | |
| ధ | | 11 టి | 21 మే | | 12 ర్వ | 22 ము | 23 స |
| 13 ము | ల్లు | | త | | 14 సు | ద | తి |

పై సమాధానంతో సరిపోయే సమాధానం రాసినవారు 28 మంది. వారు :

1. కుమారి కె. రమణశ్రీ, కొవ్వలి 2. శ్రీమతి రాజ్యం, బొంబాయి 3. పి. ఉషారాణి, కాకినాడ 4. శ్రీమతి శ్రీకృష్ణ, బెంగళూరు 5. శ్రీమతి నాగేశ్వరి, బెంగళూరు 6. పి. సుబ్బలక్ష్మి, రాజమండ్రి 7. కల్లూరి విజయలక్ష్మి, విశాఖపట్నం 8. ఉమారాణి, బొంబాయి 9. సి. సరోజ, కోసూరు 10. చావలి విజయలక్ష్మి, కాకినాడ 11. శ్రీమతి డి. కరుణామణి, కొయ్యలగూడెం 12. డి. వసుంధర, కావలి 13. ఎమ్. కల్యాణి, వరంగల్ 14. ఏచూరి హేమలత, విశాఖపట్నం 15. తడవర్తి శాంతి, విజయవాడ 16. శ్రీమతి డి. నాగపద్మం, అనంతపూర్ 17. కె. అమ్మణ్ణి, పులివెందుల 18. కె. జి. మీనాకుమారి, మహానంది 19. పి. రామలక్ష్మి, చక్రధర్‌పూర్ 20. ఎస్. సరస్వతి, హైదరాబాదు 21. పి. రమ, కడప 22. వి. విజయ, కానాల 23. వి. వాణి, నేరేడ్‌పల్లి 24. పి. ఆదిలక్ష్మి, నెల్లూరు 25. ఏ. రాజ్యలక్ష్మి, విజయవాడ 26. పి. సుశీల, విజయవాడ 27. ఎమ్. రుక్మిణి, పద్ర 28. శ్రీమతి బి. లక్ష్మీ ప్రసన్నం, హైదరాబాదు

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి అందజేస్తున్నాము.



# నుదుట తిలకం

హిందూ కన్యలకు నుదుటను తిలకం అవసరమా? అనవసరమా?

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం కొంచెం కష్టమయినదే–

నేటి కన్యలు, చదువు నేర్వటంతో పాటు వివిధ అలంకరణలు–అనేక ఆధునిక అనుకరణలూ నేర్చుకుంటున్నారు.

అసలు హిందూ సంప్రదాయం చాలామట్టుకు తుడిచిపెడుతున్నారు నేటి ఆధునిక యువతులు.

ఈ మార్పులకు — యిప్పుడు వెలువడుతున్న సినిమాల ప్రభావం నూటికి తొంభై వంతులు ఉందని నా నమ్మకం.

ఒంటినిండా చీర కట్టుకుని, తల నిండా పూలు పెట్టుకుని, కళ్ళకి కాటుక, నుదుటను తిలకం యిదీ మన కన్య రూపం. కావ్యాలలో సుందరాంగులను కవులు అలాగే వర్ణించేవారు. ఒక నాట్య సుందరిని చూస్తే, ఆ విధంగానే అలంకరించుకుంటుంది. నా భావనలో అలా పూలు, కుంకుమ, గాజులు అలంకరించుకోవడం ఆడపిల్లల హక్కు. ఇది తిరుగులేని సత్యం.

అయితే, మరొక విషయం–భర్త లేని స్త్రీ యీ విధంగా అలంకరించుకోవచ్చా? అని మీరు ప్రశ్నించవచ్చు. నిక్షేపంగా అలంకరించుకోవచ్చు. కాని యెన్నో హేళనలకు గురి కావాలి. మన సంఘం–అంత నిశితంగా ఆలోచించదు. ఆడపిల్ల కదా–అలంకరణ ఆవిడ జన్మ హక్కు అని సరిపెట్టుకోదు మన సంఘం — ఇదేం విడ్డూరం? భర్త పోయేక (లేక భర్త విడిచి పెట్టేక) ఏమిటీ వేషాలు? ఎవరు చూచి ఆనందించాలి? అని ఎన్నో మాటలంటారు. భర్తకీ అలంకరణకీ ఎంతగానో అనుబంధం కలిగించారు మన పూర్వీకులు.

అందుకు ముఖ్యమయిన కారణం–పూర్వకాలంలో మనదేశంలో ఎక్కువగా నవాబుల పరిపాలన ఉండేది. వాళ్ళు చాలా కామోద్రేకులు. స్త్రీ కనిపిస్తే చాలు, ఆ స్త్రీని పాడు చేయందే వాళ్ళకి నిద్దర పట్టేదికాదు. అందులో అందమైన యవ్వనవతి అయితే ఇక చెప్పేదేముంది?

కాని–అంత దుర్మార్గులకు కూడా–ఒక నీతి ఉండేది. మెళ్ళో మంగళసూత్రమున్న స్త్రీని కన్నెత్తి చూచేవారు కాదుట. అందువల్ల — స్త్రీ మానరక్షణకు అతి బాల్య వివాహాలు జరిపించేవారు. అంత చిన్నపిల్లలకు వివాహాలు చేసేయడమే కాని, తర్వాత వచ్చే నష్టాలు వారు తెలుసుకున్నారు కారు.

ఆరోగ్య విషయంలో మనదేశం — పూర్వం చాలా వెనకగా ఉండేది. శిశు మరణాలు యెక్కువగా ఉండేవి. బాలారిష్టాలన్నీ తీరి పిల్లలు వయసులోకి వచ్చేసరికి భర్త చనిపోయేవాడు; చాలామంది యువతులు బాల వితంతువులుగా ఉండిపోయేవారు.

మన ఆచారాన్ననుసరించి ఆ ఆడపిల్లలకు మంగళసూత్రం, కుంకం, పసుపు, పూలు, గాజులు అన్నీ దూరం చేసేవారు. మెళ్ళో మంగళసూత్రం లేని ఆడపిల్లలను వారు బలవంతంగా తీసుకువెళ్ళిపోయేవారు. ఆ ఆపద నుండి కాపాడడానికి ఆ వితంతు స్త్రీలకు కేశఖండనం కూడా చేసేవారు. యువతులకు శిరోజాలు లేకపోతే అందమేమిటి? అలాంటి అనాకారి స్త్రీలను వారు కన్నెత్తి చూసేవారు కారు.

మనదేశంలో శ్రీ కందుకూరి, శ్రీ గురజాడ వంటి మహాత్ములు జన్మించి, స్త్రీల బాధల్ని అర్థం చేసుకొని అలాటి అరాచకాలనుండి కాపాడారు. కాని–కట్టు, బొట్టు, పూలు, గాజులు భర్తతో ఉన్న స్త్రీకే పరిమితాలు. యీ విషయంలో మార్పు రావడం మనం చూడ్డంలేదు. యింకొక విషయం — మేముండే ఒరిస్సా రాష్ట్రంలోని ఒక ప్రాంతంలో కన్యలు సిందూర తిలకం (కుంకం) ధరించరు. అది వారి ఆచారం. వివాహ సమయంలో వరుడే వధువు చేతికి గాజులు (కంకణాలు) తొడిగి, నుదుటను సిందూర తిలకం దిద్దుతాడు.

నేటి మన పిల్లలపై పాశ్చాత్య ప్రభావం ఎక్కువగా ఉంది. ముఖ్యంగా అసభ్యకరమైన సినిమాలు ఎక్కువగా రావడం ఒకటి. కొన్ని పత్రికలు కేవలం అలంకరణకే ప్రాధాన్యమిచ్చి (అసభ్యకరమైన వస్త్రాలంకరణలు) ప్రోత్సాహమిస్తున్నాయి. పుస్తకంలో ఉన్నట్లే కుట్టించుకుని డ్రస్సులు వేసుకోవడంలో పిల్లల కంటె పెద్దలకే ఎక్కువ ఉత్సాహంగా ఉంటున్నది.

మనం సరియైన సంరక్షణలో పిల్లల్ని ఉంచలేకపోతున్నామేమో అనిపిస్తున్నది. మన విద్యాలయాలు కూడా మన సంస్కృతికి తగినట్లు లేవు. ముఖ్యంగా ఆడపిల్లలకి యింట్లో తల్లి యెంత బోధకురాలో విద్యాలయాల్లో పంతులమ్మలు కూడ అంత విలువైన వారు. తమ విద్యార్థినులను సరియైన మార్గంలో ఉంచడానికి వారికి యెంతో అవకాశం, అవసరం ఉంది. బొట్టు, పూలు, గాజులు మొదలైన మన సౌభాగ్య చిహ్నాలు స్త్రీలకు యెంత అవసరమో యెంత అందమో మంచి మాటలతో మన సంప్రదాయపు రీతులు బోధించాలి.

ఒక స్త్రీని చూచామంటే ఆవిడ వేషధారణలోనే ఆవిడ గుణగణాలు చెప్పేయొచ్చు. అందుకే ఒక సామెత ప్రచారంలో వుంది. 'అన్నీ అలంకరిస్తే అమ్మక్క అన్ని అలంకరణలూ తీసేస్తే బొమ్మక్క' అని—

ఎంత–మన సంప్రదాయం కోసం పాటుపడే వారైనా తమ పిల్లల్ని ఎల్లప్పుడూ దండించలేరు కదా. ముఖ్యంగా మాతృమూర్తి తమ పిల్లల వల్ల తనకే లాభం లేకపోయినా సర్వదా వారి శ్రేయస్సే కోరి తన ప్రేమ సర్వస్వం పంచుతుంది. ఒక వయస్సు వచ్చేక చిన్నపిల్లలే బాధ్యత గల యువతులు అవుతారు. వారంతట వారే గ్రహిస్తారు. తల్లిదండ్రుల వంశ మర్యాదను నిలపడానికే ప్రయత్నిస్తారు.

ఏది ఏమనుకున్నా అలంకరణలేని ఆడపిల్లను ఏ తల్లీ, ఏ తండ్రీ చూచి సహిస్తారు? ఇంటా బయటా కళకళలాడుతూ మహాలక్ష్మిలా తిరగాలని ఏ తల్లిదండ్రులు కోరుకోరు?

——మండపాక పద్మావతీదేవి

# మీ పిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!



**బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా- ఆరోగ్యంగా చేసేందుకు**
అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది వారికి మీకు గూడా బోర్న్‌విటా అవసరం. తగ్గటుగా ఉండేందుకు!

క్యాడ్‌బరీస్
## బోర్న్‌విటా
**అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!**







OBM 8376 B/TL





'వనిత' అక్టోబర్ సంచికలో రాజమండ్రిలోని కె. వి. స్టేట్ హోమ్ గురించి, అక్కడి వనితల గురించి చదివారు. వీరేశలింగం పంతులుగారు తొలిసారిగా వితంతు వివాహం జరిపించినప్పటి నుంచి, ఆ హోమ్‌లో అటువంటి వివాహాలు ఎన్నో జరిగాయి. ఈ చిన్న కథ అక్కడ జరిగిన ఒక యధార్థగాథ!....

# "మా సీత...."

సరిగ్గా రెండు సంవత్సరాలక్రితం....

ఒక యువతి చింపిరి జుట్టుతో కృశించిన దేహంతో రాజమండ్రిలోని కె. వి. స్టేట్ హోం లోకి ప్రవేశించింది.

''మేడమ్''–ఆమె కంఠంలో నిస్సహాయత ధ్వనించింది. ఆమె వైపు పరికించి చూశాను. మాసిన దుస్తులతో, అలసటకి వాడిన మొహంతో ఆమె స్థితి దయనీయంగా వుంది.

ఆ యువతి నుదుట కుంకుమలేదు!

మనసులో సుడులు తిరుగుతున్న బాధని కన్నీటి రూపంలో వెలిగ్రక్క–ధానికి కూడా ఓపిక లేని ఆమె భుజాన రెండేళ్ళ పసిపాప!

ఆమె పేరు సీత.

మొదట వితంతువు, తరువాత అనాథ అయిన సీత–బిడ్డ భవిష్యత్తుకై మనసును రాయి చేసుకుని ఆశ్రయం కోసం ఆశ్రమంలో చేరడానికి వచ్చింది.

అలా వచ్చిన సీత క్రమక్రమంగా తన మనసులోని బాధ మరచిపోయి యితరులతో కలిసి మెలిసి వుండటం నేర్చుకుంది. తాను యితరులకు ఎంతో కాలం భారంగా వుండకూడదన్న తలంపుతో హోమ్‌లోని గాజు యాంప్యుల్ విభాగంలో పని నేర్చుకుంది.

ఇలా వుండగా – హోమ్‌లో జరిగే వితంతు వివాహాలు, వర్ణాంతర వివాహాలు వయసులో వున్న సీత మనసులో అలజడి చెలరేపాయి. భవిష్యత్తు గురించి తలచుకోగానే ఆమెలో ఎన్నో ప్రశ్నలు వుదయించాయి.

తను ఇంజక్షన్ ఏంప్యూల్ విభాగంలో పని నేర్చుకుంది. ఆ పనితనం తనకేదో చిన్న వుద్యోగం తెచ్చిపెట్టకపోదు. కాని ఆ చిన్న వుద్యోగం చేస్తూ చాలీ చాలని జీతంతో తన బిడ్డ భవిష్యత్తును తీర్చిదిద్దగలదా?

ఒకవేళ అలా వుద్యోగం చేస్తున్నా–వయసులో వున్న తనను ఒంటరిగా సంఘం బ్రతకనిస్తుందా?

ఈ సంఘంలో–ఏ తప్పు చెయ్యకపోయినా స్త్రీ ఒంటరిగా జీవించడం చాలా కష్టం. ఎవరో ఎందుకు....సాటి స్త్రీలే వింతగా చూస్తారు; విడ్డూరంగా చెప్పుకుంటారు:

అందుకే సీత ఒక దృఢనిశ్చయానికి వచ్చింది. తన బిడ్డతోపాటు తనని ఆదరించే వ్యక్తి లభిస్తే తాను వివాహం చేసుకుంటానని హోమ్ అధికారులకి తెలియజేసింది.

ఆమె అదృష్టమా అది అన్నట్లుగా ఆ రోజే ఒక బ్యాంకు వుద్యోగి ద్వితీయ వివాహానికి వధువు కావాలని హోమ్ కార్యాలయానికి రావడం జరిగింది. సీత నుదుట కుంకుమ దిద్ది అతనికి చూపించారు. అతను సీతను చూడగానే పాపతో సహా సీతను స్వీకరించడానికి అంగీకరించాడు!

**[లోకజ్ఞానం : సమాధానాలు]**

1. సోవియట్ రష్యా. అక్టోబరు 4, 1957 న రష్యా అంతరిక్షంలోకి ప్రవేశపెట్టిన తొలి కృత్రిమ ఉపగ్రహం — స్పుట్నిక్ 1.

2. గాలివాన యొక్క తీవ్రత గాలి వేగం మీద ఆధారపడి వుంటుంది. ఈ వేగం ఎంతో కొలవడానికి 'ఎఫ్' రేటింగ్ స్కేలు కని పెట్టిన వ్యక్తి-అమెరికా దేశపు శాస్త్రజ్ఞుడు డాక్టర్ థియోడర్ ఫుజిటా. ఆయన పేరిటనే

ఈ కొలమానంకి 'ఎఫ్' కొలమానం — అని పేరు వచ్చింది. ఫుజిటా అంచనా ప్రకారం గాలివాన తీవ్రతను — 'ఎఫ్ ౦, ఎఫ్ 1, ఎఫ్ 2, ఎఫ్ 3, ఎఫ్ 4, ఎఫ్ 5 అని ఆరు విధాలుగా విభజించవచ్చు. వీటినిబట్టి ఇవి వరుసగా-అతి స్వల్పంగానూ, ఒక మోస్తరుగానూ, చెప్పుకోదగ్గదిగానూ, తీవ్రమైనదిగానూ, ఘోరమైన, చెప్పలేనంత-నష్టాన్ని కలుగజేస్తా యనీ తెలుసుకోవచ్చన్నమాట.

3. స్విట్జర్లాండు. ఆ దేశంలోని ఫెడరల్ కౌన్సిల్‌లో ఏడుగురు సభ్యులు వుంటారు. వీరిలో ఒకరు సంవత్సరానికి ఒకసారి వరుసక్రమంలో అధ్యక్ష పదవిని అలంకరిస్తారు. అయితే అతనికి ప్రత్యే కించి అధికారమంటూ ఏదీ వుండదు. 1978 సంవత్సరానికి అధ్యక్షునిగా ఎన్నికైన వ్యక్తి-విల్లి రిట్సచర్డ్.

4. అమెరికాలో. 1942వ సంవత్సరంలో ప్రఖ్యాత అణు శాస్త్రజ్ఞుడు ఎన్‌రికో ఫెర్మి ఆధ్వర్యంలో నిర్మింపబడింది.

5. ఆర్మిస్టిస్ డే. అంటే యుద్ధము నిలుపు జేసిన రోజు అని అర్థం.

6. 1835వ సంవత్సరంలో.

7. 'ఆల్మా మాటర్' అనే లాటిన్ పదానికి ఆంగ్లార్థం ఫాస్టర్ మదర్. అంటే పెంచిన తల్లి అని. సాధారణంగా విద్యార్థులు తమకు విద్య గరపిన మాతృ సంస్థను ఈ విధంగా సంబో ధిస్తూ వుంటారు.

8. 'మార్నింగ్ సాంగ్ ఆఫ్ ఇండియా'. అంటే-భారత దేశపు ప్రభాత గీతం.

9. రైస్‌కాల్గ్. అమెరికా దేశస్థుడు. 1924లో ఆయన డైనమోతో పనిచేసే లౌడ్ స్పీకరును కనిపెట్టాడు.

10. 1887లో. బెర్‌లైనర్ అనే అమెరికా దేశస్థుడు కనుగొన్నాడు.

అయితే యిక్కడే ఒక సమస్య ఎదురైంది. పాపకు కాస్త ఊహ తెలిసినప్పటి నుంచి తన తల్లి ముఖాన బొట్టు చూచి ఎరుగదు. తనని లాలిస్తూ అప్పుడప్పుడు దుఃఖించే తల్లే ఆ చిన్నారి పాపకు తెలుసు. అటువంటప్పుడు — తలలో పువ్వులు నుదుట కుంకుమతో కళకళలాడే తల్లి రూపంలోని మార్పును ఆ పాప సహజంగా స్వీకరిస్తుందా? తాను ఎన్నడూ చూడని వ్యక్తిని తండ్రిగా అంగీకరిస్తుందా?

చివరికి నాకో ఆలోచన తట్టింది. ఆ చిన్నారి పాపను దగ్గరకు పిలిచి "విజయా! మద్రాసు వెళ్ళిపోయిన మీ నాన్నగారు నీకోసం వచ్చారు చూశావా?" అని అతనికి పరిచయం చేశాను.

చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ అతనివైపు చూసింది పాప. అతను తాను పాపకోసం తీసుకు వచ్చిన చాక్లెట్లు, సిల్కు గౌను, బూట్లు మొద లైనవి పైకితీసి పాపవైపు ఆప్యాయతతో చేయి చాపారు. అంతే....పాప తన తండ్రి తిరిగి వచ్చాడని సంబరపడిపోతూ పరుగు పరుగున వెళ్ళి ఆయన చేతులలో వాలిపోయింది. ఆవిధంగా ఆ సమస్య తీరిందన్న సంతృప్తితో అందరం తేలికగా నిట్టూర్చాము. ఏమవుతుందోనని తల్ల డిల్లిన సీత మనసూ కుదుటపడింది.

ఈ సంఘటన జరిగిన వారానికల్లా తెలుగునాట స్త్రీ జనోద్ధరణకు నడుం కట్టిన వీరేశలింగం పంతులుగారి జయంత్యుత్సవం వచ్చింది. ఆ నాడు ఆశ్రమ ప్రాంగణంలో—వారు నిర్మించిన కల్యాణ మండపంలో పెద్దల సమక్షంలో బ్రహ్మ సమాజ వివాహ పద్ధతిలో సీత పెళ్ళి జరిగింది.

ఆమె క్షత్రియ కులస్తురాలు....అతను హరిజన కులస్థుడు.

ఇద్దరికీ అది ద్వితీయ వివాహం....కాని అది—అద్వితీయ వివాహమని అందరూ ప్రశంసించారు; అభినందించారు — ఆశీర్వదించారు.

ఆ విధంగా సీత కాపరానికి వెళ్ళింది. ఆనంద మయ జీవితాన్ని గడుపుతోందని ఉత్తరాల ద్వారా తెలుసుకుని ఆనందించాము.

ఒకరోజు ఉదయం...

పదకొండు గంటలకి అందరం ఆఫీస్‌లో ఎవరి పనులలో వారు మునిగి వున్నాం. సరిగ్గా ఆ సమయంలో — జారిపోతున్న పట్టుచీరెను సర్దు కుంటూ భుజాన బాబును ఎత్తుకుని, రెండవ చేతితో పాపను పట్టుకుని ఒక స్త్రీ లోపలికి ప్రవే శించింది.

"మేడమ్."

పరిచితమైన ఆ పిలుపు విని నేను తలెత్తి చూశాను.

అంతే! ఆనందాశ్చర్యాలతో "రా....సీతా" అని ఆమెను ఆహ్వానించాను.

'మేడమ్' అని ఆమె పిలిచిన పిలుపులో మునుపటి దైన్యం లేదు. పరిపూర్ణమైన ఆనందం, సంతృప్తి కనిపించాయి నాకు.

సీత చేతిలోని బాబునందుకుని కుశల ప్రశ్నలు వేశాను. పాప తల్లి కొంగు వదల్లేదు. ఆ పాపకి నాలుగేళ్ళు యిప్పుడు. ఆఫీసులోని ఇతర సిబ్బంది అంతా సీతని చుట్టుముట్టారు.

అదో ఆనందం....సంరంభం....సంబరం.

సీతకి పెళ్ళయి రెండేళ్లు అయిందనుకుంటాను.

అంతలోనే ఎంత మార్పు....ఆమె వేష భాషలతోపాటు అలంకరణ, శరీరాకృతి కూడా మారిపోయాయి. రెండు సంవత్సరాల క్రితం ఆమెను చూసిన వారెవరూ నేడు ఆమెను సుల భంగా గుర్తుపట్టలేరు. ఆమె జీవితం మూడు పువ్వులు — ఆరు కాయలుగా వున్నది.

సీత కనులలో కృతజ్ఞత తొంగి చూస్తోంది. ఆమెని ఆ విధంగా చూడగానే అందరికీ వితంతు వివాహాలకి నాంది పలికిన వీరేశలింగం పంతులు గారు మదిలో మెదిలారు. వీరేశలింగం గారికి మనస్సులోనే కృతజ్ఞతాంజలులు అర్పించారు హోమ్‌లోని వుద్యోగినులు; సీతలాంటి భవి ష్యత్తుకై ఎదురు చూస్తున్న తక్కినవారూ.

కందుకూరి వారు ప్రారంభించిన ఈ హోమ్‌లో ఎన్నో వితంతు వివాహాలు జరిగాయి. ఆ వివా హాల మాలలో మరొక పువ్వు—మా సీత!

—ఎం. లక్ష్మీతులసి

# తెలిసిన విలువలు



నాలుగున్నరకు స్కూల్లో లాంగ్‌బెల్ మ్రోగింది. హేండ్‌బ్యాగ్ తీసుకొని ఇంటికి బయలుదేరింది వసుధ. ఆమెకి ఆ వేళ అతి ఉత్సాహంగా వుంది. తను తొలిసారిగా జీతం అందుకున్న రోజు. ఆ ఉదయం ఆఫీస్ రూంలో జీతం అందుకున్న వెంటనే తండ్రికి ఏభై రూపాయలు మని ఆర్డర్ చేసింది. 'నాన్నా! ఈ వేళే నా మొదటి జీతం అందుకున్నాను. నా సంతోషంకొద్దీ పంపుతున్నాను. నీ పాకెట్‌మనీగా వాడుకో' అంటూ కూపన్లో రాసింది.

చకచకా ఇంటికి వస్తూన్న వసుధలో అనేక ఆలోచనలు. ఇకనుంచి తమకెలాంటి ఇబ్బందులూ వుండవు. తమ సంసారం హాయిగా గడిచిపోతుంది. ప్రసాద్‌తో సంప్రదించకుండా తన తండ్రికి డబ్బు పంపినందుకు ఆయన ఏమీ అనుకోడు కదా! అయినా ప్రసాద్ మనస్తత్వం తనకి బాగా తెలుసు. కట్నం ఆశించకుండా తనని పెళ్ళి చేసుకున్న విశాల హృదయుడు. ఇంత చిన్న విషయాన్ని సీరియస్‌గా తీసుకొనేంత సంకుచిత మనస్సు కలవాడు కాడు. తను చేసిన పనిని తప్పక హర్షిస్తాడు.

ఆమె ఇల్లు చేరుకొనేసరికి తలుపులు తెరిచే వున్నాయి. ఎంత సర్ది చెప్పుకున్నా గుండెల్లో ఏదో 'కంపనం' లాంటిది వినిపిస్తూనే వుంది. ప్రసాద్ హాల్లో కూర్చొని పేపరు చూస్తున్నాడు. వసుధను చూసి పేపరు బల్ల మీద పడేసాడు.

"వసూ! ఈ వేళ 'జాలీ డే'. వంట ఏర్పాట్లేం చేయకు! అలా సరదాగా ఏ పిక్చరుకో పోయి హోటల్లో భోంచేసేద్దాం. ఓ కే!" అన్నాడు. వసుధ ఎగిరి గంతేసినంత పనిచేసింది.

"ష్యూర్! ఉండండి. మొహం కడుక్కుని కాఫీ చేసి పట్టుకొస్తా" అని పరిగెత్తబోయింది.

"ఆ శ్రమేం లేదు లేవోయ్. కాఫీ ఫ్లాస్కులో

బి. ప్రేమలీ రావ్

# డాక్టర్ అడవికొలను సీతాకుమారి



నేడు విద్యారంగంలో వనితలు ఎంతో ముందంజ వేస్తున్నారు. అంతేకాదు. తాము నేర్చిన విద్యని పదిమందికి చెబుతూ భావి భారత పౌరులను తీర్చి దిద్దడంలో తీవ్ర కృషి సలుపుతున్నారు. ఇది ఎంతైనా గర్వించదగ్గ విషయం. అటువంటి వారిలో చెప్పుకో దగ్గవారు-శ్రీమతి అడవికొలను సీతాకుమారి.

బరంపురంలో జన్మించిన సీతాకుమారి అక్కడి కళ్ళికోట కళాశాల ద్వారా బి. ఏ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యారు. అటు పిమ్మట కాశీ విశ్వవిద్యాలయం ద్వారా ఎం. ఎస్సీ పట్టం పొందారు. ఆ విశ్వవిద్యాలయాని కంతటికీ ఆమె ద్వితీయురాలుగా రావడం విశేషం!

తాను నేర్చిన విద్య నలుగురికీ చెప్పాలన్న తపనతో ఆమె పాట్నా విశ్వవిద్యాలయం స్త్రీల కళాశాలలో ఉపన్యాసకురాలుగా చేరారు. అక్కడ ఉద్యోగం చేస్తూ వుండగానే భారత ప్రభుత్వ ఉపకారవేతనంపై ఆమె డాక్టరేట్‌కు కృషి చేశారు. ఆ విధంగా ఆమె కాశీ విశ్వవిద్యాలయం ద్వారా భౌతిక శాస్త్రంలో పి. హెచ్ డి. సంపాయించారు. పాట్నా విశ్వవిద్యాలయంలోనే రీడర్‌గా కొంతకాలం వున్నారు.

పాట్నా విశ్వవిద్యాలయంలో వున్నప్పుడు అక్కడి స్త్రీల హాస్టల్ కమిటిలో సభ్యురాలిగానూ, బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లోనూ, మోడరేటర్స్ సమాఖ్యలోనూ సభ్యురాలుగా వుండేవారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కొంతకాలం అకడెమిక్ కౌన్సిల్ సభ్యురాలుగానూ, బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యురాలుగానూ వుండి తన ప్రతిభను కనబరచారు సీతాకుమారి.

ప్రస్తుతం ఆమె విజయనగరం మహారాజ స్త్రీల కళాశాల ప్రిన్సిపాలుగా వుంటున్నారు. ఆమె ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్ సభ్యురాలు కూడా.

భారత ప్రభుత్వం గత సంవత్సరం దేశం మొత్తంపై ఆరుగురు కళాశాల ఉపన్యాసకులను వారి విద్యా ప్రావీణ్యతకు గుర్తుగా ఎంపిక చేసింది. వారిలో సీతాకుమారిగారు ఒకరు కావడం విశేషం!

ఈ ఆరుగురూ అమెరికాదేశంలోని విద్యావిధానం పరిశీలించేందుకై అక్కడి వివిధ నగరాలు పర్యటించారు.

శ్రీమతి సీతాకుమారి రాసిన 'పరమాణు భౌతిక శాస్త్రం'-గ్రంథాన్ని తెలుగు అకాడెమీ వారు బి. ఎస్సీ విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా నిర్ణయించారు.

శ్రీమతి సీతాకుమారి భర్త శ్రీ అడవికొలను శ్రీరామచంద్రమూర్తి కూడా విద్యావేత్త కావడం మరో విశేషం! ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయం న్యాయకళాశాలలో రీడర్‌గా వుంటున్నారు. ఇలా భార్యాభర్తలిద్దరూ కూడా విద్యారంగంలో కృషి చేయడమన్నది చెప్పుకోదగ్గ విషయం — అదొక విశేషం!

—ఎస్. ఎస్.

రెడీగా వుంది. ఇక వసుధ గారు త్రాగడమే తరు వాయి" అన్నాడు చిలిపిగా.

"అరె! మీరు చేసారా! చాలా థాంక్సండీ" అంటూ వసుధ బాత్‌రూంలోకి పరిగెత్తింది.

"వసూ!" పిలిచాడు ప్రసాద్. 'ఇదిగో నా సాలరీ' అంటూ ఆరు పచ్చనోట్లు ఆమెకు అందించాడు. వసుధ కూడా తన సాలరీ అతనికి చూపిద్దామనే కుతూహలంతో హేండ్‌బాగ్ తీసింది.

"ఏమండీ! శ్రీవారూ! ఏదిలా చేయి చాపండి! ఇదిగోనండి మీ అర్ధాంగి ఫస్ట్ సాలరీ" అంటూ అతని చేతిలో కవరు ఉంచింది.

"జీతంలో 50 రూపాయలు మా నాన్నకి పంపానండి. మీరేమనుకోరనే ధైర్యంతోనే...." వసుధ మాటలు తక్కున మధ్యలోనే ఆగిపోయాయి.

అంతవరకు అతి ప్రసన్నంగా వున్న అతని ముఖం క్షణంలో గంభీరమైపోయింది. ఇంతవరకూ వసుధ గుండెల్లో అజ్ఞాతంగా వున్న గుబులు ఆమె మొహంలోకి ఒక్కసారిగా పెల్లుబికింది.

తెరవబోతున్న కవరును ఒక్కసారిగా తక్కున బల్ల మీద విసరివేసాడు ప్రసాద్. 'ఆ వివరాలన్నీ ఇక నాకెందుకులే! మిగతాది నీ ఇష్టం. ఏం చేసుకుంటావో, ఎవరికి పంపుకుంటావో, నీ జీతం, నీ ఇష్టం.'—విసురుగా బయటకు నడిచాడు. అతి ఉల్లాసకరంగా వున్న వాతావరణం క్షణంలో భయంకరంగా మారిపోయింది. వసుధ మనస్సు అవమానంతో - కుతకుతలాడిపోయింది. రోషంతో - స్వాభిమానంతో ఆమె హృదయం బుసలుకొట్టింది. అనుకోని ఈ హఠాత్సంఘటనకి ఆమె మనస్సు బాగా దెబ్బతింది. తను ఉద్యోగంలో చేరిన తరువాత అందుకున్న తొలి జీతం ఇది. రిటైర్ అయి ఇంట్లో వుంటూన్న తన తండ్రికి ఒక్క ఏభై రూపాయలు పంపుకోవడానికి తనకి హక్కు లేదా! ప్రతి నెలా ప్రసాద్ తన జీతంలో వందా, రెండేసి వందలూ వాళ్ళ ఇంటికి పంపిస్తూంటే - తనెప్పుడైనా బాధపడిందా! తగవులాడిందా! మరి ఇప్పుడు? తన సంపాదన తన తండ్రి తినడానికి హక్కులేదా! తనకుజన్మనిచ్చి - పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు చెప్పి - ఇంతదాన్ని చేసిన తల్లిదండ్రులని తన సంపాదనలో తృణమో, పణమో ఇచ్చి సంతోషపరచే అదృష్టం కూతురికి లేదా! ఛీ! ఛీ! ఈ మగవాళ్ళంతా ఒకటే! వొట్టి స్వార్థపరులు. బల్ల మీద పడేసిన కవరు డ్రాయర్లో




## పిపాసి

(నవల)

[రచన : శారదా అశోకవర్ధన్; ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో, సుంకురామచెట్టి వీధి, మద్రాసు-1; వెల : రూ. 3.50 పేజీలు : 162]

ఏదో ఒక మంచి కథావస్తువును ఎన్నుకున్నప్పుడు దాన్ని ఎలా చెపుతున్నాము అని ఆలోచించకుండా అక్షరరూపం కలిపించే రచయిత్రులు ఎక్కువవుతున్నారనిపిస్తోంది. "రచన కుటీరపరిశ్రమైపోయింది ఆడవారి చేతులో పడి." అనే విమర్శనలు విన వస్తున్న ఈ కాలంలో రచయిత్రులు మరింత జాగ్రత్తగా రాయవలసిన అవసరం చాలా ఉంది. "పిపాసి" లో మంచి కథావస్తువు ఎన్నుకున్నారు రచయిత్రి. సన్ని వేశాలలో కొన్ని చక్కగా ఉన్నాయి. కానీ, కూర్పు, సంభాషణ విషయంలో మరింత జాగ్రత్త తీసుకుని వుంటే బావుండేదనిపిస్తుంది.

చిన్నతనంలో తప్పిపోయిన రాధిక గొప్ప డాన్సర్ అవుతుంది. కళను, సౌందర్యాన్ని వెలకట్టే ఒక దుర్మార్గుడి చేతులో ఉంటుంది. బాల్యమిత్రుడు, చిత్రకారుడు అయిన మదన్ ఆమెను గుర్తుపడతాడు. ఆమె పవిత్రతను, కళను, మంచితనాన్ని ప్రేమించి ఆమెను ఆ మురికి కూపం నుంచి బైటకు తీసుకువస్తాడు. వివాహం చేసుకుంటాడు. కానీ, సంఘం ఆమెనొక వెలకు అమ్ముడు బోయిన వ్యక్తిగా గుర్తించి, బాధపెడుతూనే ఉంటుంది. ఈ పరిస్థితుల్లో ఆమెను తిరిగి నర్తకిగా మారమని మదన్ అడిగినప్పుడు అతడి కళాపిపాస వెనక ధనేచ్ఛ ఉందని అపోహపడుతుంది రాధిక. ఇక్కడనుంచి కథ రకరకాల మలుపులు తిరుగుతుంది. కళాపిపాసి, మదన్ స్నేహితుడు అయిన సత్యం ఒక మంచి క్యారెక్టర్. కానీ, ఏ క్యారక్టర్‌కి పరిణతి, సంపూర్ణత లేవు. పుస్తకాలు కాలక్షేపానికి చదువుకోడానికే అనుకుంటే ఈ పుస్తకం బావున్నట్టే లెక్క.

## ఆర్తి

(నవల)

[రచన : వేదుల శకుంతల; వెల : రు. 3 50; పేజీలు : 152; ప్రచురణ : ఎమ్. శేషాచలమ్ అండ్ కో, మద్రాసు.]

ఇది పిచ్చివాళ్ళ కథే అయినా పిచ్చి కథ మటుకు కాదు. మానవత్వాన్ని తట్టి లేపి, మనసున్న మనుషుల్ని కళ్ళముందు నిలబెట్టి, ఏకబిగిన పఠితలచేత చదివించే చక్కటి నవల.

"ఆ రోజు బ్యాండ్‌వాడ్ని చూసి నేననుకొని ఏడ్చావా?"

"అవును....నువ్వు కాదా? అమ్మ కాదని చెప్పిందిలే"

"నేనే అయితే ఏం?"

ఊహుం నువ్వు నా పెళ్ళివాడివి కదా....మరి వాళ్ళ పెళ్ళికి ఎందుకు వెళ్ళాలి?"

"వెళ్ళకూడదా?"

"ఏమో నాకు ఏడుపు వస్తుంది."

మతి స్థిమితం లేకపోయినా, జగత్తులో స్థిరంగా నిల్చిపోయే అనిర్వచనీయమైన ప్రేమను నిరూపించిన శ్యామల, భార్య మనసుని అభిమానంతో, ప్రేమతో అర్థం చేసుకొని ఆర్తిగా దగ్గరైన వేణు, మళ్ళీ జన్మలో మెంటల్ హాస్పిటల్లో డాక్టరుగానో, నర్సుగానో పుట్టాలని కోరుకొనే సురేఖ........పాఠకులు తొందరగా మర్చిపోలేని మంచి పాత్రలు.

నవల చదవటం పూర్తికాగానే....ఆర్తితో.... చెప్పలేని అనుభూతితో హృదయం స్పందిస్తుంది. ఒక వెరైటీ నవల చదివామనే తృప్తి చదువరులకు కల్గుతుంది.

---

పడేసి వంటగదికేసి నడిచింది వసుధ.

రాత్రి ఎనిమిది గంటలయినా ప్రసాద్ జాడలేదు. వంట పూర్తిచేసుకొని వికలమైపోయిన మనస్సుతో మంచం మీద వాలిపోయింది వసుధ. ఆమె మనస్సులో ఏదో సంఘర్షణ బయలుదేరింది. ఉవ్వెత్తుగా ఎగసిపడుతున్న భావావేశాలకు ఆమె తట్టుకోలేక సతమతమవుతూంది.

వీధి గుమ్మం చప్పుడయింది. చప్పున లేచి తలుపుగడియ తీసింది. ఎదుర్గుగా ప్రసాద్ ! అతనితో ఏమని మాట్లాడాలో తోచలేదు వసుధకి. మౌనంగా వంటగదిలోకి వెళ్ళి భోజనం టేబిల్ మీద సర్దింది. ప్రసాద్ ఆమెని పిలవలేదు. అతను భోజనం చేసిన జాడేలేదు. వసుధకి చెప్పలేనంత విరక్తి-దుఃఖం ముంచుకువచ్చాయి. రోషంతో - స్వాభిమానంతో ఆమె గుండెలు మండిపోతున్నాయి. తనకి భోజనం చేయాలనిపించలేదు. వంటిల్లు గడియ వేసేసి డ్రాయింగ్ రూంలో పుస్తకాలు ముందేసుకు కూర్చుంది. కళ్ళు మాటిమాటికి చెమ్మగిల్లుతున్నాయి. రకరకాల ఆలోచనలు మనస్సును అల్లకల్లోలం చేసి వేస్తూంటే-టేబుల్ మీద తల వాల్చి కాస్సేపటికి అలానే నిద్రపోయింది.

అవతల ప్రసాద్ పరిస్థితి కూడా అలానే వుంది. బెడ్‌రూంలో నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నాడు. అతని మనస్సంతా చికాగ్గా ఏదోలా అయిపోతోంది. అతన్ని ఒకే ఒక ప్రశ్న తొలిచి వేస్తూంది. తను ఎందుకలా తొందరపడ్డాడు? ఎందుకు తొందరపడ్డాడు? వసుధ మనస్సు ఎంత గాయపడిందో? ఆమె మొహం చూడడం ఎలా? మొహాన్ని దిండులో దూర్చి గాఢనిట్టూర్పు విడిచాడు. పశ్చాత్తాపమనే భావం అతని మనస్సులో అణువణువునా ఆవరించుకుపోయింది.

మర్నాడు—యధావిధిగా పది గంటలకు భోజనాలు ముగించుకొని ప్రసాద్ ఆఫీస్‌కి—వసుధ స్కూలుకి బయలుదేరారు. ఎవరి మొహాల్లోనూ కళాకాంతుల్లేవు. ముక్తసరిమాటలతోనూ-ఎడమొహం—పెడమొహంతోనూ గడచిపోయింది ఆ కాస్తకాలం. ఆఫీస్‌కి వెళ్ళి పెన్ కోసం జేబులో చేయిపెట్టిన ప్రసాద్ చేతికి ఒక కాగితం మడత దొరికింది. ఇవతలకులాగి చూసాడు.

"ప్రసాద్ : రాత్రంతా ఆలోచించాను. నేను చేసింది పొరపాటేనని గ్రహించాను. ఇక ముందెప్పుడూ-మీతో చెప్పకుండా-మీతో సంప్రదించకుండా ఏ పనీ చేయను. ఈసారికి ఈ తప్పిదాన్ని క్షమించమని అడుగుతూ."

— వసుధ

సరిగ్గా అదే సమయంలో - హేండ్‌బాగ్‌లో దొరికిన చీటీని విప్పుకు చదువుకుంటోంది వసుధ.

"వసూ డియర్ : నిన్నటి నా ప్రవర్తనకి 'చాలా' సిగ్గుపడుతున్నాను. రాత్రంతా. మనోవ్యథలో కుమిలిపోయాను. చాలా తొందరపడ్డాను కదూ ! నా పొరపాటును క్షమించవా? ఇంకెప్పుడూ నిన్నిలా కించపర్చను. ఈ రాత్రి నా గుండెల మీద వాలి నన్ను క్షమించానని మనసార చెబుతావు కదూ !"

—నీ ప్రసాద్

□

డి.కామేశ్వరి వ్యాసం

# రచయిత్రులు — వాస్తవిక దృక్పథం



రచయిత్రులు - వాస్తవిక దృక్పథం అంటే - అసలు రచయిత్రులకి వాస్తవిక దృక్పథం లేదనా, అది వారి రచనల్లో లోపించిందా అన్నది మనం ముందు చూడాలి. అసలు వాస్తవిక దృక్పథం అంటే ఏమిటి? రచనలో సామాజిక స్పృహ వుండాలని, రచన సమకాలీన సమస్యలకి దర్పణంలా వుండాలని, రచనకో ప్రయోజనం వుండాలని ప్రస్తుత సమస్యలని అవగాహన చేసుకుని రచనల్లో ప్రతిబింబింప చెయ్యాలనీ అర్థం అనుకుంటాను. అయితే అసలు రచనకో ప్రయోజనం వుండాలా, వుండితీరాలా అన్న అంశంమీదే రకరకాల అభిప్రాయాలున్నాయి. 'ఆ మంత్రాలకి చింతకాయలు రాలవు, కథలు చదివి మనుషులు మారిపోతారా, రచనలతో సమాజంలో చైతన్యం వస్తుందనడం వెర్రి' అనేవారున్నారు. 'లేదు, రచనకి ప్రయోజనం వుండి తీరాలి.. సంఘాన్ని మన రచనతో మరామత్తు చేయకపోయినా కనీసం రచనకి సమకాలీన సమస్యలకి ప్రాధాన్యం ఇవ్వాలి' అనేవారున్నారు. సరే, రచనలతో సంఘంలో మార్పు తేలేం. నిజమే కథలు చదివి కట్నాలు వద్దని పెళ్ళిళ్లు చేసుకోడం లేదు. రచనలు చదివి లంచగొండితనం మానరు. కథ చదివి పతితని ఉద్ధరించడానికి నడుం కట్టుకుని ఎవరూ ముందుకురారు. సంఘంలో నిరుద్యోగం, నిరుపేదరికం, అవినీతి ఏవీ కథలవల్ల సమసిపోవు। మరయితే రచనకి ప్రయోజనం ఎందుకుండాలి? అంటే దానికి ఒక్కటే జవాబు నాకు స్ఫురిస్తుంది.

చరిత్ర దేశచరిత్రని, జాతిచరిత్రని మాత్రం చెప్పుతుంది. మరో నలభై ఏళ్ళో, ఏభై ఏళ్ళో తరువాత మన ముందు తరాలవారికి ఈనాటి మన సంఘ జీవితం, కట్టుబాట్లు ఆచార వ్యవహారాలు మనం ఎదుర్కొన్న సమస్యల గురించి తెలిపేది సాహిత్యం ఒక్కటేనని నా నమ్మకం. ఈనాటి మన సమస్యలేమిటో అవి మనం ఎలా ఎదుర్కొన్నదీ తెలిస్తేగదా వారు పురోగమించిందీ, తిరోగమించిందీ అర్థం చేసుకోగలరు. ముప్ఫై నలభై ఏళ్ళ క్రితం మన సాంఘిక కట్టుబాట్లు ఎలా వుండేవి అన్నది మనం ఆ రచనలు చదివి తెల్సుకుంటున్నాం. చలం నవలలు చదివి ఆనాటి స్త్రీ ఎంత అజ్ఞానంలో కొట్టుమిట్టాడేదో అర్థం చేసుకున్నాం. శరత్ నవలలు చదివి బెంగాలీల ఆచార వ్యవహారాలు, విశ్వనాథ వెయ్యిపడగలు చదివి ఆనాటి శుద్ధశ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబ ఆచార వ్యవహారాలు, మాలపిల్ల చదివి తక్కువ కులాలవారి హీనస్థితి, కన్యాశుల్కం వల్ల బాల వితంతువుల దుస్థితి, అమాయకత్వం అర్థం చేసుకున్నాం. ఇలా ఆనాటి సామాజిక స్థితిగతుల గురించి అవగాహన చేసుకునేందుకు ఆ సాహిత్యం తోడ్పడింది. మన ముందు తరాలవారికి ఈనాటి మన సాహిత్యం సహాయపడాలంటే మన రచనల్లో ఈనాటి సామాజికస్థితి ప్రతిబింబింప చెయ్యాలి.

'సమస్యని ఎత్తిచూపితే సరిపోదు - సమస్యకి పరిష్కారమార్గం చూపాలి' అంటారు కొందరు. వంట వండేవరకు మాత్రమే వంటవాడి బాధ్యత - తినేది మానేది మన ఇష్టం. రుచిగావుంటే మెచ్చుకుంటూ తింటాం - లేకపోతే పక్కకి నెట్టేస్తాం. అలాగే ప్రయోజనకారి అయిన సాహిత్యం పదికాలాల పాటు నిలుస్తుంది. కాలక్షేపం కోసం రాసేది కాలగర్భంలో కలిసిపోతుంది.

సరే, రచనకో ప్రయోజనం వుండాలన్నది అంగీకరిస్తే వాస్తవిక దృక్పథం రచయిత్రులకేనా లేదు, అది పురుషుల రచనల్లో వుందా, కేవలం స్త్రీల రచనల్లోనే లోపిస్తే దానికి కారణం ఏమిటన్నది పరిశీలించాలి.

సహగమనాలు, బాల వితంతువుల ఇక్కట్లు దాటి పద్° ఏట పెండ్లాడి, పన్నెండో ఏట తల్లి అయి భర్తే దైవం ఇల్లే స్వర్గం, పిల్లలే మోక్షం అను

కుంటూ వంటింట్లోనే మగ్గిపోయింది తరతరాలుగా స్త్రీ. నేటిస్త్రీ ఇప్పుడిప్పుడే వంటయింటి గడపదాటి బయటికి వచ్చి లోకాన్ని చూస్తూంది. లోకం అంటే వంటయిల్లే కాదని, పిల్లల్ని కనడం, వంట వండడం మాత్రమేకాక స్త్రీ కూడా అవకాశం యిస్తే అన్నిరంగాలలో పురుషులతో సమంగా ముందంజ వేయ గలదని గుర్తించే స్థితికి ఎదిగింది. స్త్రీ గడపదాటి బయటికి వచ్చి స్కూళ్ళల్లో చదవడంతో ఆరంభించి, ఇప్పుడు పురుషులతో సమంగా అన్ని విద్యలలో ఆరితేరి పురుషులకి తీసిపోని విధంగా ఉద్యోగాలు చేస్తూన్నది. అయితే చదివిన అందరూ ఉద్యోగాలు చెయ్యడం లేదు. నూటికి పదిమంది కూడా ఉద్యోగినులు కారు. మిగతా స్త్రీలు కాలక్షేపం కోసం పెళ్ళి అర్హతకి ఓ డిగ్రీ అవసరం కనుక అంతవరకు చదవడం ఆ తరువాత పెళ్ళికోసం ఎదురు చూస్తూ ఇంట్లో కూర్చోడం మొదలు పెట్టారు. స్త్రీ విద్య విస్తృతం అవడం, అవిభక్త కుటుంబాలు విభక్త కుటుంబాలవడం, ఫామిలీ ప్లానింగ్‌తో పరిమిత కుటుంబం అవడం, ఇంటిపని వంటపనికి ఆధునిక పరికరాలు రావడంతో స్త్రీకి పూర్వం కన్న తీరిక ఎక్కువై కాలక్షేపానికి స్త్రీలు పత్రికలు చదవడం ఆరంభించారు. పఠితలు ఎక్కువై పత్రికలపట్ల ఉత్సాహం చూపడంతో కొత్త పత్రికలు వెలిశాయి. ఆ పత్రికలు నింపడానికి రచయితలు ఎక్కువమంది కావలసి వచ్చారు. పదిరకాల పత్రికలు చదివి, తామూ ఎందుకు రచనలు చెయ్యకూడదని స్త్రీలు రచనలు చెయ్యడం ఆరంభించారు. కొత్తగా స్త్రీలు రాయడం ఆరంభించడంతో స్త్రీల రచనలపట్ల మోజు ఏర్పడింది పాఠకులలో. పూర్వం కన్న భిన్నంగా ప్రేమాయణాలు, ఫామిలీ సెంటిమెంట్లు భార్యాభర్తల కలహాలతో రాసే కుటుంబకథలు స్త్రీ పాఠకులని విపరీతంగా ఆకర్షించాయి. ఇంట్లో వుండేది, తీరికగా చదివేది ఎక్కువభాగం స్త్రీలే కావడంవల్ల పాఠకుల ప్రోత్సాహం గుర్తించి పత్రికలు స్త్రీల రచనలకి ప్రాధాన్యం ఇవ్వడం ఆరంభించాయి. పాఠకులు, పత్రికలు యిస్తున్న ప్రోత్సాహం గుర్తించి రచయిత్రుల సంఖ్య, వాళ్ళ రచనలు విపరీతంగా పెరిగిపోయాయి. రాను రాను పత్రికలంటే ఆడవాళ్ళకోసమేనని అందులో అమ్మమ్మ కథలు, వంటింటి కథలు, ఫామిలీ సెంటిమెంట్లు తప్ప ఏమీ వుండవని, సాహిత్యపు విలువలు బొత్తిగా పడిపోయాయని పురుషవర్గం ఆందోళన వ్యక్తపరచడం మొదలు పెట్టింది. ఈ పరిస్థితికి కారణం స్త్రీలకి రాజకీయ, సాంఘిక అవగాహన లేకపోవడం అని, స్త్రీల రచనల్లో వైవిధ్యం కరువవడానికి వాస్తవిక దృక్పథం లేకపోవడం అనీ కొన్ని వర్గాలనుంచి తీవ్ర నిరసన వచ్చింది.

ఈ పరిస్థితికి కారణం ఏమిటి? రచయిత్రుల కలం నుంచి వైవిధ్యం గల రచనలు ఎందుకు రావడం లేదు? రచయిత్రులకి వాస్తవిక దృక్పథం ఎందుకు కొరవడిందో ఆలోచిద్దాం.

ముందు తరం స్త్రీకంటె నేటి స్త్రీల పరిస్థితి మెరుగుపడినా - యింకా సంఘంలో స్త్రీ స్థానం పురుషునితో సమానమవదు. ఎంత చదివినా, పురుషులతో సమానంగా ఉద్యోగం చేస్తున్నా పురుషులకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు స్త్రీలకి యీనాటికీ లేవు. ఆస్తిహక్కులు, ఓటు హక్కులు వున్నా పురుషునికి తల ఒగ్గి బ్రతికే స్థాయినుంచి యింకా బయటపడలేదు స్త్రీ. ఉద్యోగిని అయినా యింట్లో వంట వండి, ఒద్దిగా తలొంచుకు బస్సెక్కి ఆఫీసుకి వెళ్ళి, తలొంచుకు ఫైళ్ళు రాసి, మళ్ళీ ఒద్దిగా బస్సెక్కి యింటికి రావాలి. పురుషునిలా స్త్రీ రోడ్లంబడి తిరగలేదు, షికార్లకి, క్లబ్బులకి, పార్టీలకి ఒంటరిగా వెళ్ళే స్వేచ్ఛాస్వాతంత్రాలు స్త్రీలకి యీనాటికీ లేవు. కింద తరగతి స్త్రీ ఎలా తిరిగినా ఎవరూ పట్టించుకోరు. పై అంతస్తు స్త్రీ-ఫాషన్ పేరిట: ఆధునికత పేరిట క్లబ్బులు పార్టీలు తిరిగినా చెల్లుబాటు అవుతుంది. ఎటొచ్చీ అన్ని నిబంధనలు మధ్య తరగతి స్త్రీలకే. అధవా ఏ ఒక్క స్త్రీ అయినా అలా లెక్క-చెయ్యకుండా తిరిగితే బరితెగించిన దానిగా చెడిపోయిన ఆడదానిగా సంఘం ముద్ర వేస్తుంది. ఆ కారణాలతో స్త్రీకి పురుషునిలా విశాల దృక్పథం అలవడే అవకాశం లేదు- స్త్రీ దృక్పథం ఎంత సేపటికి నాల్గు గోడల మధ్య పరిమితి అయింది. ఎంత చదివినా ఎందుకో స్త్రీలకి రాజకీయ అవగాహన తక్కువ. నలుగురు మగవాళ్లు కలిస్తే రాజకీయాలు మాట్లాడుతారు. నలుగురు చదువుకున్న ఆడవాళ్ళు కల్సినా వంట, పిల్లలు, చీరలు, నగలు ముచ్చటిస్తారు-తప్పులేదు-సహజ గుణం అది. స్త్రీలకి బొత్తిగా రాజకీయ అవగాహన లేకపోవడం, ఏదన్నా ఒక విషయం గురించి క్షుణ్ణంగా తెలుసుకుని రాయడానికి విషయ సేకరణకు కావల్సిన పుస్తకాలు కొని చదవడానికి గాని, కావల్సిన చోట్లకి స్వయంగా వెళ్ళి పరిశీలించి రాయడానికి ఆర్థిక స్తోమతా లేదు-అవకాశమూ లేదు-విదేశీయులకి మాదిరి మనకి ప్రొఫెషనల్ రైటర్స్ లేరు-ఏ ఒక్కరిద్దరో మినహా. మనకు అంతా కాలక్షేపానికి, అచ్చులో పేరు చూసుకుని ఆనందించడానికి, పత్రికలు నాలుగు డబ్బులు యిస్తే సంతోషించడం తప్ప పుస్తకాలు రాసి వేలు లక్షలు ఆర్జించే అవకాశం మనకి లేదు. అంచేత విషయ పరిజ్ఞానానికి ఎంతసేపు సినిమాలు (అవీ సెంటిమెంట్సు తప్ప మరోటి చూపవు) తప్ప మరోటి మనకి లేవు-ఏ విషయం గురించన్నా ఏ అన్ననో, తండ్రినో అడిగితే 'ఆ పెద్ద రచయిత్రివేమో ఆమాత్రం తెలీదూ'అంటూ హాస్యం చేస్తారు-ఏ ఆఫీసు బ్యాక్‌గ్రౌండ్‌తోనో వున్న కథ రాయాలంటే ఆ ఆఫీసు వాతావరణం, టెక్నికల్ పదాలు, పదవులు వగైరా క్షుణ్ణంగా తెలిస్తే తప్ప ఆ రచన పేలవంగా లోపభూయిష్టంగా వుంటుంది. ఏ పడుపు వృత్తి చేసుకునే స్త్రీ గురించో రాయాలంటే ఆ వాడ వెళ్ళి, ఆ వాతావరణం, ఆ స్త్రీలని, వారికట్టు, బొట్టు, మాటతీరు అన్నీ పరిశీలించి రాయటానికి ఓ రచయిత్రికి అవకాశం వుందా? అదే రచయితకైతే వుంటుంది.

## మేల్కొన్న స్వప్నం

కారు చీకటిలోనే పుట్టినా,
కాంతిరేఖ కోసం తడుముకొంటున్నా!
కటిక నేలపైనే పడుకొంటున్నా,
ఆశల దుప్పట్లు కప్పుకొంటున్నా!
అర్ధాకలితో తిరుగుతున్నా,
నీలాంబరమంతటి హృదయాన్ని పోషించుకుంటున్నా!

కూటికి లేని నేటిని
కూకటి వేళ్ళతో కూల్చేసి
ఆకలి చీకటి లేని రేపును నిర్మించేందుకు
మేల్కొని సుందర స్వప్నాల్ని విరచిస్తున్నా!

—దినవహి వైజయంతి

# నువ్వు వెలిగించే దీపం

చెల్లీ!
నేడు నీవు దీపాలు వెలిగిస్తావు
పండుగ చేసుకుంటూ పరవశిస్తావు
నువ్వు వెలిగించే దీపాలు
బాహ్య ప్రపంచపు అంధకారాన్ని అంతం చెయ్యొచ్చు
నిండు పున్నమి వెన్నెల్ని తాత్కాలికంగా సృష్టించవచ్చు

కాని—

కక్షలతో, కార్పణ్యాలతో కలుషితమైన
కఠిన పాషాణ హృదయాల మాటేమిటి?

కాళ్ళకి బలపాలు కట్టుకొని తిరుగుతూ,
కళ్ళలో దీపాలు పెట్టుకొని వెదుకుతూ,
పుట్టెడు దుఃఖాన్ని గుండెల్లో దాచుకొని,
కుమిలి కుమిలి ఏడ్చే ఆడపిల్లల తండ్రి
గుండెల మీద కుంపటిల్లా మిగిలిపోయి
పెళ్ళీడుకొచ్చి పెళ్ళికి నోచుకోని
నిర్భాగ్య నిరుపేద కన్నెల గుండెల్లో
గూడుకట్టుకొన్న చిక్కటి చీకట్ల మాటేమిటి?

ఉన్న ఆస్తి కాస్తా కర్పూరంలా హరించుకుపోగా
విశ్వవిద్యాలయాలు బహూకరించిన
పట్టా కాగితాలు చేతబట్టుకొని
పట్టెడు మెతుకుల కోసం పొట్టలు చేతపట్టుకొని
గానుగెద్దులా తిరుగుతూ
ఉద్యోగాన్వేషణలలో విసిగి వేసారిపోయి,
ఉద్యోగం ఉన్నవాళ్ళకీ, రికమండేషన్స్ వున్నవాళ్ళకీ అని
తెలుసుకొని,
బ్రతుకుబాట భయంకరంగా కన్పిస్తుంటే,
బ్రతుకు రోసి, జీవితంపై విసిగి
ఆత్మాహుతి చేసుకొంటున్న నిర్భాగ్య నిరుపేద నిరుద్యోగుల
మాటేమిటి?

ఆకలి బాధ అగ్నికీలల్లా దహించి వేస్తుంటే
మానాన్ని అభిమానాన్ని మార్కెట్టులో పెట్టి
మలినమైపోయిన మగువల దీన గాథల మాటేమిటి?

అక్రమం అన్యాయం అధర్మాల మాటేమిటి?

దొంగ వ్యాపారం దోపిడీ వ్యాపారాల మాటేమిటి?

అందుకే చెల్లీ!
నువ్వు వెలిగించే దీపం చిరుదీపమైనా
చిట్టి మట్టి దీపమైనా
నీ చిన్నారి చిట్టి చేతులతో వెలిగించు
నా జాతి గుండెల్లో గూడుకట్టుకొన్న
నిరాశా నిస్పృహల చీకట్లను తొలగించు
కనీసం ఒక దుఃఖితుడు నవ్వినప్పుడు
ఒక పతితుడు కన్విప్పినప్పుడు
అప్పుడు—ఆ రోజు ఎప్పుడైనా
నువ్వు వెలిగించే దీపానికి అర్థం వుంటుంది
నీ జీవితానికో పరమార్థం లభిస్తుంది.

—డాక్టర్ టి. విమల

నడిబజార్లో నాలుగు రోడ్ల సెంటర్లో నిలబడి సిగరెట్లు కాలుస్తూ వచ్చేపోయే వారిని పరిశీలిస్తుంటే కథకి కావల్సిన ఏ అంశాలన్నా కనపడతాయి-అలాంటి అవకాశం స్త్రీలకి లేదు. నలుగురు మగాళ్లు కలిసి డ్రింక్స్, క్లబ్బులు-పార్టీలు-క్లబ్బు వాతావరణం యివన్నీ పరిశీలించి రాసే అవకాశం రచయిత్రులలో ఎంతమందికుంది? వృత్తిరీత్యా బస్సులలో, రైళ్ళలో, ప్లేన్లలో మగవాళ్ళకు రకరకాల వ్యక్తులతో రకరకాల అనుభవాలు జతపడతాయి. ఆడవాళ్ళకి ఎప్పుడో ఏ పుట్టింటికో వెళ్ళేటప్పుడు రైలో బస్సో ఎక్కి వెళ్ళడం తప్ప నాలుగు వూళ్ళకి వెళ్ళి నలుగురిని కలిసి మాట్లాడే అవకాశం ఏది? ఏ విషయం గురించన్నా అవగాహన లేనిదే రాస్తే ఆ రచనకి సంపూర్ణత సిద్ధించదు. తెలియని విషయాలు రాసి నవ్వుల పాలయ్యేకంటె తమకు తెల్సిన విషయాలు తమ పరిధిలోని సమస్యలు రాసి తృప్తి పడుతున్నారు రచయిత్రులు. ప్రేమలు పెళ్ళిళ్లు, కుటుంబ సమస్యలు, భార్యా భర్తల కీచులాటలు, సెంటిమెంట్స్ రాస్తే అది రచయిత్రుల తప్పు కాదు-వారి దృక్పథం, పరిధి నాలుగు గోడల మధ్యే పరిమితి అయిందంటే మన సమాజపు కట్టుబాట్లు అలా వున్నాయనాలి.

స్వజాతి మీద ఆపేక్షతో రచయిత్రులని వెనకేసుకు రావడం కాదు. తెలుగు నాట రచయిత్రి యీ దశాబ్దంలో పుట్టింది. పుట్టిన పసిపాప వెంటనే లేచి పరిగెత్తలేదు. పాప బోర్లపడాలి, పారాడాలి, కూర్చోవాలి, నిల్చోవాలి, పరిగెత్తాలి. యీతరం స్త్రీ రాయడానికి అలవాటు పడింది. మరు తరం స్త్రీ అభిరుచి పెంచుకుంటుంది. సంగీతం మొదలుపెట్టగానే విద్వాంసులు అవలేరు ఎవరూ-నాట్యం మొదలుపెట్టగానే గజ్జెకట్టరు. తీయగా తీయగా రాగం.... రాయగా రాయగా కావ్యం-అని నమ్మి ముందు తరం స్త్రీల రచనల్లో యీనాడు లోపించినవి సర్దుకుంటాయని ఆశిద్దాం.



కొత్తశీర్షిక

# కూరలు - పోషకపదార్థాలు

మనం నిత్యం భుజించే కూరలలో, పళ్ళలో ఎన్నో పోషకపదార్థాలు, విటమిన్లు వున్నాయి. అలాగే వీటిలో ఆరోగ్యాభివృద్ధి చేసే గుణాలూ, అనారోగ్యాన్ని కలగజేసే గుణాలూ కూడా వున్నాయి. 'ఏదో ఒక కూర వండుకున్నాం. తిన్నాం' అని కాకుండా - ఆయా కూరల గురించి తెలుసుకోవడం వల్ల పుష్టికరమైన ఆహారాన్ని ఎంచుకోవడానికి వీలవుతుంది. కుటుంబ సభ్యులందరూ ఆరోగ్యంతో కళకళ లాడుతూ వుండడానికి దోహదకారీ అవుతుంది. అందుకే వాటిని గురించిన వివరాలు ప్రతినెలా పాఠకుల సౌకర్యార్థం అందజేయ దలచు కున్నాము.



వంకాయ: ఈ వంకాయలో ఎన్నో రకాలు వున్నాయి. నీటి వంకాయ, మెట్ట వంకాయ, కొండ వంకాయ, గుత్తి వంకాయ, గుండ్రటి వంకాయ, కస్తూరి వంకాయ, కోల వంకాయ - యిలా ఎన్నో రకాలు. ఈ నీటి వంకాయలో తెల్లటివి, నల్లటివి అని రెండు రకాలు. వంకాయలు లేత వైతే వంటకి శ్రేష్ఠం, రుచీ బాగుంటుంది.

ప్రతి వంద గ్రాముల వంకాయలోనూ - తేమ 91.5 గ్రాములు, ప్రొటీన్లు 1.3 గ్రాములు, క్రొవ్వు 0 3 గ్రాములు, ఖనిజాలు 0.5 గ్రాములు, పిండి పదార్థం 6.4 గ్రాములు, కాల్షియం 0.03 గ్రాములు, భాస్వరం 0.02 గ్రాములు, ఇనుము 0.5 మిల్లి గ్రాములు, విటమిను బి. 0.06 మిల్లిగ్రాములు, నికోటినిక్ ఆమ్లం 0.4 మిల్లిగ్రాములు, రిబోఫ్లోవిన్ 0.01 మిల్లిగ్రాములు, విటమిన్ సి 5 మిల్లిగ్రాములు, ఆక్సాలిక్ ఆమ్లం 29.1 మిల్లిగ్రాములు వున్నాయి. వంద గ్రాముల వంకాయల్లో కెలోరీ విలువ 15 కెలోరీలు.

వంకాయ వేడి జేస్తుంది. పైత్యాన్ని వృద్ధి చేస్తుంది. సాధారణంగా అన్ని రకాల వంకాయలు దురద, క్రిములను కలుగజేస్తాయి. కొండవంకాయ జడత్వం కలగజేస్తుంది.

వంకాయ-కఫం, వాతం వీటిని హరింపజేస్తుంది. ఆకలి పుట్టిస్తుంది. శుక్రాన్ని వృద్ధి చేస్తుంది. తెల్ల వంకాయ కళ్ళకు మేలు చేస్తుంది. కొండ వంకాయ చలవ చేస్తుంది. అతి మూత్రాన్ని విరోధిస్తుంది. కొండ వంకాయలలో లేతవంకాయ-పిత్తం, దప్పిక, తాపం వీటిని హరింపజేస్తాయి. పుష్టిని, బలాన్ని సమకూరుస్తుంది. వీర్యాభివృద్ధి చేస్తుంది. జ్వరం, ఆకలిలేమి, దగ్గు మొదలైన వాటిని హరింపజేస్తుంది. పథ్యకరమైనది - ఇది వంకాయకు సంబంధించిన ఆయుర్వేద సిద్ధాంతం.



బెండకాయ: వీటిల్లో ఏడాకుల బెండ, బెండ, పాలబెండ అని మూడు రకాలు వున్నాయి. పాల బెండకాయలు పొడవుగా వుంటాయి.

ప్రతి వంద గ్రాముల బెండకాయలోనూ—88 గ్రాముల తేమ, 2.2 గ్రాముల ప్రొటీన్లు, 0.2



గ్రాముల క్రొవ్వుపదార్థం, 0.7 గ్రాముల ఖనిజాలు, 1.1 గ్రాముల నార, 7.7 గ్రాముల పిండిపదార్థం, 0 09 గ్రాముల కాల్షియం, 0.08 గ్రాముల భాస్వరం, 1.5 మిల్లిగ్రాముల ఇనుము, 48 యూనిట్ల విటమిన్ ఏ, 0.06 మిల్లిగ్రాముల విటమిన్ బి; 0.6 మిల్లిగ్రాముల నికోటినిక్ ఆమ్లం, 0.06 మిల్లిగ్రాముల రిబోఫ్లోవిన్, 16 మిల్లిగ్రాముల విటమిన్ సి, 10.3 మిల్లిగ్రాముల ఆక్సాలిక్ ఆమ్లం వున్నాయి. వంద గ్రాముల బెండకాయల్లో 41 కెలోరీలు వుంటాయి.

బెండకాయ కూరలలో శ్రేష్ఠమైనదే కాని-జీర్ణశక్తి లేనివారు ఈ కూర తినకూడదనీ, వాతం రోగులు, జలుబుతో బాధపడుతున్నవారు ఈ కూర ఉపయోగించకూడదనీ శ్లేష్మం కల్గించేగుణం దీనికి వుండటంవల్ల దగ్గు, ఒగర్పు వున్నవారు కూడా ఈ కూర ఆరగింపకూడదనీ మలబద్ధము చేస్తుందనీ అందుకని దీనికి విరుగుడుగా జీలకర్ర, పుల్లమజ్జిగతో ఈ కూర వండుకోవాలనీ ఆయుర్వేద శాస్త్రం చెబుతుంది.

ఇక బెండకాయవలన కలిగే లాభాలు-చలవ చేస్తుంది. ధాతువృద్ధి చేస్తుంది. పుష్టినిస్తుంది. పైత్యాన్ని వుపశమింపజేస్తుంది. మెదడులోని కణాలను అభివృద్ధిపరుస్తుంది. బలాన్ని పెంపొందింపజేస్తుంది.




రూపేకాదు ఊరూ పేరూ కూడా లేనివాడు దేవుడు. కానీ తమకు ఇష్టమైన రూపంలో, ఒక పేరుతో, ఒక స్థలంలో దేవుని పూజించడం మానవ నైజం. పిలిచే పేరూ, కొలిచే రూపూ, తీరూ ఆయా పరిణామ దశను అనుసరించి వుంటాయి. అవి ఆయా ప్రజల మానసిక పరిపక్వతకు, సంస్కృతికి, ఆధ్యాత్మిక ప్రగతికి సాక్ష్యాలుగా నిలుస్తాయి!

మానవజాతి తన పరిణామ పయనంలో లెక్క లేనన్ని మజిలీలు దాటింది. మనిషి, దేవుని గురించిన — అంటే తన కన్నా, కనబడే ప్రకృతి కన్నా మించి వాటిని నడిపించే దివ్యశక్తిని గురించిన అవగాహన, ఊహ ఆయా మజిలీకి తగిన విధంగా మార్పు చెందుతూ వచ్చింది.

మానవుడు ఒక పరిణామదశలో ఒక్కొక్క ప్రకృతిశక్తికి ఒక్కొక్క పేరుపెట్టి వాటిని పూజించసాగాడు. ఉదాహరణకి నిప్పును 'అగ్నిదేవుని'గా నీళ్ళను 'వరుణభగవానుడి'గా భావించడమే కాదు, వాటి బారి నుంచి తనను రక్షించుకోడానికి, వాటి దయను పొందడానికి పూజాపునస్కారాలు, యజ్ఞయాగాదులు చేయసాగాడు. కొన్నాళ్ళకు అవి హైందవమత సంప్రదాయాలుగా జీవితరంగంలోకి అడుగుపెట్టాయి. అలాంటి సంప్రదాయాలలో ప్రముఖమైనది నాగపూజ.

నాగులను దేవతలుగా పూజించడం ఒక్క భారతదేశానికే పరిమితం కాదు. ప్రపంచంలోని నాగరిక దేశాలన్నిటిలోనూ పాములను పూజించారు-అనడానికి చారిత్రకాధారాలు చాలా ఉన్నాయి.

ప్రారంభదశలో పాముల మీద భక్తి యేర్పడడానికి కారణం-మనిషి భయమే అయి వుండవచ్చు. వాటికి పూజలు చేస్తే కాటు వేయకుండా వదులుతాయనీ, యేటా పూజలు యేర్పాటు చేస్తే తమను కాపాడతాయనీ విశ్వాసం కలిగి వుండవచ్చు. తమ జీవితంలో తారసపడ్డ సంఘటనలు, యేర్పడ్డ అనుభవాలు, ప్రాచుర్యంలో వున్న కథలు, పురాణగాథలు ఈ విశ్వాసానికి ప్రాతిపదికలై వుండవచ్చు — అంటారు పెద్దలు.

పొలం దున్నేప్పుడు నాగేటిచాలులో తగులుకున్న పాముపిల్లలు కొన్ని చనిపోయాయట. తల్లి పాము కోపించి అలా చేసిన కాపు కుటుంబాన్ని సర్వనాశనం చేయాలని ఆ యింటి వాళ్ళందరినీ కాటేసి చంపిందట! కాపు పెద్ద కూతురు ప్రక్క పల్లెలో వుండడం వల్ల, ఆమెను వెదుక్కుంటూ వెళ్ళిందట. ఆమె అక్కడ గోడ మీద పాము బొమ్మను గీసి పూజ చేయడం చూసి — పాము, కాటు వేయడానికి బదులు. ఏం వరం కావాలో కోరుకోమందట. ఆమె పాము కాటుతో ప్రాణాలు కోల్పోయిన తనవారందరూ పునర్జీవితులు కావాలని ప్రార్థించగా అలాగే జరిగిందట. ఈ శుభదినం జ్ఞాపకంగా యేటా ఆ రోజున సర్పపూజ చేస్తే సర్పభయం వుండదనీ, పాములవల్ల హాని యేర్పడదనీ ఒక విశ్వాసం యేర్పడింది.

కాలక్రమేణా పాములు హైందవుల ఆరాధ్య దేవతలకు ఆభరణాలుగా పరిణతి చెందాయి. పరమశివుడు పన్నగభూషణుడుగానే కాకుండా, గణపతి కూడా నాగాభరణుడుగా అక్కడక్కడా అభివర్ణించబడ్డాడు.

ఉదాత్తమైన ఆధ్యాత్మిక విలువలను, ఉన్నతమైన జీవిత సత్యాలను కథలుగా, పాత్రల రూపంలో, కవితాధోరణిలో, సంకేతంగా సూచించడం ఋషి తుల్యులైన మన ప్రాచీన కవుల ఆనవాయితీ!

దేవదానవులు అమృతం కోసం క్షీరసాగర మథనం చేసినపుడు మంధరగిరిని కవ్వంగానూ, వాసుకి అనే సర్పరాజాన్ని తాడుగానూ వేసి మథించారట! జీవితసాగరాన్ని అనుభవమనే మంధరగిరితో వాసుకి అనే జ్ఞానంతో మథిస్తే ఆనందామృతం లభిస్తుంది-ఇదే క్షీరసాగరమథన కథనం సూచించే పరమార్థం! ఇక్కడ సర్పాన్ని జ్ఞానానికి సంకేతంగా చెప్పడం విశేషం!

జీవితంలోని చీకటి వెలుగులకు, హెచ్చు తగ్గులకు కారణభూతాలు నవగ్రహాలు. తొమ్మిది గ్రహాలు ఆడుకునే బంతి ఆటలు మానవ జీవితాలు. ఇది జ్యోతిశ్శాస్త్రజ్ఞుల వ్యాఖ్యానం! ఈ నవగ్రహాలలో మోగకారకు డనబడే రాహువుకు పాము తల, జ్ఞానకారకుడని కీర్తించబడే కేతువుకు పాము శరీరం. జ్ఞాన, మోగాలకు సంకేతాలుగా పాములను పేర్కొనడం ఇక్కడ గమనించవలసిన మరొక విశేషాంశం!

మచ్చామాలిన్యం లేని మంచి మనసులోనే జ్ఞానం ఉదయిస్తుంది. అనంతమైన జ్ఞానమే నిరతిశయానంద నిలయం! ఈ అమరసత్యానికి అద్భుతమైన రూపకల్పనే — పాలకడలి (మంచి మనసు)లో శేషతల్పం (జ్ఞానం) మీద పవళించిన పరంధాముడు (ఆనందం) — అంటారు విజ్ఞులు!

కాళీయ ఫణిమణుల మీద దివ్య నర్తనం చేసే భంగిమలో శ్రీకృష్ణ విగ్రహాలు, వర్ణచిత్రాలు, వైష్ణవాలయాలకు ప్రత్యేక ఆకర్షణ చేకూరుస్తాయి.

భారతీయ సంస్కృతికి దర్పణాలుగా అభిమానించబడే రామాయణ భారతాది కావ్యాలలో కూడా నాగుల ప్రశస్తికి నాగ వంశీయుల ప్రసక్తికీ కొదువే లేదు.

భారతంలోని రారాజు సుయోధనుడు నాగధ్వజుడు! అర్జునుడు పెళ్ళాడిన ఉలూచి నాగకన్య. అంచేత నాగరాజులు అంటే పాములను చిహ్నంగా, ధ్వజంగా భావించిన వంశం వారనీ ఇట్టే ఊహించవచ్చు. వాళ్లు నాగులను పూజించేవారై ఉండవచ్చు. కానీ ఇవాళ ఒక వంశం, ఒక తెగవారు మాత్రమే కాకుండా అన్నివర్గాల వాళ్ళూ, ముఖ్యంగా పల్లె ప్రజానీకం - నాగపూజ చేయడం హైందవ ఆచారం అయింది!

దక్షిణ భారతదేశంలో దీపావళి తర్వాత వచ్చే

చవితి రోజున నాగ పూజలు చేస్తారు.

మామూలుగా రావి, వేపచెట్లు చేరి వుండే రచ్చమీద పాము విగ్రహాలు చెక్కబడిన తెల్లటి బండలు వుంటాయి. అలా కాకపోతే, గ్రామ దేవత ఆలయంవద్ద, లేదా శివాలయ ప్రాంగణంలోనో, నాగ విగ్రహాలు వుంటాయి. నాగులచవితి ఉదయాన్నే పూజారులు వాటికి అభిషేకంచేసి - పసుపు కుంకుమలతో, పుష్పాలతో అలంకరిస్తారు. తెల్లవారగానే భక్తులు ముఖ్యంగా స్త్రీలు, పాలు తీసుకెళ్ళి విగ్రహాలకు పక్కనున్న పుట్టలో సమర్పించి





ప్రదక్షిణం చేసి వస్తారు. మధ్యాహ్నంపైన పూజా ద్రవ్యాలతో పాటు బెల్లం కలిపిన బియ్యం పిండి, మొలకెత్తిన సజ్జలు నాగ విగ్రహాలకు నైవేద్యం పెట్టి - వాటిని అక్కడ చేరిన వారికి పంచిపెడతారు. ఆ రోజంతా ఉపవాసం వుంటారు. మరురోజు ఉదయం పొలాలకు వెళ్ళి నల్లేరు తెచ్చి పచ్చడిచేసి- పిండి వంటలతో పండగ చేస్తారు.

ఐతే, ఉత్తర భారతదేశంలో శ్రావణ మాసంలో 'నాగ పంచమి' రోజున విశేషంగా ఈ నాగపూజలు చేస్తారు!

*

# 卐 స్వస్తిక్ శికాకాయ్
## సౌందర్యపు సబ్బు–జుట్టు కొరకు
## క్రొత్త రేపర్! క్రొత్త ఆకృతి! క్రొత్త సువాసన!




**జుట్టుకు సిల్క్‌వంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము**

Shilpi-dm-18/78 Tel

# అమెరికన్ టెక్నాలజీ

అమెరికాకి అన్ని రంగాలలోనూ ముందడుగు వేసిన దేశంగా ఎంతో పేరు వుంది. అయితే ఈ పేరు ఒక్క రోజులో రాలేదు. ఎన్నో దశాబ్దాల కృషి, ఈ ముందడుగు వెనక కనిపిస్తుంది. ఆ విషయాలన్నీ వివరించే ఒక ప్రదర్శనని— అమెరికన్ టెక్నాలజీ—భారత దేశంలోని ప్రధాన నగరాలలో నిర్వహించారు. విద్యాసాంస్కృతిక సంబంధాలకి సంబంధించిన భారత అమెరికా దేశాల ఉపసంఘం ఆధ్వర్యంలో ఈ ప్రదర్శన జరిగింది. మద్రాసులో మూడువారాలు దీనిని నిర్వహించారు.

అమెరికన్ నవసమాజం ఆవిర్భవించడానికి






దోహదం చేసిన సంఘటనలని ఆసక్తికరంగా ఈ ప్రదర్శనలో చూపారు. ప్రదర్శనలో మొత్తం ఐదు విభాగాలు వున్నాయి. అవి సాంకేతిక పురోగమనానికి మూల విషయాలు, ఆహారం—ఆరోగ్యం, దుస్తులు—గృహాలు, వార్తా ప్రసారం—ప్రయాణం, బంగారు భవిష్యత్ కోసం సాంకేతిక విజ్ఞానం.

ప్రతి విషయం గురించి పూర్తి అవగాహన వున్న వనితలు ఈ ప్రదర్శనలో వాటి గురించి ఎంతో ఓర్పుతోనూ నేర్పుతోనూ ప్రేక్షకులకి వివరించారు. ఈ ప్రదర్శనలో వనితలని ప్రత్యేకంగా ఆకర్షించిన విభాగం 'దుస్తులు—గృహాలు'. (క్లోతింగ్ అండ్ షెల్టర్)

ఈ విభాగంలోకి అడుగు పెట్టిన వెంటనే కుట్టుమిషన్ కనిపిస్తుంది. అమెరికన్లు రెడీమేడ్ దుస్తులమీదే ఆధారపడుతున్నా కుట్టుమిషన్ కనిపించని అమెరికన్ గృహం కనిపించదు. దుస్తులకి కావలసిన రిపేర్లు చేసుకోడానికి, అవసరమయితే వాటిని 'సైజ్' చేసుకోడానికి అమెరికన్ గృహాలలో కుట్టుమిషస్ అత్యవసర వస్తువుగా వుంటోంది. అందుబాటులో వున్న ధరకి దుస్తులు లభించినప్పుడు వాటిని అమెరికన్లు ఇళ్ళలోనే కుట్టుకుంటున్నారు. 1840 లో ఎలియస్ హో కనిపెట్టిన లాక్—స్టిచ్ సూయింగ్ మిషన్‌తో బట్టలని వేగంగా కుట్టడం ప్రారంభమయింది. ఈ సూయింగ్ మిషన్‌లో మరికొంత మార్పు తీసుకువచ్చి ఇసాక్ మెరిట్ సింగర్ మెరుగు పరచిన కుట్టుమిషన్, అందరి ఇళ్ళలోనే కాక రెడీమేడ్ దుస్తులు తయారుచేసే ఫ్యాక్టరీలలోనూ స్థానం సంపాదించుకున్నది. అలా కుట్టుకథ ఎంతో ఆసక్తికరంగా ఈ విభాగంలో వివరించారు.

1793 లో ఎలీ వైట్నే కాటన్ దుస్తులు వాడకంలోకి రావడానికి ఎంతో తోడ్పడ్డాడు. అయితే 1938 లో వాలెస్ కరోథర్స్ నైలాన్‌ని సృష్టించడంతో 'వస్త్ర విప్లవం' వచ్చింది. వస్త్రాలు సరాసరి ప్రయోగశాలలలోనే జన్మించడం ప్రారంభమయింది. ఈ అంశాలన్నీ ప్రదర్శనలో ఎంతో కుతూహలం కలిగించే విధంగా అమర్చారు.

బటన్ల స్థానంలో ఉపయోగిస్తున్న 'జిప్పర్'లు 1893 లో వైట్‌కాంబ్ జడ్సన్ కనిపెట్టిన దగ్గర నుంచీ ఈ రోజు వరకూ వివిధ రకాలలో ఎలా పరిణితి చెందిందో ఈ విభాగంలో ప్రదర్శించారు. వనితలు తమ దుస్తులకి ఈ 'జిప్పర్స్'ను అనువుగానూ అందంగానూ పెట్టుకోవడం వివిధ చిత్రాలలోనూ ప్రదర్శించారు. జిప్పర్స్ అమర్చిన దుస్తులనీ ప్రదర్శించారు.

1850 లో రూపొందించిన 'ఐరన్ స్టవ్' గృహాలలో వంటచేయడానికి వనితలకి ఎంతో సహాయకారిగా లభించింది. 1890 ప్రాంతంలో వంటకి గ్యాస్ సరఫరా చేశారు. 1900 ప్రాంతాలలో విద్యుచ్ఛక్తిని వంటకి వినియోగించడం ప్రారంభమయింది. ఇప్పుడు ఈ రెండూ వినియోగంలో వున్నాయి.

ఇక నివసించే గృహాలని సరాసరి ఫ్యాక్టరీలలో నిర్మించి కావలసిన చోటికి చేరవేస్తున్నారు. అలా కాలం కలసివచ్చి ప్రయాస లేకుండా రెడీమేడ్ గృహాలు లభించడంతో అమెరికన్లు గృహాన్ని స్వర్గసీమగా మార్చుకోడానికి మిగిలిన కాలాన్ని వినియోగించుకోగలుగుతున్నారు. అన్ని వివరాలతో ఈ విభాగంలో అమర్చిన విషయాలు ఎంతగానో ఆకర్షిస్తాయి.

సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందడంతో అమెరికాలో వనితలకి గృహ జీవనంలో సుఖం, విరామం ఎలా లభిస్తున్నాయో ఈ ప్రదర్శన చూసి ఊహించుకోవచ్చు. అందుకే ఈ ప్రదర్శన వనితలని ఎంతగానో ఆకట్టుకుంది.

బి. కృష్ణవేణి



## శకుంతల

'దీపావళి' పండగ సందర్భంగా 'వనిత' పాఠకులకు అందజేస్తున్న కానుక–ప్రఖ్యాత చిత్రకారుడు రవివర్మ వేసిన మరొక తైల వర్ణచిత్రం–శకుంతల. రవివర్మ 'శకుంతల' లోని పలు సన్నివేశాలకు రూపం కల్పించారు. వాటిల్లో ఇదొక సన్నివేశం.

**శ్రీచిత్ర ఆర్ట్‌గాలరీ అఫ్ మ్యూజియమ్ కాంప్లెక్, త్రివేంద్రమ్ సౌజన్యంతో**

కలర్ ట్రాన్స్‌పరెన్సీ : సత్యకుమార్




మన దేశంలో బాణాసంచా తయారు చేసే పరిశ్రమలు ముప్పాతిక మువ్వీసం దక్షిణ ప్రాంతంలోని 'శివకాశి' లోనే వున్నాయి. 'వనిత' ప్రతినిధి ప్రత్యేకించి 'శివకాశి'కి వెళ్ళి అక్కడి ప్రముఖ సంస్థ 'స్టాండర్డ్ ఫైర్ వర్క్స్'ని సందర్శించి వచ్చారు. విశేషమేమంటే అక్కడి పనిలో తొంభై శాతం స్త్రీల చేతుల మీదుగానే జరుగుతోంది. పైగా ఆ ఫ్యాక్టరీ భాగస్వామురాలు ఒక స్త్రీ. ఆమె పేరు మల్లికా రాజాక్రిష్ణ. దీపావళికి శోభ తెచ్చే బాణాసంచా పరిశ్రమకు సంబంధించిన వివరాలు, ఫొటోలు యిక్కడ పొందుపరుస్తున్నాము.

దీపావళి....

ఆ పేరు తలచుకోగానే – సంతోషం.... సంరంభం....సందడి.

ఇతర పండుగలవలె కాకుండా ఈ పండుగ కొక ప్రత్యేకత వుంది. అందుకే యిది ప్రతి యింటా పిన్నా – పెద్ద అందర్నీ ఆకర్షించే పండుగ అయింది.

ఆనాడు నరకాసురుడిని వధించడంలో కృష్ణు

డుకి సత్యభామ తోడ్పడింది. అందువల్ల యిది వనితలకు కూడా ఓ పెద్ద పండుగ అని చెప్ప వచ్చును.

అయితే దీపావళి అనగానే ప్రతి ఒక్కరికీ చటుక్కున స్ఫురించేది ఒక్కటే – అదే బాణాసంచా!

రకరకాల ప్రేలుడు టపాకాయలతోనూ, రంగు రంగుల కాంతులీనే కాకరపువ్వొత్తులు, చిచ్చు బుడ్లతోనూ – ప్రమిడల దీపాల మధ్య సందడి గొలిపే ఈ పండుగ యింటింటా ఆనందతాండ వానికో మచ్చుతునక.

ఈ బాణాసంచా వెలిగిస్తూంటే ఒక కుతూహలం, అవి పేలుతూంటే ఒక విధమైన భయం, అంతకుమించిన ఆనందం చిన్నారి పాపల కన్నుల్లో ద్యోతకమవుతాయి – అదే దీపావళి పండుగ ప్రత్యేకత!

చిన్నారిపాపలలోనే కాక పెద్దలలో కూడా యింతటి కుతూహలాన్నీ, వుత్సాహాన్నీ కలగ జేస్తున్న ఈ బాణాసంచా ఏ విధంగా తయా రవుతున్నది?

"బాణాసంచా తయారు చేయడానికి – వివిధ మందాలలో తెల్లని దారం, బొగ్గుపొడి, గంధకం పొడి, సాల్ట్‌పీటర్, బేరియం నైట్రేట్, అల్యూమినియం పొడి, పొటాషియం నైట్రేట్ – ముడి పదార్థాలుగా తీసుకోవాలి." అన్నారు స్టాండర్డ్ ఫైర్ వర్క్స్ భాగస్వామిని శ్రీమతి మల్లికా రాజాక్రిష్ణ.

బాణాసంచా తయారు చేయడానికి ముందుగా వత్తి తయారు చేసుకోవాలి. మూడు లేక నాలుగు అడుగుల పొడవు గల తెల్లటి దారాన్ని తీసుకుని దానికి నల్లని రసాయనం పూసి ఆరబెట్టాలి. ఆ తరువాత దానికి జిగురు పూసి, వుల్లిపొర లాంటి తెల్లని కాగితం తీసుకుని ఆ దారానికి బిగువుగా చుట్టి ఎండబెట్టాలి.

ఇక రెండవ అంకం. ఆ వత్తి ఇమడడానికి కావలసిన గొట్టాలను తయారుచేయడం. దళసరి అట్టలాంటి కాగితాలను చుట్టగా చుట్టి గొట్టాలను తయారుచేయాలి. సాధారణంగా ఈ గొట్టాలను ఎరుపు లేక ఆకుపచ్చరంగు నీళ్ళల్లో ముంచుతారు. ఆ తరువాత వందా లేక నూటఏభై గొట్టాలను కలిపి చుట్టి ఒక గుండ్రని చట్రంలో బిగించాలి. ఇవి బిగుసుకుపోవాలంటే అందుకు తడిమట్టి కావాలి. మనం చేసుకునే టపాకాయల సైజుని



బట్టి ¾ వంతులు దాకా ఈ మట్టితో నింపాలి. బాణాసంచాలోకి మందు అమర్చినప్పుడు అది పడిపోకుండా ఈ మట్టి అపుతుందన్న మాట.

ఆ తరువాత టపాకాయ రెండవవైపు సబ్బు నురగ గానీ, నూనె గానీ పూసి, సమంగా వుండేలా చెయ్యాలి. ఇప్పుడు దబ్బనంతో టపాకాయ ద్వారాన్ని పొడవాలి. ఆ పని సులభంగా జరగ డానికే ఈ విధంగా సబ్బునురగ గానీ నూనెగానీ పుయ్యడమన్న మాట.

ఇక మిగిలిందల్లా ముందుగా చేసివుంచుకున్న వత్తిని రెండు అంగుళాల ముక్కల చొప్పున కత్తిరించుకుని ఈ టపాకాయల ద్వారాలలోకి కూర్చడం. ఇలా చేయడాన్నే 'ఫ్యూజ్ ఫిక్సింగ్' అని అంటారు.

ఇప్పుడు టపాకాయలు చేయడం దాదాపు పూర్తి అయినట్లే. వీటిని ఎండలో పెట్టిన తరువాత కలసివున్న వాటిని కాస్తా వేటికవే విడగొడతారు. అలా విడగొడుతున్నప్పుడు వీటికి అంటుకున్న మట్టి పూర్తిగా పోయేలా చెయ్యాలి.

ఆ తరువాత వీటిని–దారానికి పువ్వులు గుచ్చి దండ చేసినట్లు దారాలకు గుచ్చి సరాలుగా చేస్తారు. పది సరాలను ఒక ప్యాకెట్టుగా చేసి అమ్ముతారు.

అయితే యిలా తయారు చేయడంలో వివిధ రకాల బాణా సంచాకి వాటికి తగ్గట్టుగా రకరకాల మందులను వేర్వేరు పాళ్ళలో కలుపుతూ వుంటారు.

ఉదాహరణకి–కాకరపువ్వొత్తులు చేయడానికి బేరియం నైట్రేటు, జిగురు, ఇనుప రజం కలుపుతారు–రంగులు రావడానికి అల్యూమినియం పొడి కలుపుతారు.

చిచ్చు బుడ్లలో మూడు వంతుల దాకా బంక మన్ను, బూడిద కలిపి వెనుకవైపున దట్టిస్తారు. మిగిలిన ఒక వంతు భాగంలో మందు వుంటుం దన్న మాట. సోడియం లవణం పసుపురంగుని, స్ట్రోనిటం లవణం ఎరుపురంగుని, బేరియం-పచ్చ రంగుని, కాపర్–నీలి రంగునీ యిస్తాయి. విష్ణు చక్రాలలోనూ, చిచ్చు బుడ్లలోనూ ఈ రసాయనిక పదార్థాలు వుపయోగించడంవల్లనే మనకు అన్ని రంగులు కనిపిస్తున్నాయి.

ఇక ప్రేలుడు టపాకాయలకు ముడి పదార్థం 'గన్‌పౌడర్'. ఈ గన్‌పౌడర్ తయారు చేసుకోవడానికి కావలసిన వస్తువులు–గంధకం,



బొగ్గుపొడి, పొటాషియం నైట్రేట్.

ఇటువంటి పరిశ్రమలలో ఒక్కొక్క పని చెయ్యడానికి ఒక్కొక్క గది వుంటుంది. ప్రతి గదికీ నాలుగు ద్వారాలు వుంటాయి. నలుగురికి మించి ఒక గదిలో ఎక్కువ మంది పని చేయ కూడదు. అది ప్రతి ఒక్కరూ తప్పకుండా పాటించాల్సిన నియమం. ఒక గది నుంచి మరో గదికి మధ్య కనీసం ఐదు గజాల దూరం వుండాలి. అలాగే ప్రతి నాలుగు గదులకీ మధ్య యిసుకతో నింపిన బక్కెట్లు వుంటాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గదులు విడివిడిగా అగ్గిపెట్టెల్లా వుంటాయి. ప్రమాదాలను నిరోధించడానికే ఈ విధంగా గదులను నిర్మించడం జరుగుతుందన్న మాట.

ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఒక్కోసారి ప్రమాదాలు జరుగుతూనే వుంటాయి. ఉదాహరణకి చిన్నపిల్లలు, బొమ్మ తుపాకీలలో పెట్టి కాల్చే 'కేప్'లు తయారు చేసిన తరువాత వాటికి ఎలాటి వత్తిడి కలగకుండా జాగ్రత్తపడాలి. వాటికి ఏమాత్రం వత్తిడి కలిగినా ఒక్కసారిగా ప్రేలి ప్రమాదానికి దారి తీస్తాయి. అలాగే గొట్టాలలో మందును కూరడానికి చిన్న సుత్తిని వుపయోగిస్తారు. గొట్టాలలో మందును కూరి, చిన్న మేకును దానిపై పెట్టి సుత్తితో కొడతారన్న మాట. అటువంటప్పుడు వత్తిడి ఎక్కువైతే, ప్రమాదమే.

అంతేకాదు. ఈ గదులలోకి యినుప మేకులు గల చెప్పులతో కూడా ఎవరినీ ప్రవేశించనివ్వరు. అలాగే యిక్కడి పనులన్నీ కూడా చేతితో చెయ్యాల్సిందే కాని విద్యుచ్ఛక్తి వుపయోగించ కూడదు. ఎక్కడైనా కరెంట్ వైర్ కనబడితే చాలు వెంటనే లైసెన్స్ రద్దు చెయ్యబడుతుంది.

"శివకాశిలో యిటువంటి పరిశ్రమలు నూట ఏభై దాకా వున్నాయి. మా స్టాండర్డ్ ఫైర్ వర్క్స్‌లోనే దాదాపు నలభైమంది స్త్రీలు పనిచేస్తున్నారు. బాణా సంచాకు కావలసిన సరంజామాను, ముడిసరుకులతో మందు – వీరే తయారు చేస్తారు. రంగు కాగితాలు చుట్టడం, దారాలు పేనడం వంటివి కూడా స్త్రీలే చేస్తారు. మందులను వివిధ పాళ్ళలో కలపడం, ప్యాక్ చెయ్యడం మాత్రమే పురుషుల పని. అందుకే ఈ బాణా సంచా పరిశ్రమలో సాధారణంగా తొంభై శాతం శ్రమించేది స్త్రీలే." అని చెప్పారు మల్లికా రాజాకృష్ణ. ఇటువంటి పరిశ్రమలలో



'కాంతిజల్లులు' ఫోటో: ఎ. పద్మావతి

పేరు పొందిన సంస్థలలో వారిది ఒకటి.

శివకాశిలోని నూటయాభై చిన్న, పెద్ద పరిశ్రమల లోని ప్రేలుడు పదార్థాలు భద్రపరచేందుకు అరవై దాకా ప్రత్యేకించి జాగ్రత్తలు తీసుకుని నిర్మించిన గదులు వున్నాయి. వీటిలో ఏక సమయంలో రెండువేల పౌన్ల నుండి లక్ష యాభై వేల పౌన్ల దాకా ప్రేలుడు పదార్థాలను భద్రపరచవచ్చును. ఈ పరిశ్రమకి పెట్టుబడి ఇరవై అయిదువేల రూపాయల నుండి ఇరవై ఐదు లక్షలదాకా వుంటుంది.



సాధారణంగా యిక్కడ పనిచేసే వారు రోజు వారి కూలపైనే పనిచేస్తూ వుంటారు. వీరి సంపాదన రోజుకి నాలుగు రూపాయల నుంచి ఎనిమిది రూపాయలవరకూ వుంటుంది. శివకాశికి చుట్టు పక్కలగల గ్రామాల నుంచి వీళ్ళు వస్తూ వుంటారు. ప్రేలుడు వస్తువులు తయారుచేసే పరిశ్రమలు కావడంతో యివి వూరికి అయిదారు మైళ్ళ దూరంలో వుంటాయి. ఒకవేళ యిక్కడ పనిచేస్తూ వుండగా ఎవరైనా ప్రమాదానికి గురి ఐతే వారికి తగిన నష్ట పరిహారం చెల్లింప బడుతుంది.

వీటిలో చిన్న తరహా పరిశ్రమలు సాధారణంగా సంవత్సరానికి ఎనిమిది నెలలు పని చేస్తాయి. ఇవి ఒక్కొక్కటి సంవత్సరానికి





దాదాపు ఐదు లక్షల రూపాయల విలువచేసే బాణాసంచా వుత్పత్తి చేస్తాయి. మధ్యస్తంగా వుండే ఫ్యాక్టరీలు ఇరవై లక్షల రూపాయల దాకానూ, భారీ పరిశ్రమలు ఒకొక్కటి కోటి రూపాయల విలువ దాకానూ బాణాసంచా వుత్పత్తి చేస్తున్నాయి. ఇటువంటి భారీ పరిశ్రమలు శివకాశిలో మూడో నాలుగో వున్నాయి. మొత్తం మీద యిక్కడి పరిశ్రమలు ఏటా పదికోట్ల రూపాయల విలువచేసే బాణాసంచా వుత్పత్తి చేస్తున్నాయి.



"ఈ పరిశ్రమకు కావలసిన ముడి పదార్థాలను భారతదేశంలోని వివిధ ప్రాంతాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాము. అయితే ప్రభుత్వ సహాయం మాత్రం ఏమీ లభ్యం కావడం లేదు. కారణం ప్రభుత్వం వారు బాణాసంచాని 'విలాస వస్తువు'గా పరిగణించడమే" అన్నారు మల్లిక.



వీరి ఫ్యాక్టరీలోనే దాదాపు రెండువందల ఏభై రకాల బాణాసంచా తయారవుతున్నది. అయితే అన్ని రకాలూ ఎప్పుడూ చేస్తూ వుండరు. అవసరాన్నిబట్టి, వాటికిగల డిమాండ్‌నుబట్టి తయారు చేస్తూ వుంటారు. సీమ టపాకాయలలో ఒక్కొక్క సరంలో ఇరవై నుండి, అయిదువేల దాకా దండలుగా గుచ్చి సరఫరా చేస్తున్నారు!

మూడువందల రోజులపాటు శ్రమించి చేసే ఈ బాణాసంచా పండుగ రోజులలో మూడు గంటల కాలంలో అగ్నికి ఆహుతి అయి పోగగా





మారిపోతున్నది।

"అసలు ఈ బాణాసంచా మొట్టమొదట చైనాలో ప్రారంభమయింది. ఐతే అధిక ప్రాచుర్యం పొందినది మాత్రం మనదేశంలోనే. తూర్పు దేశాలతో జరిపిన వ్యాపారంవల్ల ఇటాలియన్లు బాణాసంచా గురించి తెలుసుకుని యూరోపు దేశాలలో ప్రవేశపెట్టారు." అన్నారు బాణాసంచా పుట్టు పూర్వోత్తరాల గురించి చెబుతూ మల్లిక.

ప్రస్తుతం మనదేశం నుండి అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా, కెనడా, బ్రెజిల్ మొదలైన దేశాలకు ఈ బాణాసంచా ఎగుమతి చేయబడుతున్నది. అలా ఎగుమతి చేస్తున్న సంస్థలలో స్టాండర్డ్ ఫైర్ వర్క్స్ కూడా ప్రముఖ స్థానం వహిస్తున్నది.

"ఆ మధ్య అమెరికా దేశం జరుపుకున్న ద్వితీయ శత జయంతి వేడుకలకు మనదేశం నుండి అధిక సంఖ్యలో బాణాసంచా సరఫరా చేసిన ఘనత మాకు దక్కింది" అని చెప్పారు శ్రీమతి మల్లిక రాజాక్రిష్ణ.

మన దేశం నుండి ఏటా దాదాపు రెండు కోట్ల రూపాయల విలువగల బాణాసంచా ఎగుమతి అవుతోంది. అయితే చైనావంటి యితర దేశాలతో పోల్చి చూస్తే మన ఎగుమతులు అతి స్వల్పం. అందుకు కారణం మన దేశంలో తయారవుతున్న బాణాసంచా నాణ్యత కొరవడడం కాదు. ఇతర దేశాలలో ప్రభుత్వ ప్రోత్సాహం ఈ పరిశ్రమలకి అధికంగా లభిస్తోంది. మన దేశంలో ప్రభుత్వ సహాయం వీటికి ఏమాత్రం లభించకపోగా 'విలాస వస్తువు'గా పరిగణింపబడడంతో పన్నులు కూడా నానాటికీ అధికమవుతున్నాయి. దాంతోబాటు వీటి ధరలు కూడా ప్రతి సంవత్సరం పెరుగుతూనే వున్నాయి. ఇలా ధరలు పెరగడంతో మన దేశంలోనే ఆదరణ కొరవడుతున్న వీటికి అంతర్జాతీయ స్థాయిలో జరిగే పోటీలో ఆదరణ ఏవిధంగా లభ్యమవుతుంది?



"ఇక్కడి బాణాసంచా పరిశ్రమ మీద ఎన్నో యితర పరిశ్రమలు ఆధారపడి వున్నాయి. ఇవి కాగితపు పరిశ్రమ, వుక్కు తీగలు, రసాయనిక పదార్థాలు, ముద్రణ, ప్యాకింగ్ మొదలైన పరిశ్రమలు. వీటిలో ఇరవై వేల మందికి ప్రత్యక్షంగానూ, మరో పదివేల మందికి పరోక్షంగానూ వుపాధి కల్పించబడుతోంది.

ప్రాచీన కాలం నుంచి మన దేశంలో వున్న పరిశ్రమ–బాణాసంచా పరిశ్రమ. ఆనాటి వైభవంతిరిగిపొందాలంటే అంతర్జాతీయరంగంలో కూడా మనం ముందంజవేయాలి. అందుకు తగ్గ ఆర్థిక వనరులన్నూ, పరిస్థితులను ప్రభుత్వం కల్పించాలి. ఇందువల్ల ఎందరికో వుపాధి కల్పించినట్లవుతుంది. అంతేకాదు. అప్పుడు ఈ 'విలాస వస్తువు' కూడా అత్యంత విలువైన విదేశీ మారక ద్రవ్యాన్ని విరివిగా ఆర్జించి పెడుతుంది" అన్నారు మల్లిక. □

సశేష నవల




విమలారామం

ఎంత పిచ్చిపని తలపెట్టావ్? దేవుడు జీవితాన్నిచ్చింది అనుభవించటానికి కాని అంతం చేసుకోటానికా!''

అతను తలదించుకున్నాడు.

''ఇంట్లో ఎవరూ ఉన్నట్టులేదు....'' అంది ఆమె చుట్టూ చూస్తూ.

''లేరు. మా మేనమామగారమ్మాయి పెళ్ళి ఇవేళ. అంతా వెళ్ళారు....'' అని ఓక్షణం ఆగి అన్నాడు. ''....ఒకప్పుడా అమ్మాయిని నాకే యిచ్చి చేద్దామనుకున్నారు. ....లోకంలో ఎవరికీ పనికిరానివాడ్ని. ఆ అమ్మాయికి మాత్రం పనికి వస్తానా!....''

''అలాగని ఎవ్వరూ లేకుండా చూసి యింత ఘోరాన్ని తలపెట్టావా? మైగాడ్!....నేను తలుపు కొట్టబట్టి సరిపోయింది. లేకపోతే?....''

''ఇదేం నాకు మొదటిసారి కాదులే! ఓసారి కాలవలో దూకితే కాలుజారి పడ్డాననుకుని ఎవరో ఒడ్డు కీడ్చుకొచ్చారు. నిద్ర మాత్రలు మింగితే డాక్టరు చావనిచ్చాడు కాదు. ఇవేళ యిలా గయింది....ఈ వెధవ ప్రాణం అంతత్వరగా పోతుందా!''

''ఛ! ఏం మాటలవి శ్యాం! బ్రతికుంటే నువ్వెంత మంచివాడివో ఆచరణలో పెట్టి చూపించగలవు కాని ప్రాణం తీసుకొని ఏం సాధించగలవు?....అసలు నువ్వేదో గొప్పపని చేయవల్సి వుంది కనుకనే నీ ఆత్మహత్యా ప్రయత్నాలన్నీ యిలా ఫెయిల్ అయ్యాయి!''

అతను విషాదంగా నవ్వాడు. ''నన్ను ఆకాశానికెత్తేస్తున్నావు నిర్మలా! కనీసం ఇప్పుడు నేల మీద కూడా లేను....పాతాళానికి క్రుంగి పోయున్నాను.''

''మనమెలా ఆలోచిస్తే మనమాస్థితిలో ఉన్నట్టే అనిపిస్తుంది.''

ఆమెవైపు చిత్రంగా చూసాడతను.

''మొదట్లో నీకంటె పెసిమిస్టిక్‌గా ఆలోచించే దాన్ని నేను. మంచివాళ్ళకి మంచితనానికి ఈలోకంలో చోటులేదని ఉడుకుమోతు తనంగా ఉండేది. కాని, ఓర్పుగా ప్రయత్నిస్తే ఏదో ఒకనాటికి మనకి – మనపనికి కూడ గుర్తింపు దొరుకుతుందని తెల్సుకున్నాను. ఈ లోకంలో చెడ్డవాళ్ళే కాదు. మంచివాళ్ళు కూడా ఉన్నారు. లేకపోతే, ఈ లోకం ఎప్పుడో అంతమై పోయుండేది. నా సంగతే చూడు. కొన్ని నెలల క్రితం పార్టు టైమ్ టైపిస్టు పనికి చేరాను. శ్రమ యెక్కువ, ఫలితం తక్కువ అని మొదట్లో అనిపించేది. కాని, శ్రమ అనేది కేవలం డబ్బుతోనే కొలవ కూడదని తర్వాత తెల్సి వచ్చింది. అప్పటి శ్రమకి ఇప్పుడు ఫలితం దక్కింది. మంచి ఉద్యోగం దొరికింది....''

శ్యాంసుందర్ ఆమె ఉద్యోగ వివరాలు అడిగాడు. ఆమె చెప్పింది.

''నువ్విప్పుడు ఏం చేస్తున్నావు?''

అతను చిన్నగా నవ్వాడు. ''ఒక మంచి మనిషి మాట కెంత శక్తి వుందా అని ఆశ్చర్య పోతున్నాను.''

''అదిసరే,....ఉద్యోగం....''

''ఏమీలేదు. ఖాళీ....ఎవ్వరూ నా ముఖం చూసి యివ్వటం లేదు.''

''నీకు టైపు వచ్చా!''

''ఆఁ! నొసటివ్రాత బాగాలేదు కాని.... సర్టిఫికెట్లకి లోటులేదు.''

''నువ్విష్టపడితే పార్టుటైం టైపిస్టు పని నేనిప్పించగలను.''

అతను కళ్ళప్పగించి చూసాడు.

''అదే. షణ్ముగరావుగారి దగ్గర. ఆయన మంచివారు.... రెగ్యులర్ జాబ్ దొరికే వరకు అక్కడ చేయచ్చు. చిన్న పని అని చూసుకోకుండా ఉంటే...''

''ఇంతవరకు నాకింత మాత్రం పని కూడా యిప్పించే వాళ్ళు లేకపోయారు నిర్మలా!'' అన్నాడతను ఉద్వేగ స్వరంతో.

''రేపు సాయంత్రం అక్కడికిరా! నేనాయనతో చెపుతాను.''

శ్యాంసుందర్ కళ్ళు చెమర్చాయి. ''దేవతలు హఠాత్తుగా ప్రత్యక్షమవుతారంటారు! అది నిజమేనేమో!....నన్ను చావు నుంచి తప్పించటమే కాదు....ఉద్యోగం కూడా చూపిస్తానంటున్నావు. నీ ఋణం ఎలా తీర్చుకోగలను!....''

నిర్మల గలగల నవ్వింది. ''బలేవాడివి. నేను చీకటి భయంతో తలుపు తట్టానుకాని.... అసలిది మీ యిల్లని కూడా నాకు తెలియదు.''

''నేను మాటవరసకనటంలేదు నిర్మలా! నిజం! ఒకప్పుడు నీ మీద అత్యాచారం చేసాను. అయినా అదంతా మనసులో పెట్టుకోకుండ ఇంత సహాయం చేస్తున్నావు. నిజంగా నువ్వు మామూలు మనిషివి కావు.''

ఆమె యిబ్బందిగా చూసింది. ''మనమే దృష్టితో చూస్తే అలాగే కనిపిస్తారు మనుషులు.... సరే, గతాన్ని మర్చిపో. క్రొత్త జీవితం ప్రారంభించు. ఆప్టిమిస్టిక్‌గా ఆలోచించు. నీకు ముందున్నదంతా ఆనందంగానే కనిపిస్తుంది.''

అతనామెవైపు ఆరాధనగా చూసాడు.

''బయట వర్షం తగ్గినట్టుంది. ఇక వెళ్ళొస్తాను.''

''అయ్యో, తడి బట్టల్లో నానిపోయావని యింతసేపూ గుర్తించానే కాదు.'' అని అతను నొచ్చుకున్నాడు.

''ఫర్వాలేదు. సగం ఆరిపోయాయి.'' అని కదిలింది ఆమె.

''నేను వచ్చి మీ యింటిదాకా దిగపెడతానుండు....''

ఆమె చిన్నగా నవ్వింది. ''అలాగే! ముందీ తాడు విప్పి ఎక్కడేనా పెట్టేసి రా!''

అతను సిగ్గుగా నవ్వాడు.

రోడ్డు మీదకి వచ్చాక 'జీవితం ఎంత చిత్రమైంది! సంఘటన చాలా చిన్నదే అయినా.... దాని ప్రభావం ఒక్కొక్కరి జీవితాన్ని చిత్రమైన

మలుపుకి తిప్పుతుంది కదా!' అనుకుంది నిర్మల. ఆ పూట వర్షం కురవటంవల్ల ఎంతో మేలు జరిగిందనిపించింది ఆమెకు!

## 36

శ్యాం సుందర్ షణ్ముఖరావు దగ్గర పనిలో చేరాక నిర్మలకి సాయింత్రంవేళ శ్రమపడవల్సిన అవసరం లేకపోయింది. అయితే, అడపా తడపా తన ఆఫీసులో ఎక్కువసేపు పని చెయ్యవల్సి వచ్చేది. ఒక్కోసారి శలవు రోజున కూడ వెళ్ళవల్సి వచ్చేది.

అయినా ఆ పనికి త్వరలోనే అలవాటు పడిపోయింది ఆమె.

ఆవేళ నిర్మల త్వరగా యింటికి వచ్చేసరికి ఆశ్చర్యపోయింది కృష్ణవేణి.

"మా ప్రొప్రయిటరుగారు హైద్రాబాదు వెడుతున్నారు. పనేం లేదని పర్మిషను తీసుకొని వచ్చేసాను." అని నవ్వి దగ్గరగావచ్చి కూర్చుంది నిర్మల.

కృష్ణవేణి పైకి లేవబోతే ఆమె చెయ్యి పట్టుకొని ఆపింది నిర్మల. "దేనికి? మంచినీళ్ళకా? నేనేం బయట కష్టపడిపోయి రాలేదు. కావాలంటే నేను వెళ్ళి త్రాగగలను కాని....కానేపలా కూర్చో!"

తన హేండ్‌బ్యాగ్ తెరిచి ఆమె దోసెట్లో పది పదినోట్లు పెట్టింది నిర్మల.

"ఎక్కడిదీ డబ్బు! వారం రోజుల క్రితమేగా జీతం తెచ్చిచ్చావు?"



"ఇది ఓవర్టయిము....అవసరం వచ్చినప్పుడు అదగ్గానే కూర్చుని పనిచేస్తే అడక్కుండానే మా ప్రొప్రయిటరు ఇచ్చారు."

"నిన్ను చూస్తుంటే నాకూ ఉద్యోగం చేయాలనిపిస్తోంది!...." అని కృష్ణవేణి నవ్వింది.

"ఇప్పుడు నువ్వు చేస్తున్నది మామూలు ఉద్యోగం కాదు వదినా! ఆ మధ్య యింటి యిల్లాలి శ్రమకెంత జీతం యివ్వచ్చును–అని అమెరికాలో లెక్క కట్టారుట! సరాసరిని రెండువేల రూపాయల జీతానికి తగ్గదని చెప్పిందిట కంప్యూటరు! అందు చేత....మేమంతా కల్పినికిస్తున్న జీతం చాలా తక్కువ! కనుక, నువ్వూ యికనుంచి ఓవర్టయిము డిమాండ్ చెయ్యి...."

కృష్ణవేణి గలగల నవ్వింది.

"సరే, ఈ డబ్బేం చేస్తావు!"

ఇన్నాళ్ళుగా నిర్మల జీతం తెచ్చిస్తోంది. ఎప్పుడూ – దేనికి ఖర్చు పెడుతున్నావని ఆమె అడగలేదు. అడుగుతుందని కృష్ణవేణి అనుకోనూ లేదు. కాని, ఇప్పుడిలా ఆమె అడిగేసరికి క్షణం పాటు నిర్ఘాంతపోయింది. కంగారుగా నవ్వు తెచ్చుకుంటూ "ఏం చేయమంటావు? నువ్వేం చెపితే అది చేస్తాను!" అంది.

ఈమాటు కంగారు పడడం నిర్మలవంతయింది. "అబ్బే. నా ఉద్దేశ్యం అది కాదు వదినా!.... మామూలు డబ్బుతో కలిపేస్తే ఇంట్లో దేనికో ఒకదానికి ఖర్చయిపోతుందని.... విడిగా దాచి వుంచితే...." ఆ పైన మాటలు రాక ఆగిపోయింది.

"ఓసారిటు రా!" అంటూ ఆమె చేయి పట్టుకొని లోపలి గదిలోకి నడిచింది కృష్ణవేణి. పందిరి మంచం మీద పరుపెత్తి పట్టెడ తాళ్ళ లోపల నుంచి ఓ కాగితం పొట్లం బయటకి తీసింది. దాన్ని విప్పి చుట్ట చుట్టిన నోట్లు నిర్మల కందిస్తూ...."చూడు మొత్తం ఎంతుందో!" అంది.

నిర్మల ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటిది? ఎక్కడిదీ డబ్బు!"

"లెక్క పెట్టు – చెపుతాను."

"ఉహుఁ! ముందు చెప్పు!"

కృష్ణవేణి చిన్నగా నవ్వింది. "నాకెక్కడ్నించి వస్తుంది? మీ అన్నయ్య ఇవ్వాలి. మీ వదినివ్వాలి. లేకపోతే నువ్వివ్వాలి!...."

నిర్మల ముఖం చిన్నబోయింది. "అయితే, నన్ను లెక్కపెట్టమంటావెందుకు?"

"ప్రతి నెలా నువ్విస్తున్న జీతంలోంచి కొంత తీసి జాగ్రత్త పెట్టాను.... నీకు.... నీకేదయినా చేయిద్దామని!"

నిర్మల ముఖం ఎర్రగా కందిపోయింది. "బావుంది. నాకెందుకు? ఉన్నవి చాలకనా!"

"ఏమున్నాయి?....ఈ చేతులకి మట్టిగాజులు తప్ప ఏమున్నాయి?" అంది కృష్ణవేణి ఆమె చేతిని పట్టుకుంటూ.

"అయితే, నీ చేతులకున్న బంగారు గాజులేవో చూపించు చూస్తాను!"

కృష్ణవేణి పేలవంగా నవ్వింది. "ఇంట్లో ఉండేదాన్ని నాకెందుకు? బయిటకు వెళ్ళి ఉద్యోగం చేసుకునే పిల్లవి నీకుండాలి కాని."

"నేను విడిగా వుంచమన్నది నాకేవో నగలు చేయించి పెట్టమని కాదు!...."

"ఛ! నువ్వు చేయించి పెట్టమన్నావనా? నేనే దాచి పెట్టాను. నువ్వలా అనేసరికి పోన్లే ముందే నీతో చెప్పితే తప్పేముందని బయిటకు తీశాను. నువ్వీవేళ తెచ్చింది కూడా వేస్తే ఏదో ఒక వస్తువు రాకపోదు. నిన్నడిగి నేనేది కావలిస్తే అదే చేయించవచ్చని...."

"నాకేమీ వద్దు!" అంది నిర్మల తల దించుకుంటూ.

కృష్ణవేణి ఆమె చుబుకం క్రింద వ్రేలుపెట్టి తల పైకెత్తింది.

నిర్మల కళ్ళు చెమరుతున్నాయి. ముక్కుపుటాలదురుతున్నాయి.

కృష్ణవేణి నిర్ఘాంతపోయింది. "నిర్మలా! ఏమిటిది? నేనిప్పుడేమన్నాను?"

నిర్మల మాట్లాడలేదు. ఆమె కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి.

"నిర్మలా!"

"ఇంతప్పట్నించి అమ్మకంటె ఎక్కువగా సాకి ఆదరించావే! నీ కష్టంలో కొంతేనా పాలు పంచుకుంటే నా ఋణం కొంతయినా తీర్చుకున్నట్టవుతుందని ఈ పని చేస్తున్నాను. అంతే కాని....నాకేదో నగలు చేయించుకుందామని కాదు వదినా!"

"నన్ను అపార్థం చేసుకోకమ్మా!"

"నిన్ను నేనపార్థం చేసుకోవటం లేదు వదినా! నువ్వే నన్ను తప్పుగా అర్థం చేసుకున్నావు. ఏదో ఒక నాటికి నేను సంపాదించిందంతా ఏం చేశావని అడుగుతానని.... ముందే జాగ్రత్తపడ్డావు .... ఇందాకా మాట వరసకి ఈ డబ్బేం చేస్తావని అడిగేసరికి ఇదిగో నీ డబ్బంటూ...."

"అయ్యో! అంతమాటనకమ్మా! నిన్నింత హీనంగా అంచనా వేస్తానని ఎలా అనుకుంటున్నావు!" కృష్ణవేణి కంఠం బొంగురుపోయింది.

"మరి....మరి ఇదంతా ఎందుకు జాగ్రత్త చేసినట్టు? నీ కడుపు కాల్చుకుని పైసపైసా కూడబెట్టి నాకు బంగారం తొడుగు తొడిగితే నేను సంతోషిస్తాననుకున్నావా?"

"లేదు. ఇప్పుడు మన ఇంటి పరిస్థితులు నువ్వు భయపడేంత కష్టంగా ఏమీ లేవు!.... నిజంగా ఏ అవసరం రాక నేనీ డబ్బు ముట్టుకోలేదు. నా మాట నమ్మూ!" అంది కృష్ణవేణి ప్రాధేయ పూర్వకంగా.

ఓ క్షణం పాటు ఆమె వైపు పరీక్షగా చూసి కళ్ళొత్తుకుంది నిర్మల.

"కూతురికి ఏదో ఒకటి చేయించాలని ఏ తల్లికుండదు! నాకు సుబ్బులెంతో నువ్వూ అంతే!"

నిర్మల అవాక్కయిపోయింది.

కృష్ణవేణి డబ్బు లెక్కపెట్టింది. "చూశావా! చూస్తుండగానే ఎంత పోగయిందో! నీది కనిపించని సంపాదన!"

"పోనీ, మరికొన్నాళ్ళాగు. ఓ బస్తా నిండుతుందేమో! అప్పుడిన్ని నగలు నాకు దిగేద్దుగాని!"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మీ అమ్మగారితో ఈ సంగతి చెపుదాము రా! నీ దుద్దులు పోయినప్పట్నించి పాపం ఆవిడ ఒకటే ఇదవుతున్నారు."

"ఉహుఁ! ఇప్పుడొద్దు వదినా! తర్వాత మరెప్పుడయినా చేయిద్దువుగాని .... ఈ డబ్బు యిన్నాళ్ళూ ఎక్కడ దాచావో అక్కడే పెట్టు. అవసరానికి పనికి వస్తుంది."

"అవసరాలెప్పుడూ వుండేవే! నా తృప్తి కోసం సరేనను!"

నిర్మల నవ్వులో విషాదం నిండి వుంది.

"తృప్తి! నీ కోరిక తీరటం నీకు తృప్తి. నా కోరిక తీరటం నాకు తృప్తి!"

కృష్ణవేణి చిత్రంగా చూసింది. "నీ కోరిక! ఏమిటి నీ కోరిక?"

"చెప్పనా!....నువ్వు సుఖంగా ఉండటం. సుఖమంటే ఏమిటో చెప్పనా! సుఖమంటే కంటి నిండా నిద్రపోవటం. ఆ నిద్ర ఎప్పుడు పడుతుందో అదీ చెప్పనా?....నీ మనసులో ఏ బాధలూ లేనప్పుడు....ఆ బాధలెప్పుడుండవో చెప్పనా?..."

కృష్ణవేణి ముఖం జేవురించింది. "ఊఁ? మాటలు నేర్చావు....అసలు నీకిదంతా ముందే చెప్పటం నా తప్పు."

"అది కాదు తప్పు....అన్నీ నువ్వే భరించాలనుకోవటం అసలు తప్పు....నీక్కోపం వచ్చినా సరే ఉన్న మాట చెపుతున్నా! నాకేం అలంకారాలు పెట్టుకోవాలని కోరికలు లేవు. అంతగా నీకు చేయించాలని వుంటే....సుబ్బికి జూకాలు చేయించు."

"నీ సలహా నాకక్కర్లేదు."

నిర్మలకి నవ్వొచ్చింది. "అరెరే! కెమేరా లేకపోయింది కాని, లేకపోతే ఈ పోజులో నీకో ఫోటో తీసి ఇంటర్నేషనల్ ఫోటో కాంపిటీషన్‌కి పంపిస్తే ఫస్టుప్రయిజు నాకే వచ్చుండేది వదినా!" అంటూ వదినగారి మెడచుట్టూ తన చేతులు ముడి వేస్తూ పకపక నవ్వింది నిర్మల.

## 37

ఈ మధ్య కృష్ణవేణి సమస్యలు కొన్ని తీరినట్లు కనిపిస్తున్నాయి కాని, చాలవరకు తీరనే లేదు. ఉన్న బాధలు కొన్ని తీరకపోగా లేని కొత్త బాధలు తోడుగా వచ్చిపడ్డాయి.

మాధవి అత్తవారింటికి వచ్చాక కొంత ఆర్థిక బాధ తగ్గింది. నిర్మలకి మంచి ఉద్యోగం వచ్చాక మరింత యిబ్బంది తగ్గింది. ఇప్పుడింట్లో తిండికి లోటులేదు. చాటుమాటుగా అడుగుబొడుగు మెతుకులు తినవసరం లేకుండా తను కూడా సలుగురెదుటా కూర్చుని చేసిన ఆధరవులు వేసుకు తినగల్గుతోంది. రోగిష్టి అత్తగారికే కాకుండా మామగారికి కూడా కొన్ని పళ్ళు కొని పెట్టగలుగుతోంది. పిల్లల పుస్తకాలకీ ఫీజులకీ వాయిదాలు వేయకుండా వెంటనే అమర్చగల్గుతోంది. ఇంటి మీద తెచ్చిన అప్పు ఇదివరలోలా కాకుండా విధి తప్పకుండా వాయిదాలలో తీర్చగలుగుతోంది.

మామగారి లాటరీటిక్కట్ల వ్యయం ఓ పెద్ద ఖర్చుగా కనిపించటం లేదు. చీటికీమాటికీ పుట్టింటికి వచ్చి డబ్బు కావాలని పీడించే పెద్దాడ పడుచు ఈ మధ్య రావటమే లేదు.

కాని, భర్త వ్యసనం వల్ల కల్గుతున్న బాధే ఆమెకు అన్నిటిపెట్టు అయిపోయింది. అతనిచ్చే జీతం అంతకంతకు తరిగిపోతూంది....అలాగే అతనికీ ఆమెకీ మధ్య దూరం పెరిగిపోతూంది.

ఈ మధ్య మరో క్రొత్త బాధ తోడయింది ఆమెకు. వందలకు వందలు తెచ్చి కిమ్మనకుండా, తన చేతుల్లో పోస్తున్నారు నిర్మలా మాధవిలు. తమ మనస్సుల్లో కూడా తన గురించి తప్పు పట్టని నిష్కల్మష హృదయులు. కష్టపడే ఆడపిల్లలకి ఒక్కటంటే ఒక్క వస్తువు చేయించలేకపోతోంది తాను! ఒక్క పట్టుచీర లాంటిది కొనలేకపోతోంది. నోరు తెరిచి అడక్కపోవటం వాళ్ళదా పాపం!

భర్తని మార్చలేకపోతున్నానే – అన్న బాధ ఒక మూల, అతని వ్యసనాగ్నిలో ఆడపిల్లల కష్టార్జితాన్ని ఆహుతి చేయల్సివస్తోందన్న వ్యథ మరో మూల, వాళ్ళకేమీ చేయించలేకపోతున్నాన్న అసంతృప్తి ఇంకోమూల, తనకూ కొన్ని బాధలంటూ ఉన్నాయని – ఉంటాయని భర్త గుర్తించకపోవటం – అదో బాధ, నలుమూలలా ఆమె గుండెల్ని పిండి పిప్పి చేస్తున్నాయి. మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయి.

ఎలాగో రహస్యంగా దాచివుంచిన డబ్బుతో నిర్మలకి దుద్దులు చేయిద్దామని తాననుకుంటే– వద్దుపొమ్మని ఆ రోజున మారాం చేసిందామె. ఆ తర్వాత నిర్మల అన్నట్టే అవసరాలేవో ముంచుకొచ్చాయి. ఆ డబ్బు మళ్ళీ తరిగిపోయింది. నిర్మల కోరికప్రకారం కనీసం, చంటిపిల్లకి జూకాలు చేయిద్దామన్నా అంత డబ్బు చేతిలో లేకుండాపోయింది.

ఏదో ఒక విధంగానయినా తృప్తి తీరకుండా ఆమె మనస్సులోని బాధ మరింత పెరగటమే జరిగింది. ఆమెకు రోజులు బరువుగానే గడుస్తున్నాయి!

ఇలా వుండగా హైద్రాబాదు నుంచి ఉత్తరాల మీద ఉత్తరాలు వ్రాసాడు రామచంద్రం–చెల్లెల్నీ, బావగార్నీ ఓసారి వచ్చి వెళ్ళమని.

రాఘవరావు రిటయిరయ్యే రోజు కొన్ని నెలల

మన ఊళ్ళల్లో ఈనాటికీ అక్కడక్కడ పూటకూళ్ళమ్మలు కనిపిస్తూ వుంటారు. వీరు ఎంతగానో అతిథి మర్యాదలు చేస్తూ రుచికరంగా భోజనాలు పెడుతూవుంటారు.

ఇటలీలో అంటోనిస్ మీరో అనే ఆమె అటువంటి కోవకే చెందిన భోజనశాల ఒకటి నడుపుతోంది. మీరో ఆతిథ్యానికి ముగ్ధులైన కొందరు విదేశీ యాత్రికులు – "మీ ఇంట్లోని వంటలాగే వుంటుంది—అని బోర్డు పెట్టండి, మీ వ్యాపారం ఇంకా అభివృద్ధి చెందుతుంది" అని సలహా యిచ్చారుట. మీరో వారి సలహా పాటించి ఆ బోర్డు పెట్టింది. కాని వారం తిరక్కుండానే ఆ బోర్డు కాస్తా తీసెయ్యాల్సి వచ్చింది. బోర్డు పెట్టిన తరువాత ఆమె వ్యాపారం పెరగడానికి బదులు తగ్గుముఖం పట్టింది.




దీనిక్కారణమేమిటీ — అంటే ఆ భోజనశాలను పోషించే వారిలో అధిక శాతం విడాకులు పుచ్చుకున్న మొగరాయుళ్ళేనట! వాళ్ళు ఆ బోర్డు చూడగానే లోపలకు రావడం మానేశారు. అందుకు కారణం–వాళ్ళంతా కూడా ఇంట్లో వంటకాలు మరీ 'ఛండాలం'గా వుంటున్నాయని విడాకులు పుచ్చుకున్నవాళ్ళేనట!

దూరం మాత్రం వుంది. పెన్షనుకి ఏర్పాట్లు చేసుకున్నట్టూ వుంటుంది – కొడుకు సంసారాన్ని చూసినట్టూ వుంటుందని హైద్రాబాదు బయలుదేరాడు. ఇక ఆయన కూడా రమ్మని బ్రతిమాలటంతో మురళికి ప్రయాణం కాక తప్పలేదు.

"....మేం వెడతాం కాని, నువ్వు కూడా ఓసారి మీవాళ్ళింటికి వెళ్ళిరా అక్కయ్యా!" అంది మాధవి.

"నేనామాట ఎప్పుడో చెప్పాను వదినా!" అని వంతపాడింది నిర్మల.

"అలాగే! నువ్వు తిరిగివచ్చాక చూద్దాంలే!" అంది కృష్ణవేణి.

"చూద్దామంటే కాదు. తప్పకుండా వెడతానని మాటిస్తేనే నేనిప్పుడు వెడతాను." అంది మాధవి చిన్న పిల్లలా మారాం చేస్తూ.

వాత్సల్యపూరితంగా 'చెల్లెల్ని' అక్కున చేర్చుకొని మాటిచ్చి పంపింది ఆమె.

కృష్ణవేణి ఎన్నాళ్ళుగానో ఎదురుచూసిన ఒక మంచి 'అవకాశం' వచ్చింది! మాధవీ మురళీ మోహన్‌లు అటు హైద్రాబాదు వెళ్ళాక ఓ రోజున మురళి కొలీగ్ ఒకతను ఇంటికి వచ్చి శుభ వార్తొకటి చెప్పాడు.

ఆ రాత్రి విశ్వనాథం ఇంటికి రాగానే పరమ సంతోషంతో "మురళికి ప్రమోషను వచ్చిందండీ!" అని చెప్పింది కృష్ణవేణి.

"అరే, సమయానికి వాడు వూళ్ళోలేడే! టెలిగ్రామ్ యిద్దామా!" విశ్వనాథం నిజంగానే ఆనందపడుతూ అన్నాడు.

"ఎందుకూ? ఎక్కడికి ట్రాన్సఫర్ అయిందో ఇప్పుడు అక్కడే ఉన్నాడతను."

విశ్వనాథం ఉలిక్కిపడ్డాడు. అతని ముఖం మీద నవ్వు మాయమైంది. 'ట్రాన్సఫరా?'

"అవును. ప్రమోషను వస్తే ట్రాన్సఫర్ అవుతుందని ఎప్పట్నించో అనుకుంటున్నాడు...."

విశ్వనాథం మాట్లాడలేదు. ముఖం ముడుచుకున్నాడు.

కృష్ణవేణి ఉత్తరం అందుకుని వెంటనే భార్యతోసహా తిరిగి వచ్చాడు మురళీమోహన్.... ట్రాన్స్‌ఫర్ అంటే తన వాళ్ళందరికి దూరంగా వెళ్ళిపోవాలి. మాధవి తన కూడా రావాలంటే ఇక్కడి ఉద్యోగం వదిలెయ్యాలి. మళ్ళీ కొత్త చోట వేరే ఉద్యోగం చూసుకోవాలి .... ఏదో జీతం పెరుగుతుందని ఇక్కడి బంధాలన్నీ తెంచుకు పోవటమా? .... అలాగని ఇక్కడే వుంటే ప్రమోషను పోతుంది. ఎలా? ఏం చేయాలి?

ఇలా తర్జన భర్జనపడుతూ వచ్చిన మురళికి బదిలీ మీదకి సుముఖుడ్ని చేద్దామని కృష్ణవేణి ప్రయత్నించే లోపల ఒక్క మాటలో విముఖుడ్ని చేశాడు విశ్వనాథం. "....ఈ పెద్ద వయసులో అమ్మనీ నాన్ననీ వదిలి దూరంగా వెళ్ళకురా మురళీ!....నేనొక్కడ్నీ ఉండలేను. నా కేమిటో అధైర్యంగా వుంటుంది!" అని.

ఈ మధ్య కాలంలో తనతో కుదురుగా కూర్చుని ఒక్క ముక్కయినా మాట్లాడని అన్నయ్య అంత ప్రాధేయపడుతూ మాట్లాడేసరికి మురళి మనసు కరిగిపోయింది. "అలాగే అన్నయ్యా! వెళ్ళనులే!" అన్నాడు.

"నాన్నగార్నీ, అమ్మగార్నీ చూడ్డానికి మేము లేమా? కావాలన్నప్పుడు వచ్చిపోతుండవచ్చు. నీ భవిష్యత్తు పాడుచేసుకోకు...." అంది కృష్ణవేణి కంగారుగా.

అన్నగారి మీద ఆప్యాయతతో గుండె నించుకున్న మురళికి ఆమె మాటల వెనుక గూడార్థం పట్టలేదు. "మరో ఛాన్సు ఎలాగా వస్తుంది వదినా! నీకు ఆ భయం లేదు...." అన్నాడు.

కృష్ణవేణి హతాశురాలై పోయింది .... మళ్ళీ యిలాంటి అవకాశం వచ్చేది ఎన్నటికో! అప్పటికి తన భర్త ఏ స్థితిలో వుంటాడో!

## 38

హైద్రాబాదు నుంచి తాను తిరిగివచ్చాక కృష్ణవేణిని పుట్టింటికోసారి వెళ్ళిరమ్మని పోరటం మొదలు పెట్టింది మాధవి.

ఇప్పుడు కాదప్పుడంటూ తన ప్రయాణానికి వాయిదా వేస్తోంది కృష్ణవేణి. ఇంతలో ఆమె తమ్ముడు శ్రీకాంత్ హఠాత్తుగా వచ్చాడొక రోజున. తనకు పెళ్ళిచూపులని – తలిదండ్రులు తీసుకురమ్మని పంపారని తప్పకుండా రమ్మని కోరాడు.

ఇన్నాళ్ళకి తన తమ్ముడు పెళ్ళికొప్పుకున్నందుకు ఎంతో సంతోషించిందామె. మాధవి ప్రోత్సహించటంతో తానూ తమ్ముడితో బయలుదేరి వెడదామని అనుకుంది.

ఆవేళ ఆదివారమయినా విశ్వనాథం ప్రొద్దున్నే భోజనం చేసి బయటకు వెళ్ళిపోయాడు. శలవు రోజులు వస్తే మరింత స్వేచ్ఛ అతనికి. రోజంతా ఆ క్లబ్బులోనే ఉంటాడు.

"రాత్రి బావగారు రాగానే....ఆయనతో చెప్పి రేప్రొద్దున్నే బయలుదేరుదామురా!" అంది కృష్ణవేణి తమ్ముడితో.

"అదేమిటి! రాత్రి దాకా రారా బావగారు? ఇవేళ శలవుకదా!...." అన్నాడు శ్రీకాంత్.

"ఏదో పనుందిట...." అని తలత్రిప్పుకొని వెళ్ళిపోయింది కృష్ణవేణి.

తనతోటి కాలేజీ లెక్చరరుకి పెళ్ళంటే మురళితో సహా వెళ్ళింది మాధవి. తాను రెండు మూడు రోజులు కాలేజీకి శలవుపెడతానని అక్కగార్ని ప్రయాణానికి సిద్ధంగా వుండమని చెప్పి మరీ వెళ్ళింది.

కాని, ఆవేళ మధ్యాహ్నం ఆ యింట్లో ఎవరూ ఎప్పుడూ ఊహించని ఉపద్రవం ముంచుకు వచ్చింది!

గుమ్మంలో నిలబడిన వ్యక్తిని ఎప్పుడో చూసాననిపించి ఎక్కడ చూసానా అని మనస్సులో తర్జనభర్జనపడుతూ "ఎవరు కావాలండీ?" అని అడిగింది నిర్మల.

ఆమెని ఎగాదిగా చూస్తూ "....సత్యనారాయణ గారున్నారా?" అని అడిగాడా వ్యక్తి.

"వున్నారు. లోపలికి రండి........" అని మర్యాదగా పిలిచి కుర్చీ చూపించి తండ్రిని పిలుద్దామని లోపలికి వెళ్ళింది నిర్మల.

సత్యనారాయణగారు నిద్రపోతున్నాడు. తండ్రిని లేపటానికి మనసొప్పలేదు నిర్మలకి. మళ్ళీ బయిటకి వచ్చి "నాన్నగారు నిద్రపోతున్నారు....ముఖ్యమయిన విషయమైతే మా వదినగారితో మాట్లాడవచ్చు...." అంది నిర్మల.

"ఆయనతోనే మాట్లాడాలి. అర్జంటుగా మాట్లాడాలి...." అన్నాడతను ఆమె చూపులు తప్పించుకుంటూ.

ఆ మాటలు లోపలినుంచి వింటున్న కృష్ణవేణి వాకిట్లోకి వచ్చింది. ఒళ్ళంతా చీర కప్పుకొని మంచినీళ్ళ గ్లాసుతో వచ్చిన ఆ మూర్తి వైపు ఒక్కసారి చూసాడా వ్యక్తి. అతను వెంటనే తల త్రిప్పుకున్నాడు కాని....ఆ లిప్తకాలంలోనే అతనెవరో గుర్తుపట్టి ఉలిక్కిపడింది కృష్ణవేణి.

వదినగారి ముఖంలో రంగులు మారటం గుర్తించి "ఈయనెవరో నాన్నతో మాట్లాడా లంటున్నారు." అంది నిర్మల.

అతి కష్టం మీద తన ఉద్వేగాన్ని అణచుకొని "....మంచినీళ్ళు త్రాగండి." అని అతనిముందు గ్లాసుపెట్టింది కృష్ణవేణి.

"వద్దు...." అన్నాడతను తలత్రిప్పి చూడకుండానే.

నిర్మలకి సంజ్ఞచేసి లోపలిగదిలోకి పిలిచింది కృష్ణవేణి.

"ఆయనెవరో గుర్తుపట్టలేదా నువ్వు?" అని అడిగింది.

తల అడ్డంగా త్రిప్పింది నిర్మల.

గోడమీద ఫోటో చూపిస్తూ "....మీ పెద్దన్నయ్య!" అంది కృష్ణవేణి వణికే కంఠంతో.

నిర్మలకి షాక్ తగిలినట్టయింది!

"ఇంత హఠాత్తుగా ఎందుకు వచ్చారో!" అంది కృష్ణవేణి తనలోతను అనుకుంటున్నట్టు.

అప్పటికి స్పృహలోకి వచ్చింది నిర్మల. "రావదినా! ఆ మహానుభావుడ్నే అడుగుదాం ఎందుకు వచ్చారో!...." అంది ఆవేశపడుతూ.

చటుక్కున ఆమె చేయి పట్టుకుంది కృష్ణవేణి. "నువ్వసలే తొందరపాటు మనిషివి. రాకరాక యిన్నాళ్ళకి వచ్చారు. నువ్వేమీ అనకు...." అంది బ్రతిమాలుతూ.

"ఏమీ అనసులే!....అంతటి గొప్పన్నయ్య ఎలా వుంటాడో మరోసారి కళ్ళారా చూడనీ!...."

కాఫీ కలిపి తెమ్మని నిర్మలతో చెప్పి తాను సుభద్రని తీసుకొని వాకిట్లోకి వచ్చింది కృష్ణవేణి.

ఆమె వైపోసారి చూసి తల త్రిప్పుకున్నాడతను.

"నేను....నేను ఈ యింటికి రెండవకోడలినండి. నా పేరు కృష్ణవేణి...."

ఆమె గొంతులోని మార్దవానికి అతను చకితుడయ్యాడు.

"మీరు వచ్చినందుకు నాకెంతో సంతోషంగా వుంది....అత్తగారు, మామగారు తరచు మీమాటే అంటూంటారు...."

అప్పటికీ అతనామెవైపు ధైర్యంగా చూడలేకపోయాడు.

"అక్కయ్యగార్ని కూడా తీసుకువస్తే బావుండేది...."

అతని ముఖం తెల్లగా పాలిపోయింది. ఇప్పుడిలా వచ్చినందుకు తననంతా తిట్టుకుంటారని అనుకుంటూ వచ్చిన మనిషికి ఎదురుచూడని 'స్వాగతం' లభించేసరికి అతనికి చిత్రమైన ఆఘాతం తగిలినట్టయింది.

"....మీ చిన్నతమ్ముడి పెళ్ళికి శుభలేఖ పంపించాము. మీరు వస్తారని యెంతగానో ఎదురుచూసాము....పోనీలెండి, పనివుండి రాలేకపోయారేమో – యిప్పుడు వచ్చారు. అందర్నీ చూడచ్చు...."

'అయ్యో – ఇలాంటి అమృతమూర్తి ఉండే



## భవిష్యత్తుకు స్వాగతం

జీవితం బంధనం
బాధల ఇంధనం
లేదు బ్రతుకులో మార్పు
దొరకలేదు బ్రతుక్కొక ఓదార్పు
అయినా తెచ్చుకుంటున్నాను ఓర్పు
ఏదో అదృశ్యశక్తి నేర్పు
బ్రతుకుబాట మీద నడిపిస్తోంది

పుట్టని భవిష్యత్తులోకి
పుట్టెడు ఆశతో చూస్తూ,
మధుర స్వప్నంలా
మలయానిలంలో
మధురానుభూతి కలిగిస్తూ
ఊహల్లో మెరిసి మురిపించే
ఆ అందాల భవిష్యత్తుకు
స్వాగతం చెప్పమంటోంది నన్ను

—పాటిబండ్ల విజయలక్ష్మి



చోటుకి దూరమయిన దౌర్భాగ్యుడ్నా నేను?' అన్నట్టు చూసాడతను. ఆ భావం ఒక్కక్షణమే! చటుక్కున తలత్రిప్పుకున్నాడు. మళ్ళీ మనసుని రాయిగా మార్చుకున్న మనిషిలా "....నేను త్వరగా వెళ్ళాలి....ఆయన్ని లేపండి." అన్నాడు.

కృష్ణవేణి మనస్సు చివుక్కు మంది. "అదేమిటి? అప్పుడే వెళ్ళిపోతానంటున్నారు? సాయంత్రానికి మీ తమ్ముళ్ళంతా యింటికి వస్తారు. అందర్నీ కళ్ళారా చూసుకొని మనసారా మాట్లాడి వెళ్ళండి...."

"నాకు టైములేదు. వెంటనే వెళ్ళాలి!" అన్నాడతను విసుగ్గా.

నిర్మల కాఫీ తయారు చేయటం పూర్తయింది. వంటింటి లోపల వున్నా వాళ్ళమాటలు ఆమెకు వినపడుతూనే వున్నాయి. వదినగారి మనసు మంచి ఎంతటిదో ఆమె మాట మార్దవమెటువంటిదో నిర్మలకి తెలియనిది కాదు. తనకు ఎనిమిదేళ్ళ వయస్సులో ఆయింటి కోడలుగా వచ్చిన ఆమె తనగుండెల్లో అమృత భాండం పెట్టుకుని వచ్చినట్టు వచ్చిందని నిర్మల తరచు అనుకుంటూంటుంది. ఇన్నాళ్ళూ పెద్దన్నయ్య లాంటి రాతిగుండె ఎవరికీ వుండదని తల్లి మాటలలో వినటం మాత్రమే–ఇప్పుడు స్వయంగా చూస్తోంది!

వదినగారి మాటలు గుర్తు పెట్టుకొని–ఆమె చూపులలోని అర్థానికి ఎంతో గౌరవముంచి తనకోపావేశాన్ని నిగ్రహించుకుని కాఫీ తీసుకొని వచ్చింది నిర్మల. 'తీసుకోండి' అంటూ అతని ముందుపెట్టి 'మీరేనా మా పెద్దన్నయ్య' అన్నట్టు అతని ముఖంలోకి సూటిగా చూసింది.

"మీ చిన్న చెల్లెలు నిర్మల...." అంది కృష్ణవేణి.

చురుక్కున గ్రుచ్చుకొనే చెల్లెలి చూపులకి తట్టుకోలేక తల త్రిప్పుకున్నాడు కృష్ణారావు. "నాకు టైమవుతోంది...." అన్నాడు వాచీ చూసుకుంటూ.

"ముందు కాఫీ త్రాగండి. మామగారు లేచే వేళవుతోంది" అంది కృష్ణవేణి.

"నాకు వద్దు...." అన్నాడు అతను.

నిర్మల కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది. "అంటే, అలవాటు లేదాండీ! లేక మా ఇంట్లో తాగకూడదా?...."

అతను చురుక్కున చూసి తల త్రిప్పుకున్నాడు.

"మా యింటికి ఎవరు వచ్చినా కాఫీ ఇవ్వటం మా కలవాటు....కాఫీ తాగకపోతే యేం తాగుతారో చెప్పండి...."

"ఏమీ వద్దు...."

"పోనీలే నిర్మలా! బలవంతం చేయకు..." అంది కృష్ణవేణి హెచ్చరిస్తూ.

అతను మరోసారి వాచీ చూసుకున్నాడు. "నేను వెంటనే వెళ్ళిపోవాలి. ఆయన్ని లేపండి...."

"ఈ యిల్లు మీది.... మేమంతా మీ వాళ్ళం. మీరు సంకోచించవల్సిన అవసరంలేదు. మీనాన్న గారి గదిలోకి మీరు నిరభ్యంతరంగా రావచ్చు.... రండి." అంటూ కృష్ణవేణి కదిలింది.

అతను కదల్లేదు. కదలటానికి శక్తిలేని వాడిలా అక్కడే బిగుసుకు పోయాడు. ఈలోగా నిర్మల వెళ్ళి తల్లిని తండ్రిని లేపి సంగతి చెప్పింది. కొన్ని క్షణాలపాటు వాళ్ళు స్థాణువులై పోయారు. వాళ్ళింకా కూతురి మాటలు కలలో వింటున్నామన్నట్టు కూర్చుండి పోయారు.

"ఇది కలకాదమ్మా! నిజం...." అంది నిర్మల ఉద్రిక్తస్వరంతో.

కృష్ణవేణి కూడా వచ్చి చెప్పేసరికి వాళ్ళకిక నమ్మక తప్పనట్టు నమ్మారు. సత్యనారాయణ గారే కాదు .... ఎలాగో ఓపిక తెచ్చుకుని సుభద్రమ్మ కూడా లేచి వచ్చింది.

ఇద్దరూ పెద్ద కొడుకుని కళ్ళారా చూసుకున్నారు. వాళ్ళ కళ్ళల్లోకి నీళ్ళు చింది వచ్చాయి. విడిపోయి ఒకటా రెండా – పదిహేనేళ్ళు దాటి పోయాయి!....

కృష్ణారావు వాళ్ళనోసారి చూసి తల దించుకున్నాడు.

"ఆ ముఖంలో ఇప్పుడు కళలేదు. చెంపలు పాలిపోయాయి. మనసు కూడా మారిపోయి వుంటుంది. తనలో ఎంతో బాధ పడుతూండి వుంటాడు. అందుకనే, అలా కృంగిపోయి వున్నాడు...." అనుకున్నారు తల్లిదండ్రులు.

కాని, వాళ్ళవన్నీ భ్రమలని మరు నిమిషమే తేలిపోయింది.

నిర్మల తెచ్చి వేసిన కుర్చీలో సుభద్రమ్మ కూర్చుందో లేదో.... కృష్ణవేణి వాల్చిన పడక కుర్చీలో సత్యనారాయణగారు వాలారో లేదో.... వారి జ్యేష్ఠ పుత్రుడు ఇన్నేళ్ళ తర్వాత తాను ఎందుకు వచ్చాడో ముచ్చటగా మూడు ముక్కల్లో చెప్పేశాడు.

ఏదో వ్యాపారం మొదలు పెడుతున్నాడుట. ఆ ఇంటి మీద తన వాటా భాగానికి వచ్చే డబ్బు లెక్కకట్టి ఇచ్చేయాలట. పది రోజుల్లో మళ్ళీ అతను వచ్చేటప్పటికి డబ్బు సిద్ధంగా ఉంచాలట!

అవి మాటలు కావు .... వాళ్ళ తలల మీద నిర్దాక్షిణ్యంగా కురిపించిన పిడుగులు. అమానుషంగా వాళ్ళ గుండెల్లో దింపిన గునపాలు! కొన్ని నిమిషాల దాకా ఎవళ్ళూ ఆ ఆఘాతం నుంచి తేరుకోలేకపోయారు.

కొడుకువైపు అసహ్యంగా చూసింది సుభద్రమ్మ. "ఇన్నాళ్ళకి కొంపకి వచ్చావంటే మనిషివి మారి వచ్చావనుకున్నాను–మా కొంప కూల్చటానికి వచ్చావా నాయినా!" అంది నుదురు కొట్టుకుంటూ.

"నేనేం మీకొంప కూల్చటానికి రాలేదు. నాకు రావల్సిన డబ్బు తీసుకుందామని వచ్చాను." అన్నాడు కృష్ణారావు.

"నీకు రావల్సిన డబ్బా? పెట్టవల్సినవి గుర్తులేవు కాని రావల్సినవి బాగా గుర్తుంచుకు వచ్చావా? కనిపెంచి పెద్దవాడ్ని చేస్తే నువ్వు మాకు చేస్తున్న నిర్వాకం యిదా! తెగతెంపులు చేసుకుపోయావనుకున్నాను .... పెట్టిన కోత చాలనుకున్నాను. చివరికి ప్రాణాల్లో కూడా వాటాలడిగి పట్టుకువెళ్ళే పుణ్యాత్ముడివని అనుకోలేక పోయానురా!" అంటూ తలమొత్తుకుని యేడువసాగింది ఆవిడ.

కందగడ్డలా వున్న మామగారి ముఖం చూసి భయపడింది కృష్ణవేణి. "వూర్కోండత్తయ్యా!" అంది కంగారుగా.

"ఇంకా వూర్కోనా తల్లీ! .... పుష్కరం క్రితం మీ పినమామగారు వచ్చి తన వాటా డబ్బివ్వమని ఇలాగే పీకల మీద కూర్చున్నాడు. అప్పుడు మీవాళ్ళిచ్చిన కట్నం డబ్బులిచ్చి నోర్మూసుకున్నావు. ఇప్పుడీ ప్రబుద్ధుడికి తన వాటా కావాలట. ఇప్పుడెక్కడ్నించి తెస్తావమ్మా!...."

"తాతలనాటి యింట్లో అందరికీ వాటా వుంటుంది. ఆయన వాటా ఆయన తీసుకున్నాడు. నావాటా నాకిమ్మంటున్నాను...." అన్నాడు కృష్ణారావు నిర్మోహమాటంగా.

నిర్మల కోపావేశాన్నిక ఆపుకోలేకపోయింది. "....ఇంత కటిక కసాయివాడ్ని ఎలా కన్నావమ్మా!...." అంది.

"....నేను వెళ్ళిపోయాక మీ యిష్టం వచ్చినన్ని తిట్లు తిట్టుకోండి. ముందు నాకిచ్చే డబ్బు విషయం తేల్చండి!" అన్నాడు కృష్ణారావు కటువుగా.

"నీకు....నీకు డబ్బు విషయం తేల్చాలట్రా! తేలుస్తానురా! ఇప్పుడే తేలుస్తాను...." అంటూ శివమెత్తిన వాడిలా కుర్చీలోంచి లేచారు సత్యనారాయణగారు.

ఆయన అంటున్నదేమిటో – చేయబోతున్నదేమిటో ఎవ్వరికి అర్థం కాలేదు. ఆయన చేతి కర్ర తీసుకొని విసిరిన దెబ్బ తగిలింది కృష్ణారావుకి కాదు. మెరుపులా ఇద్దరి మధ్యకీ అడ్డు వచ్చిన కృష్ణవేణికి!

ఆమె నుదురు చిట్లి చివ్వున రక్తం చిమ్మినప్పుడు కాని, ఎంత ఘోరం జరిగిందో ఎవ్వరూ గుర్తించలేదు. తన తల బ్రద్దలయిందేమోనని చేతులు అడ్డు పెట్టుకున్న కృష్ణారావు 'అమ్మా!' అని కేకపెట్టి నేలకొరిగిపోతున్న కృష్ణవేణిని చూసి నిర్ఘాంతపోయాడు.

"వదినా!" అంటూ పిచ్చి కేకపెట్టి పరుగున వచ్చి ఆమెను పట్టుకుంది నిర్మల.

సత్యనారాయణగారు కొయ్యబారిపోయాడు.

"అయ్యో! ఎంత పని చేసారండీ?...." అంటూ పెద్దగా యేడువసాగింది సుభద్రమ్మ.

రవిని, నారాయణని మార్నింగ్ షోకి తీసుకు వెళ్ళి తిరిగి వచ్చిన శ్రీకాంత్‌కి ఇంట్లో అడుగు పెట్టినప్పుడు కనిపించిన దృశ్యం యిది!

అక్కగారి ముఖం మీద రక్తధార చూసేసరికి అతనికి నవనాడులూ కృంగిపోయాయి.

## 39

కృష్ణవేణికి హాస్పటల్లో తెలివి వచ్చాక ఆమె తన ప్రక్కన కూర్చున్న భర్తని అడిగిన మొదటి ప్రశ్న "....మీ అన్నయ్య యేరి?"

"ఉన్నాడు .... బయటున్నాడు?" అన్నాడు విశ్వనాథం.

ఆమె ముఖం వికసించింది. "ఉన్నారా?.... ఒక్కసారి ఆయన్ని పిలవండి."

"ఇప్పుడాయనెందుకు వదినా! నువ్వు రెస్టు తీసుకో!" అంది ఆమె తలవైపు నిలుచున్న నిర్మల గద్గద స్వరంతో.

"నువ్వు....నువ్విక్కడే వున్నావా? అత్తగారొక్కరూ యింట్లో వున్నారు...." అంది కృష్ణవేణి కంగారుగా.

"మాధవి యింట్లో వుంది వదినా!" అన్నాడు మురళీమోహన్.

కోడలికి తెలివి వచ్చిందని విని ఆత్రుతగా లోపలికి వచ్చారు సత్యనారాయణగారు. ఆయన కళ్ళనిండా నీళ్ళు. "అమ్మా కృష్ణవేణీ!.... పాపిష్టివాడ్ని నిన్ను కొట్టాను...." అన్నాడు బొంగురు కంఠంతో.

"బాధపడకండి మామయ్యా! నాకేం నెప్పిగా

లేదు. రేపటికదే నయమవుతుంది. ఒక్కసారి మీ పెద్దబ్బాయిని పిలిపించండి....'' అందామె నెమ్మదిగా.

మురళీమోహన్ వెళ్ళి కృష్ణారావుని పిల్చుకు వచ్చాడు. అతని ముఖం నల్లబడి వుంది. అప రాధిలా తల దించుకున్నాడు.

''జరిగిపోయిందంతా మరచిపొండి. మీరు వస్తూ పోతూండాలనే మేమంతా కోరుకునేది!'' అంది కృష్ణవేణి మార్దవ స్వరంతో.

ఆమె ముఖంలోకి చూడగలిగి వుంటే కృష్ణా రావు పాషాణ హృదయం కరిగి వుండేదేమో! ''ఇప్పటికయిన పరాభవం చాలు! నా వాటా డబ్బు నా ముఖాన పడెయ్యండి. నా దారిన నేను పోతాను....'' అన్నాడు ముఖం ముడుచుకుంటూ.

ఆమె నా స్థితిలో చూసాక కూడా అతనింకా అలాంటి మాటలనగలిగాడంటే....అతనెటువంటి కిరాతక హృదయుడయి వుండాలోనని....అంతా ఆశ్చర్యపోయారు.

''....నువ్వు మనిషివా! పశువ్వా?'' అంటూ అతని మీదకి దూసుకు వెళ్ళాడు మురళీమోహన్.

''మురళీ!'' అని గట్టిగా కేక పెట్టింది కృష్ణవేణి. ''నువ్వు చేస్తున్నదేమిటో నీకు తెలుస్తోందా?....'' ఆవేశంలో ఆమె వణికి పోయింది.

మురళి వెనక్కి తిరిగి వచ్చాడు.

''మర్యాదగా అడిగితే యిస్తారనుకున్నాను. కొట్టటానికి వచ్చే వాళ్ళతో నాకేం పని? కోర్టుకి వెళ్ళి ఎలా రాబట్టుకోవాలో నాకు తెల్సు....'' అని విసురుగా బయటకు వెళ్ళిపోయాడు కృష్ణారావు.

''వద్దు.... వెళ్ళకండి. ఆయన్ని పిలవండి. ఆపండి....'' అంటూ తల పట్టుకుని అరిచింది కృష్ణవేణి.

శ్రీకాంత్ బయిటకు పరుగెత్తాడు. మరు క్షణంలో కృష్ణారావుని చేరుకున్నాడు ''....మా అక్కయ్య మిమ్మల్ని పిలుస్తోంది. ఒక్కసారి వచ్చి ఆమె చెప్పేదేదో వినండి....''

అతని చేతులు విసిరి కొట్టాడు కృష్ణారావు. ''ఎందుకు.... ఇంకా తిట్లు తినిపించటానికా? తన్నించటానికా?''

''లేదు. ఎవరు ఏమన్నా మా అక్కయ్య మిమ్మల్నేమీ అనలేదు. ఆ దెబ్బలేవో తనే తింది. ఆమె నీ స్థితిలో వదిలి వెళ్ళటం మీకు

# దీపశిఖల ముగ్గు



దీపావళినాడు ఉదయం మీ యింటి ముందు, 'దీపశిఖల ముగ్గు' వేసి చూడండి–ఎంత శోభాయ మానంగా వుంటుందో! చూడ్డానికి కష్టం అనిపించినా వెయ్యడం సులభమే. మొదటి బొమ్మలో చూపి నట్టుగా నాలుగు ప్లస్ మార్కుల చొప్పున చుట్టూ పెట్టుకోవాలి. నాలుగవ ప్లస్ మార్కుకు సమానంగా పదు ప్లస్‌లు పెట్టి, ఒక్కొక్కటి తగ్గించుకుంటూ, ఒకటి వరకూ పెట్టాలి. తర్వాత రెండో బొమ్మలో కలిపినట్టుగా ప్లస్‌లన్నీ కలుపుకోవాలి – 'దీపశిఖల ముగ్గు' సాక్షాత్కరిస్తుంది!

—పి. విద్యావతి



## ఇప్పుడు! మీముఖ సౌందర్యం గులాబీ పువ్వులాగా వికసించనీయండి. జాన్సన్స్* బేబీ కాంప్లెక్షన్‌క్రీమ్‌తో

### మీచర్మానికి పూరేకులమెత్తదనం సౌకుమార్యం కల్పించండి.

**మీ వర్చస్సుకు మెత్తదనపు స్పర్శ అవుసరం**

క్రొత్త జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మీకు పట్టువలె, మెత్తదనం కల్పిస్తుంది. గరుకైన చోట్లను మెత్తగా చేస్తుంది, మిమ్మల్ని పూల సువాసనలలో ముంచెత్తుతుంది.

**మీ వర్చస్సుకు వికాసం అవుసరం**

ఒక్క జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మాత్రమే మీ వర్చస్సుకు సహజ సౌందర్యం కల్పించుటకు అవుసరమైన అదనపు శ్రద్ధ తీసుకోగలదు. దానిని ప్రతిరోజూ వాడండి. మీ వర్చస్సు క్రొత్త సౌందర్యంతో పునరుజ్జీవం పొందగలగడం చూడగలరు.




ఈ మృదువైన గులాబిరంగు క్రీమ్ మీ ముఖవర్చస్సును సహజవికాసంతో ఉంచుతుంది... దాని వికాసంతో వెంటాడే సువాసన అందాల పూలగుచ్ఛంలా మీ చర్మాన్ని అంటి పెట్టు కొని ఉంటుంది.

Johnson & Johnson*

* Trademark © J & J 78

OBM 1800 TL

న్యాయం కాదు. ఒక్క రెండు నిమిషాలు ఆమె చెప్పే మాటలు విని వెళ్ళిపొండి. ఆమె ప్రాణాలు కాపాడండి. ప్లీజ్ !....'' అంటూ ప్రాధేయ పడ్డాడు శ్రీకాంత్.

ఏ కళ నున్నాడో కృష్ణారావు కదిలి వెనక్కి వచ్చాడు. కన్నీటి ధారలతో నిండిన కృష్ణవేణిని చూసి క్షణం సేపు చలించాడు.

''వచ్చారా!....నా మాట విని వచ్చారా! మీరు కోరినట్టే జరిపిస్తాం. మీరు వెళ్ళిపోకండి!....'' అని గబగబా కళ్ళు తుడుచుకుంది ఆమె.

''ఆవేశపడకు వదినా!'' అన్నాడు మురళీ మోహన్.

అంతా నివ్వెరపోతూ ఆమెవైపు చూశారు. కృష్ణారావు తల దించుకుని నిలబడ్డాడు.

''మీరలా అడగటంలో తప్పులేదు....మీరడిగినట్టే యిప్పిస్తాం. ఒక్క పదిహేను రోజులు గడువిప్పించండి!....''

''అమ్మా కృష్ణవేణీ!....'' అని ఆమె మాట కడ్డురాబోయాడు సత్యనారాయణగారు.

''అవును మామగారూ! ఆయన మీ పెద్ద కొడుకు....ఆ ఇంట్లో అందర్కీ వాటా వున్నప్పుడు ఆయనకూ వుండాలి....అది న్యాయం!''

ఆ పరిస్థితిలో ఆమె మాట కాదనటానికెవరికీ మనసొప్పలేదు. నోరు రాలేదు.

''నేనింక వెడతాను.'' అన్నాడు కృష్ణారావు.

''ఈ ఒక్క రోజు ఇక్కడుండి వెళ్ళండి.'' అంది కృష్ణవేణి ప్రాధేయపడుతూ.

''నాకు వీల్లేదు. శలవులేదు....''

''పోనీ, వచ్చేటప్పుడు అక్కయ్యగార్ని పిల్లల్నీ అందర్నీ ఒక్కసారి తీసుకు రండి! మీ కోసం మేమంతా ఎదురు చూస్తుంటాము....''

అతను అవుననలేదు. కాదనలేదు. వెడతానని మాత్రం చెప్పి వెళ్ళిపోయాడు.

## 40

మరొక్క రోజు హాస్పటల్లో ఉండమన్నా వినకుండా ''........నాకిక్కడకన్న ఇంట్లోనే విశ్రాంతిగా వుంటుంది.'' అని డాక్టరుతో చెప్పి ఇంటికి బయలుదేరి వచ్చేసింది కృష్ణవేణి.

ఆమెను త్వరగా కళ్ళారా చూసుకున్నందుకు సుభద్రమ్మ ఎంతో సంతోషించింది. కోడలు నవ్వుతూ మాట్లాడినప్పుడు కాని తను కొట్టిన పాపం తగ్గినట్టనిపించలేదు సత్యనారాయణగారికి.

ఆ స్థితిలో వెంటరావటం బావుండదని తమ్ముడ్ని పెళ్ళి చూపులకి వెళ్ళి రమ్మంది కృష్ణవేణి. ''...పెళ్ళికి నేనెలాగా వస్తాను. నీకు నచ్చిన పిల్ల నాకు నచ్చినట్టే!'' అని ప్రోత్సహించింది. తనకు దెబ్బ తగిలిన విషయం తల్లిదండ్రులకి చెప్పవద్దని....ఏదోటి చెప్పి సమాధానపరచమని కోరింది. సరేనని అతను వెళ్ళిపోయాడు.

''నువ్వు వెడతావని ఎంతో ఆశపడి శలవు పెట్టాను. ఇలా అవుతుందని అనుకోలేదు.'' అంది మాధవి ముఖం చిన్నబుచ్చుకొని.

''ఇంతలో ఏమయిందని!.....నాకిప్పుడేమీ బాధగాలేదు.'' అని కృష్ణవేణి నిండుగా నవ్వింది.

''........పదిహేను రోజుల్లో డబ్బిస్తానని ఆ మహానుభావుడితో అన్నావు. ఎలా యిస్తావు? ఎక్కడ్నించి తెచ్చిస్తావు?'' అంది నిర్మల దిగులుగా.

కృష్ణవేణి కొన్ని నిమిషాల పాటు గంభీరంగా ఉండిపోయింది.

''అదంతా తర్వాత ఆలోచించుకోవచ్చు. ముందు అక్కయ్య ఆరోగ్యం చక్కబడనీ!'' అంది మాధవి.

''ఈ విధంగానయినా ఆయన మళ్ళీ మనలో కలుస్తారని.'' అంది కృష్ణవేణి తనలో తను అనుకుంటున్నట్టు.

[సశేషం]

# బరిందర్

కృషి, దీక్ష, పట్టుదల వుంటే ఎంతటి కార్యమైనా సాధించవచ్చునని, అంగవైకల్యం ఉన్నంత మాత్రాన నిరాశా నిస్పృహల మధ్య జీవితాన్ని గడపవలసిన అవసరం లేదనీ నిరూపించింది ఢిల్లీకి చెందిన యువతి — బరిందర్.

''ఇరవైఒక్క సంవత్సరాల యుక్తవయసులో కూడా పసిపిల్లలాగే భావించేదాన్ని'' అనే బరిందర్ కాళ్ళు పుట్టుకతోనే స్పర్శజ్ఞానాన్ని కోల్పోయాయి. దాంతో ఆమె తండ్రి ఆమెని ఎత్తుకుని వెళ్ళవలసి వచ్చేది. బరిందర్‌కి తన వయసువారందరిలాగే తనూ చదువుకోవాలనే ఆరాటం అధికమయింది. అనుక్షణం ఆమెకి ఏం కావలసినా చూసుకునే ఆమె తండ్రి– మొదట అందుకు అంగీకరించలేదు. 'మనసుంటే మార్గం వుంటుం'దన్నట్లు బరిందర్ తనంతట తానే పాకుతూ పాఠశాలకి వెళ్ళి దరఖాస్తు కాగితం తెచ్చుకుంది. ఆ తరువాత ఎన్నడూ ఆమె చదువుకు అభ్యంతరం చెప్పలేదు ఆమె తండ్రి.

పాఠశాలలో ఉపాధ్యాయినులు ఆమెతో సహకరించారు. చదువు అలా సాగుతూవుండగా కొన్నాళ్ళకు ఆమె మరో సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. ఉన్నట్టుండి పాదాలనుండి చీము కారుతూ వుండేది. అది కప్పిపుచ్చడానికి బ్యాండేజీ కట్టుకునేది బరిందర్. ఉపాధ్యాయినులు ఆ విషయం తోటి విద్యార్థినులకి తెలియకుండా గోప్యంగా వుంచారు. బి. ఏ. మొదటి సంవత్సరంలో వుండగా బరిందర్‌లో తన మీద తనకే ఒక విధమైన న్యూనతాభావం ఏర్పడటం ఆరంభమైంది. అందుకు తోడు ఆసుపత్రిలో చేరక తప్పదని తెలియగానే చదువు పోతుందేమోనని భయం వేసింది. కానీ చేరక తప్పలేదు.

సఫ్దర్‌జంగ్ ఆసుపత్రిలో డాక్టర్ శంకరన్ ఆమె కాళ్ళు రెండూ తీసివెయ్యక తప్పదన్నప్పుడు మొదట ఆ ఊహే భయంకరంగా అనిపించింది బరిందర్‌కి.

శస్త్రచికిత్స పూర్తి కాగానే మామూలుగా అటూ ఇటూ నడవాలని, కాళ్ళు కదపడానికి ప్రయత్నించింది. వైద్యులు ఆమె మనసులోని బాధ, భావం అర్థం చేసుకున్నారు. కృత్రిమపాదాలు అమర్చారు. చదువుపట్ల ఆమెకి గల ఉత్సాహాన్ని చూసి – ఆ ఆసుపత్రిలోనే వున్న వృత్తి విద్యాకేంద్రం (వొకేషనల్ డిపార్ట్‌మెంట్) లో టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్ నేర్చుకోమని ప్రోత్సహించారు.

డాక్టర్ శంకరన్ ఆమెతో ''నువ్వు నడవడం నేర్చుకో... నేను నీకు ఉద్యోగం యిస్తాను'' అన్నారు. అదో సవాలుగా తీసుకుంది బరిందర్. కృత్రిమ పాదాల సహకారంతో నడవడం నేర్చుకుంది.

సఫ్దర్‌జంగ్ ఆసుపత్రిలోనే రిసెప్షనిస్ట్‌గా ఆమెని ఉద్యోగంలోకి తీసుకున్నారు డాక్టర్ శంకరన్. ఆమె బాధల్లా తల్లిదండ్రులను ఎక్కువసార్లు చూడటానికి వీలుపడటం లేదన్నదే. ఆమె తల్లిదండ్రులు ఢిల్లీ పొలిమేరల్లోని షహదారాలో నివసిస్తున్నారు. అక్కడికి వెళ్ళాలంటే బస్సులో ప్రయాణం చెయ్యాలి. బరిందర్‌కు ఆ ప్రయాణం చాలా శ్రమతో కూడుకున్న పని.

''ఏ సమస్యలు ఎదురైనా - విధిని నిందించడం కంటే, పరిష్కారానికి మార్గాలు అన్వేషించడం మంచిదని నా విశ్వాసం'' అంటుంది బరిందర్.

# ప్రయోగ నాళికా శిశువు పరిణామాలు



సదస్సులో పాల్గొన్న వనితలు:

1. డాక్టర్ కె. ఆర్. అంబుజదేవి (ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్)
2. డాక్టర్ గిరిజ (స్టాన్లీ వైద్యకళాశాల – మద్రాసు)
3. శ్రీమతి రాధాశ్రీనివాసన్ (న్యాయవాది)
4. శ్రీమతి హన్నా (ఉపాధ్యాయిని)
5. శ్రీమతి లక్ష్మి శ్రీనివాస్ (గృహిణి)

తన వైద్యశాస్త్ర పరిజ్ఞాన పథంలో గత జూలై నెల ఇరవై ఐదో తారీఖున మరో మైలు రాయిని దాటాడు మనిషి. ప్రపంచం నలుమూలల నుంచీ ప్రశంసలను అందుకున్న ఆ అద్భుతమైన ఘన విజయం—ఇంగ్లండ్ డాక్టర్లు - స్టెప్టో, రాబర్ట్ ఎడ్వర్డ్స్ - ఆధ్వర్యంలో జరిగిన ప్రయోగ నాళికా శిశు జననం! (దీనిని గురించిన వ్యాసం సెప్టంబర్ సంచికలో ప్రచురించాము.)

వీరి విజయానికి ఏమాత్రం తీసిపోని మరో విజయం సాధించిన ఘనత కలకత్తాకు చెందిన సుభాష్‌ముఖర్జీ, సరోజ్‌కాంత్ భట్టాచార్‌జీ, సునీత్ ముఖర్జీ – అన్న భారతీయ డాక్టర్లకు చెందుతుంది. ప్రభాత్‌కుమార్ అగర్వాల్ – బేలా దంపతులకు పెళ్ళయి పదహారు సంవత్సరాలు అయినప్పటికీ సంతానం కల్గలేదు. ఇన్నేళ్ళ తర్వాత డాక్టర్ల పరిశోధనల ప్రయత్నాలవల్ల ప్రపంచంలో ద్వితీయ ప్రయోగనాళికా శిశువును జన్మింపజేశారు. అంతేకాదు–ఫలదీకరణ పొందిన పిండాన్ని గర్భాశయానికి వెలుపల ఏభైమూడు రోజులు కాపాడారు. ఇది ప్రపంచంలోనే ప్రప్రథమ ఘనవిజయం అనే చెప్పాలి. అంతర్జాతీయ వైద్యరంగంలో సైతం ప్రముఖస్థానం పొందగల ప్రతిభావంతులైన వైద్యశాస్త్ర వేత్తలు మన దేశంలో వున్నారు అనడానికి ఈ వైద్యత్రయం–ఓ చక్కని ఉదాహరణ.

విప్లవాత్మకమైన మార్పు ఏ రంగంలో వచ్చినా అది మానవసంఘ జీవితాన్ని తప్పకుండా ప్రభావితం చేస్తుంది. మనిషి పుట్టుకకే ప్రాణం పోసే ఈ ప్రయోగనాళికా శిశు జననం మానవ జాతి స్వరూప స్వభావాలలోనే మార్పుతేగల మహత్తరమైన ప్రక్రియ! దీనివల్ల ధార్మిక, సామాజిక, నైతిక, చట్ట సంబంధమైన ఎన్నో సమస్యలు తలెత్తగలవు. ఈ విధానంవల్ల ముఖ్యంగా వనితా లోకం కొన్ని సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందనడం కూడా నిజమే. అందువల్ల ప్రయోగ నాళికా శిశు జననం పర్యవసానాలేమిటి? దీనిని గురించి వివిధ రంగాలకు చెందిన వనితల ఆలోచనా ధోరణి, అభిప్రాయాలు ఎలా వున్నాయి? మొదలైన విషయాలను తెలుసుకునే సంకల్పంతో మన పత్రిక తరపున ఒక చిన్న సదస్సు యేర్పాటు చేశాము. ఆ సదస్సులో వెలువడిన అభిప్రాయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాము:

అంబుజదేవి: పరీక్షనాళిక శిశు జననం నిజంగా స్వాగతం పలుకవలసిన అద్భుతమైన ఘన విజయమే. ఎందుకంటే – వద్దు అనుకున్నప్పుడు పిల్లలు కలగకుండా చేసేవిధంగానే, పిల్లలులేని దంపతులకు పిల్లల్ని కలుగజేయడం కూడా వైద్యుల బాధ్యత ఔతుంది. అంతేకాదు. ఈ ప్రయోగనాళిక శిశూదయం వల్ల మరోమంచి జరగడానికి కూడా అవకాశం వుంది. ఈ శిశు జనన సంబంధమైన పరిశోధనలు ఆరోగ్యవంతమైన పిల్లలు కలగడానికి కావలసిన పరిస్థితులను అనుగొనడానికి కూడా దోహదం చేస్తాయి.

గిరిజ: ప్రయోగనాళిక శిశూదయం గురించిన సరియైన అవగాహన లేనందున సామాన్య ప్రజానీకంలో కొందరు దీనివల్ల, స్త్రీత్వం, పవిత్రత పోతుందని సంశయిస్తున్నారు. అందువల్ల దీనిని గురించి క్లుప్తంగా తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

గర్భధారణకు ఆధారమైన అండకణాలు ఒక్కొక్కఋతు సమయంలోనూ స్త్రీ అండాశయం నుంచి ఒకటో రెండో వెలువడుతాయి. ఇవి అండవాహికనాళం ద్వారా (ఫాలోపియన్ ట్యూబ్) గర్భాశయం చేరుతాయి. ఇదే సమయంలో పురుష శుక్లకణం ఈ అండాన్ని తొలుచుకుని దానితో సంయోగం చెందడం వల్ల ఫలదీకరణ జరిగి పిండోత్పత్తి అవుతుంది–ఇది ప్రకృతి సహజంగా జరిగే గర్భధారణ.

ఇకపోతే స్త్రీకి పిల్లలు కలగకుండా పోవడానికి రెండు కారణాలు చెప్పవచ్చు. అందులో మొదటిది–అండాశయం నుంచి అండకణాలు సరియైన కాలంలో వెలువడకపోవడం. రెండవది – అండకణాలు గర్భాశయం చేరే మార్గమైన అండవాహిక నాళ ద్వారాలు మూసుకుపోవడం.

అంబుజదేవి: ఇలా అండవాహికనాళ ద్వారాలు మూసుకుపోయినవారికే ఈ ప్రయోగ నాళికా శిశువు పద్ధతి ద్వారా సంతానం కల్గించడానికి ప్రయత్నించవచ్చు.

గిరిజ: అండోత్పత్తి కాలేదనుకుంటే హార్మోనుల ద్వారా చికిత్స చేయడానికి ప్రయత్నిస్తారు. ఇది ఫలవంతం కాలేదనుకుంటే గర్భధారణకు అవకాశం వుండదు. అండవాహికనాళ ద్వారాలలో అడ్డు వున్నట్టయితే– అండోత్పత్తి జరిగినా అవి గర్భాశయం చేరుకోలేవు.

అంబుజదేవి: ఇలాంటి లోపం వున్న స్త్రీ అండాశయం నుంచి ఒక అండాన్ని వెలుపలికి తీసి, ఆమె భర్త శుక్లకణాలతో సంయోగింపజేసి ప్రయోగనాళికలో ఫలదీకరింపజేసి–పిండోత్పత్తి అయిన తర్వాత గర్భాశయంలో వుంచడమే ఈ ప్రయోగనాళిక శిశు జననానికి ప్రాతిపదిక!

గిరిజ: ఫలదీకరణ జరిగిన పిండం చుట్టూ తల్లి గర్భాశయ శీతోష్ణస్థితిని, రసాయనిక వాతావరణం కృత్రిమంగా యేర్పరచబడుతుంది. ఫలదీరణ జరిగిన తర్వాత దానిని తల్లి గర్భంలో వుంచుతారు. ఆ పైన మామూలు శిశువుల్లాగానే అమ్మ గర్భంలో తొమ్మిది నెలలు పెంచబడి జననం జరుగుతుంది.

లక్ష్మి: అంటే ఫలదీకరణ, పిండోత్పత్తి మాత్రం ప్రయోగశాలలో జరుగుతుందన్న మాట.

రాధా శ్రీనివాసన్: బేబీ బ్రౌన్ కానీ, కలకత్తా

శిశువు కానీ. తల్లి అండం, తండ్రి శుక్లం ప్రయోగనాళికలో చేర్చి ఫలదీకరించబడి తల్లి గర్భంలోనే పెరిగి పుట్టిన శిశువులే. కాని ముందు ముందు ఈ పద్ధతి—కొత్తకొత్త ప్రక్రియలు, పరిశోధనలు జరపడానికి దోహదం చేస్తుంది.

రాధా: అదే విధంగా ప్రయోగనాళికలో ప్రాణం పోసుకున్న పిండాన్ని తల్లి గర్భంలో కాకుండా మరో స్త్రీ గర్భాశయంలో వుంచి—జన్మింప చేయడానికి కూడా అవకాశం వుంటుంది.

## ఏమిటిది? — చర్చ



అలాంటప్పుడు తొమ్మిది నెలలు మోసి, పెంచి, కన్నతల్లి కూడా పెంపుడు తల్లి అవుతుందే కాని నిజమైన కన్నతల్లి కాదనే అనుకుంటాను.

అంబుజదేవి: ఇక్కడ ఒక విషయం చెప్పా లనుకుంటాను. ఒక స్త్రీ భర్త దుర్గుణాలు కల వాడో నేరస్థుడో లేదా తీవ్రమైన వ్యాధితో బాధపడే వాడో అయితే మరో ఆరోగ్య మైన పురుషుని శుక్లంతో స్త్రీ అండాన్ని ప్రయోగ నాళికలో ఫలదీకరింప జేసి—ఆమె గర్భాశయంలో ఉంచడంలో ఎలాంటి తప్పూ లేదనుకుంటాను.

గిరిజ: బాగా చెప్పారు డాక్టర్. లోపంతో వుండే భర్త ద్వారా లోపాలతో అనారోగ్య మైన శిశువును ప్రసవించడానికి బదులు ఆరోగ్య వంతమైన శిశువును పొందడానికి ఇది దోహదం చేస్తుంది. మరో పర పురుష శారీరక సపర్కంతో పాపాయిని కన్నట్టయితే దానిని ధర్మ విరుద్ధమైన కృత్యంగా, చెప్పవచ్చు. కాని ప్రయోగ నాళికా పద్ధతి ద్వారా ఇలాంటి శిశువుల్ని పొందడం స్త్రీ పవిత్రతకు కళంకం తెచ్చేదిగా నేను భావించడం లేదు.

లక్ష్మి: ఇది చెప్పడం చాలా సులభమే కాని దీనికి ఏ వనిత మనసు కూడా సమ్మతించదనే నేను అనుకుంటాను.

అంబుజదేవి: అవసరంలేని-అర్థరహితమైన సెంటిమెంట్స్‌ను మనం కొన్ని సమయాల్లో వదులు కోవాలి మరి. దంపతులకు పిల్లలు లేరు అంటే దానికి భార్య శరీరలోపమో, అనారోగ్యమో కారణం కావచ్చు. దానికి తోడు భర్త ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వుంటుందనుకోండి. అలాంటప్పుడు ఆమె అండంతో అపరచితమైన పురుషుని శుక్లకణంతో—ప్రయోగనాళిక పద్ధతి ద్వారా ఫలదీకరింపజేసి శిశువును పొందడంలో ఏం సెంటిమెంట్ అడ్డొస్తుంది?

గిరిజ: శరీర ఆరోగ్యం దెబ్బతిన్నప్పుడో—శస్త్ర చికిత్స చేసే సమయాలలోనో మనకు ముక్కూ మొహం తెలియని వారి రక్తం ఎక్కిస్తారు. దీనిని మనం నిరభ్యంతరంగా ఒప్పుకుంటున్నాం కదా? మరి ఇది కూడా అలాంటిదే. అవసరాన్ని బట్టి దేన్నైనా వివేకంతో ఆలోచించాలి మరి.

రాధ: భార్యా భర్తలు ఒప్పుకున్నట్టయితే, దీనిని గురించి నోరు మెదపడానికి ఎవరికీ అర్హత లేదు. కాని ఒకవేళ భార్యా భర్తలకు తెలియ కుండా డాక్టర్లు ఇటువంటి పరిశోధనలు చేసి నట్టయితే దీని మూలంగా చట్టసంబంధమైన చిక్కులు, సమస్యలు తలెత్తడానికి అవకాశం వుంది.

అంబుజదేవి: ఇలాంటి విషయాలను నిరూ పించడం కూడా చాలా కష్టమే.

లక్ష్మి: నిరూపించడం మాట ఎలా వున్నా భార్యా భర్తల మధ్య పొరపొచ్చాలు చెలరేగడానికి, అగాధం యేర్పడడానికి ఇది కారణం కావచ్చు.

గిరిజ: మానసికంగానో, శారీరకంగానో, భార్య, భర్తకు దూరం కావడం లేదుకదా—మరి అలాంటప్పుడు అగాధాలు యేర్పడడానికి అవకాశాలు లేవు.

హన్నా: మా కేథలిక్ క్రైస్తవ మతం ఈ ప్రయోగ నాళికాశిశు ప్రయత్నానికి తీవ్రమైన నిరసన తెలియజేసింది. మా మతానుసారం ఇది దైవానికి వ్యతిరేకమైన చర్యగా పరిగణింప బడుతుంది.

రాధ: దైవానికో, దైవసంకల్పానికో విరుద్ధ మైన చర్యగా దీనిని నేను అనుకోను. కృత్రిమ అండం ద్వారా పిండోత్పత్తికి ప్రయత్నించి నట్టయితే ఒకవేళ అలా భావించడం సమంజసం కావచ్చు. వారి విశ్వాసప్రకారం దేవుడే సృష్టించిన స్త్రీ పురుష శరీరాలనుంచి జీవోత్పత్తి కణాలను వెలికితీసి ఫలదీకరింప చేయడమే ఇది.

హన్నా: బైబిల్ ప్రకారం — అబ్రహామ్‌కు నూరేళ్ళు, సారాకు తొంభై ఎనిమిది సంవత్సరాలు నిండేవరకు పిల్లలు కలుగలేదు. అయినా దేవుని దయవల్ల శిశువు కలుగగలదని వారు భక్తితో విశ్వసించారట. వాళ్ళ నమ్మకం వమ్ము కాలేదట. దేవుని దయవల్లనే పాపాయి పుట్టినట్టు బైబిల్ చెబుతుంది.

ఇటువంటి దైవ విశ్వాసానికి హాని వాటిల్లు తుందన్న అనుమానమే పైఖండనకు, నిరసనకు కారణం కావచ్చు. అయినా మా మత అనుయా యులు కూడా కొందరు ఈ ప్రయోగానికి జోహా రులు పలికారు. పాపాయి కోసం పరితపించే తల్లి హృదయానికి పరిష్కారం చూపి—ఆహ్లాదం కల్గించే ఈ ప్రయోగనాళికా శిశూదయానికి—నామటుకు నేను వ్యక్తిగతంగా చాలా సంతోషి స్తున్నాను — స్వాగతం చెబుతున్నాను. ఇంకో విషయం. ఇలాంటి శిశువుల జననంవల్ల చట్టానికి సంబంధించిన సమస్యలు కూడా పుట్టుకొస్తా యంటారా?

అంబుజదేవి: తప్పకుండా- ఇంగ్లాండ్‌లో అప్పుడే దీనికి సంబంధించిన వ్యవహారాలను చట్టబద్ధం చేసినట్లు వార్తలు వెలువడ్డాయి.

రాధా: మనదేశంలో కూడా ఇలాంటి చట్టాలు రావలసిన అవసరం యేర్పడవచ్చు.

గిరిజ: అండ వాహిక నాళాలు ఆరోగ్యంగా లేని స్త్రీలవరకే ఈ పరిశోధనలు — ప్రయోగాలు, విజయాలు పరిమితమైనవి. కాబట్టి దీనివల్ల నానాటికి పెరుగుతూన్న జనాభా సమస్య మరింత విస్తృతమౌతుందని భయపడవలసిన అవసరం లేదు. అది కాకుండా ఇప్పుడు జన్మించిన ప్రయోగనాళికా శిశువులు ముందు ముందు ఎలా వుంటారో వారి ఆరోగ్యం ఎలా వుంటుందో చూడాలి. ఇది సామాజిక జీవన విధానాన్ని పెద్దగా ప్రభావితం చేస్తుందని అనుకోలేము. ఏది ఏమైనప్పటికీ వైద్యశాస్త్రం సాధించిన అద్భుత మైన ఈ ఘన విజయానికి రెండు చేతులతో స్వాగతం చెప్పాలి. దీనికి కారణకర్తలైన వైద్య శాస్త్ర వేత్తలను మనసారా అభినందించాలి. అది మన కనీస కర్తవ్యం! □

# వంటలు : దీపావళికి రెండు తీపి వంటకాలు



సాధారణంగా ఏదైనా పండుగ వచ్చిందీ అంటే పిండి వంటలలో తీపి పదార్థం తప్పని సరి—ఇక దీపావళి పండుగ అంటే చెప్పాలా! అసలు తీపి వంటకాలనగానే ఎవరికైనా ముందుగా గుర్తుకు వచ్చేది—పాయసం! ఈ పాయసాన్ని వివిధ ప్రాంతాలలో రకరకాలుగా చేసుకుంటారు. అందులో 'దాల్ పాయసం' ఒకటి. అలాగే మరో వంటకం 'చిరోటి'. ఈసారి దీపావళికి ఈ రెండూ ప్రయత్నించి చూడండి.

## దాల్ పాయసం

ఇది తయారు చేసుకోవడానికి కావలసిన పదార్థాలు: 1 కప్పు సెనగపప్పు గాని, పెసరపప్పు గాని, 1 కొబ్బరికాయ, 2 లేక 3 ఏలకులు, 1 టేబుల్ స్పూను జీడిపప్పు ముక్కలు, 2 టేబుల్ స్పూనుల నెయ్యి, 1 టేబుల్ స్పూను కొబ్బరికోరు, బెల్లం కావలసినంత.

ముందుగా పప్పుని వుడకబెట్టుకోవాలి. అయితే పప్పు పూర్తిగా వుడకకుండానే స్టవ్ మీద నుంచి క్రిందకి దింపుకోవాలి. ఇలా మూడువంతుల దాకా వుడికిన పప్పుని ముద్దగా చేసి వుంచుకోవాలి.

ఆ తరువాత కొబ్బరిపాలు పలచగానూ (కాసిన్ని నీళ్ళు కలిపి) చిక్కగానూ వేర్వేరు కప్పులలో తీసి వుంచుకోవాలి. పలుచటి కొబ్బరి పాలకి బెల్లం కలిపి స్టవ్ మీద వుంచాలి. బెల్లం వాసన పోయేదాకా ఆ మిశ్రమాన్ని ఆ విధంగా నన్నని సెగ మీద వుంచాలి. ఇప్పుడు ఆ మిశ్రమానికి ముద్దగా చేసి వుంచుకున్న పప్పు కలపాలి. ఇది కాస్త చిక్కబడిన తరువాత చిక్కటి కొబ్బరిపాలను, ఏలకులను కలపాలి.

## కొబ్బరి సింగడా

కావలసిన వస్తువులు : మైదా-½ కిలో, కొబ్బరి కాయ-1, ఉల్లిపాయలు-200 గ్రా, పచ్చి మిర్చి-10 కాయలు, ఉప్పు తగినంత, నెయ్యి లేక డాల్డా.

తయారుచేసే విధానం: మైదా తీసుకొని జల్లించి దానిలో ఉప్పు, నెయ్యిగాని డాల్డాగాని వేసి పూరి పిండిలా అరగంట ముందుగా కలిపి ఉంచాలి. పచ్చిమిర్చి, ఉల్లిపాయలు బాగా కడిగి సన్నగా తరిగి ఉంచుకోవాలి. కొబ్బరికాయను కోరుకొని ఆ కోరు, పచ్చిమిర్చి, ఉల్లిపాయలు అన్నీ కలిపి ఉంచుకోవాలి.

తడిపి ఉంచుకొన్న మైదాను నిమ్మకాయంత ఉండలుచేసి వాటిని పూరీలుగా చేసిపెట్టుకోవాలి. వత్తి ఉంచుకొన్న పూరీలో కలిపి ఉంచిన కోరును తగినంత పెట్టి కజ్జికాయలా కొనలు అల్లి ప్రక్కన ఉంచుకోవాలి. అలాగే అన్నీ పూర్తయిన తర్వాత బాణలి, పొయ్యిమీద పెట్టి నెయ్యిగాని డాల్డాగాని వేసి మరిగిన తరువాత ఒక్కొక్క దాన్నే నెయ్యిలో వేసి బాగా దోరగా వేగిన తరువాత తీసేయాలి.

ఇది కన్నడ దేశస్థులకు ముఖ్యమైన పిండి వంట. వారు ప్రతి చిన్న పండుగకు కూడా ఈ పిండివంట చేసుకుంటారు.

—జి. విజయలత, కలువాయి

ఇక యిప్పుడు జీడిపప్పు ముక్కలను, కొబ్బరి కోరును కలిపి నేతిలో కలిపి వేయించాలి. బంగారు వన్నెరంగు వచ్చేదాకా వీటిని వేయించి ఆ తరువాత పాయసంలో కలపాలి.

ఈ పాయసానికి పనసపండు తొనలు కూడా కలుపుకోవచ్చు. పప్పు వుడుకుతున్నప్పుడే పనస పండు తొనలను ముక్కలు చేసి కలిపి వుడకబెట్టుకోవాలి. మిగిలిన పద్ధతి అంతా మామూలే. పనస పండు- పప్పు పాయసం కూడా ఎంతో రుచిగా వుంటుంది.

## చిరోటి

ఈ చిరోటి తయారు చేసుకోవడానికి కావలసిన పదార్థాలు : 1½ కప్పు మైదా, 1 కప్పు నెయ్యి, 1 కప్పు బియ్యం పిండి, 1 కప్పు మెత్తటి పంచదార, 1 టేబుల్ స్పూను వెన్న, తగినంత వుప్పు, నెయ్యి.

ముందుగా మైదాకి వుప్పు కలిపి జల్లించుకోవాలి. ఇలా జల్లించిన మిశ్రమానికి సగం కప్పు నెయ్యి కలిపి రొట్టెలపిండిలా చేసుకోవాలి. ఒక పాత్రలో మూతపెట్టి ఈ మిశ్రమాన్ని దాదాపు రెండుగంటలసేపు ఆ విధంగానే వుంచాలి.

ఆ తరువాత సగం కప్పు బియ్యం పిండికి వెన్న, మిగిలిన నెయ్యి కలిపి ముద్దగా చేసి వుంచుకోవాలి. ఇప్పుడు రొట్టెలపిండిలా చేసి వుంచుకున్న మైదా పిండిని మరోసారి ఒత్తి సమభాగంలో చిన్న చిన్న ఉండలు చేసుకోవాలి. ఒక్కొక్క ముద్దని పల్చని చపాతీలుగా ఒత్తుకోవాలి. వీటిపైన ముందుగా చేసి వుంచుకున్న బియ్యపుపిండి ముద్దని అద్దుకోవాలి. ఒక చపాతి మీద మరో చపాతి వుంచి వాటిని చుట్టలాగా చుట్టుకోవాలి. వీటిని ఒక్కొక్క దానిని రెండు, మూడు ముక్కలుగా కోసుకోవాలి.

ఇక యిప్పుడు వీటిని చదునుగా చేసి, పూరీలు చేసుకునేందుకు వీలుగా తయారు చేసుకోవాలి. బాణలిలో బాగా కాగుతున్న నేతిలో వీటిని దోరగా వేయించుకోవాలి. అవి వేడిగా వుండగానే వాటి మీద పంచదారపొడి చల్లుకోవాలి.

సాధారణంగా ఉత్తరభారత దేశస్థులు ఈ చిరోటీలను పాలలో కాని లడ్డూ, బూందితో కాని అద్దుకుని తింటూ వుంటారు. ఆ విధంగా తింటే యివి మరింత రుచికరంగా వుంటాయి.

వర్ణచిత్రాలు : సత్యకుమార్ ▶

హిమబిందువులతో తడిసిన సౌరభంగల
పువ్వుల తాజా సుగంధం
మీ మనసును దోచేస్తుంది




# పాయిజ్
## శాంతెల్
పెర్ ఫ్యూమ్

U-PCP-1 TEL

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

సూపర్ బాల్ పెన్....హాయిగా, మెత్తగా రాసేది.

# కేమ్లిన్ సుప్రీమ్

దృఢమైనదిగా రూపొందించబడిన నాజిల్. సొగసైనది, అధునాతనమైనది, వెండిలా మిల మిల మెరిసేది-ఉన్నత శ్రేణికి చెందిన జాటర్ పెన్.

# కేమ్లిన్ 121 జాటర్

లక్షలాది ప్రజల అభిరుచులకు అనువుగా ఉండేలా రకరకాల రంగులలో దొరుకుతుంది. ఈ ధరలో దొరికే బాల్ పెన్‌లలో దీనిని మించినది మరేది ఉంటుంది!





VISION 783 TEL

# నిర్ణయం

— కె. మృణాళిని

మనిషి పొరబాటు చెయ్యడం సహజమంటారు. కావచ్చు. కానీ అన్ని సందర్భాల్లోనూ ఆ మాటను కుని సరిపెట్టుకోవడం సాధ్యమా? నేను చేసిన పనిని కేవలం 'పొరబాటు' అనకూడదేమో. తన సంతోషాన్ని ఒక మార్గంలో వెతుక్కోవడానికి ప్రయత్నిస్తున్న వ్యక్తికి ఇంకో బాట చాలా సాఫీగా సుగమంగా ఉందని చెప్పి, దారి మళ్ళించి, ముళ్ళ పొదల్లోకి తోసేసి 'అయామ్ సారీ పొరబాటైపోయింది' అని అనవచ్చని అంగీకరిస్తే, నేను చేసింది కూడా పొరబాటే.

నీలిమ, నేను ప్రాణస్నేహితులం. అలా అనడం కంటె నీలిమకు నేను ప్రాణస్నేహితురాలు అనడం సమంజసం. నాకు అందరూ స్నేహితులే గానీ, నీలిమ మాత్రం నన్నొక్కదాన్నే ఎక్కువగా అభిమానించేదీ, గౌరవించేదీ. చిన్నప్పట్నుంచి ఇంటా, బయటా కూడా నేను చాలా తెలివైన దాన్నని పేరు పొందడం వల్ల, నా తెలివితేటలు అసాధారణమైనవని, నా అభిప్రాయాలు విలువైనవని, నా నిర్ణయాలు తిరుగులేనివని నాలో ఓ విధమైన నమ్మకం ఏర్పడిపోయింది.

నీలిమ ప్రతి విషయానికీ నా మీద ఆధారపడడం ద్వారా నా ఆత్మవిశ్వాసాన్ని ఎక్కువ చేసేది. తను తీసుకోబోయే ప్రతి నిర్ణయానికీ ముందు నా సలహా అడిగేది. బహుశా నీలిమ అంతగా నా తెలివితేటలపై నమ్మకం ఉంచకపోతే, తన జీవితం ఇలా మారేది కాదేమో. కానీ ఆ మాట ఇప్పుడు అనుకుని లాభం లేదు.

ఇంటర్మీడియట్ కాగానే నీలిమ ఎం. బి. బి. యస్‌కు వెళ్తానంది. వాళ్ళింట్లో కాదనలేదు. కానీ నీలిమకు తల్లిదండ్రుల సమ్మతి చాలదు. వచ్చి నన్నడిగింది. 'ఎంట్రన్స్ రాయనా' అని. నేను ఖచ్చితంగా వద్దని చెప్పేశాను. తనలాంటి నాజూకు మనుషులకు డాక్టర్ చదువు పనికి రాదన్నాను. హాయిగా ఏ లిటరేచరో తీసుకుని చదువుకొమ్మన్నాను. నీలిమ నా మాటలతో ఏకీభవించిందని వేరే చెప్పనవసరం లేదు. ఫలితంగా ఇద్దరం బి. ఏ. లో చేరాం. మిగిలిన విషయాల్లో నీలిమ అవగాహన, గ్రహింపుశక్తి తక్కువైనా, చదువులో మంచి శ్రద్ధ, కష్టపడి చదివే ఓపిక ఉండడం వల్ల తనెప్పుడూ చాలా మంచి మార్కులు తెచ్చుకునేది.

మేమిద్దరం కలిసి చదువుకున్నంత కాలం ప్రతి విషయానికీ తను నాతో సంప్రదింపులు జరిపేది. అసలు తను అడక్కపోయినా నేను ఉచిత సలహాలిచ్చేదాన్ని. నా మాట వినడం వల్ల ఎక్కువసార్లు తనకు మేలు జరగడంతో నీలిమ స్వయంగా ఏ పనీ తలపెట్టేది కాదు.

బి. ఏ. అయ్యాక ఇద్దరం ఇంగ్లీష్ లిటరేచర్‌లో ఎం. ఏ.లో చేరాం. ఫైనలియర్లో ఉండగా నీలిమకు వాళ్ళ నాన్న పనిచేసే బ్యాంకులో కొత్తగా క్లర్కుగా వచ్చిన సురేష్‌తో పరిచయమైంది. ఆ పరిచయం - ఇద్దరూ అప్పుడప్పుడు హోటళ్ళకెళ్ళడం, అతను వాళ్ళింటి కొచ్చి గంటలకొద్దీ కబుర్లు చెప్పడం వరకు వెళ్ళింది. వాళ్ళ స్నేహాన్ని నేను మొదట్నుంచి గమనిస్తూనే ఉన్నాను. అది స్నేహంగా మాత్రమే ఉన్నంతకాలం ఫరవాలేదనిపించింది. కానీ నేను అనుమానించినట్టుగానే అది అక్కడితో ఆగలేదు.

ఒక రోజు మధ్యాహ్నం క్లాసులైపోగానే నీలిమ లైబ్రరీ కెళ్దాం రమ్మంది.

'' ఈ రోజు రెఫరెన్స్‌వర్క్ చేసే ఓపిక లేదు నీలూ '' అన్నాను.

'' దానికోసం కాదు. నీకో విషయం చెప్పాలి'' నీలిమ అంది.

ఇద్దరం లైబ్రరీ కెళ్ళి, చుట్టుపక్కల ఎవ్వరూ లేని ప్రదేశంలో కూర్చున్నాం.

'' ఊఁ ఏమిటి? '' నీలిమ ఎంతసేపటికి మాట్లాడకపోయేసరికి నేనే అన్నాను.

''ఎలా చెప్పాలో తెలీడం లేదు.....నీకు సురేష్ తెలుసు కదూ....'' ఆగింది. నాకు అర్థమైంది. ఇలాటి సంభాషణలన్నీ ఇలాగే ప్రారంభమౌతాయి. వెంటనే అందుకుని అన్నాను.

'' అతను, నువ్వు ప్రేమించుకుంటున్నారు. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు. అవునా? ''

తలెత్తి ఆశ్చర్యంగా చూసిన నీలిమ కళ్ళలో ప్రశంస కనిపించింది. చిన్నగా నవ్వి అంది —

'' అసలు నీ కింతవరకు తెలీదనుకోవడం నా తెలివి తక్కువతనం '' అని - అంతలో సీరియస్‌గా మారిపోయింది. '' కానీ.... అతను నన్ను ప్రేమిస్తున్న మాట నిజమే. నేను మాత్రం .... ఇప్పటి వరకు అతన్ని స్నేహితుడిగా మాత్రమే భావిస్తున్నాను. మొన్న అతను ప్రపోజ్ చేసినప్పుడు ఏమనాలో తెలీలేదు.'' ఒక్కక్షణం ఆగింది. నేను ఆత్రంగా, ''ఒప్పేసుకున్నావా?'' అని అడిగాను.

నీలిమ తల అడ్డంగా తిప్పింది.

''ఊహూఁ, ఇంకా లేదు. కానీ ఒప్పుకుందామనే అనుకుంటున్నాను. ఆ పని చేసే ముందు నీకోసారి చెపుదామని....''

నేను తన చివరి మాటలతో తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాను. ఈ మాట కోసమే ఎదురు చూస్తున్నాను. తనిలా అంటుందని నాకు తెలుసు. తేలిగ్గా నవ్వేస్తూ అన్నాను.

'' ఇంకా మాటివ్వలేదు కాబట్టి ఫర్వాలేదులే. ''

''అంటే'' అయోమయంగా చూసింది.

''అంటే ఏముంది? నీ కిష్టం లేదని చెప్పేయ్''

ఇప్పుడు అనిపిస్తుంది —'నీలిమ తన జీవితంలో అత్యంత ముఖ్యమైన సమస్య నెదుర్కొంటున్నప్పుడు నేనంత తేలిగ్గా ఎలా మాట్లాడగలిగానా' అని.

నీలిమ చివ్వున తలెత్తి చూసి, నెమ్మదిగా అంది. ''కానీ....నా కిష్టంలేదని నేను అనలేదుగా!''

నేను ఒక్క క్షణం తన కేసి తీక్షణంగా చూశాను. తర్వాత ముందుకు వంగి, అడిగాను.

''నీలూ. నీకు చదువుమీద చాలా యిష్టం కదూ.''

'' అవును ''. 'దానికీ దీనికి సంబంధమేమిటన్న' భావం ధ్వనింపజేస్తూ అంది.

''ఎం. ఏ. తర్వాత ఏం చెయ్యాదల్చుకున్నావు?''

''రీసెర్చ్'' 'నీకు తెలీదా' అన్నట్టంది.

''అవునా? అయితే సురేష్‌నెలా చేసుకుంటావ్!''

నీలిమ నా కేసి వింతగా చూసింది.

''ఏమిటి నువ్వనేది? ఎంతమంది రిసెర్చ్ పెళ్ళయ్యాక చెయ్యడం లేదు?''

నాకు కోపం, నవ్వూ రెండూ వచ్చాయి.

''అది కాదు, నీలూ. నేను చెప్పేది కొంచెం విను. సురేష్ ఏం చదివాడు? ఆఫ్టరాల్ బి. యస్. సి. నువ్వు పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేస్తున్నావు. రిసెర్చ్ కూడా చెయ్యాలనుకుంటున్నావు.'' నా మాట పూర్తి కాకముందే నీలిమ ఎర్రబడ్డ ముఖంతో అంది.

''నాకు అలాంటి భావమే లేదు. నా కంటె తక్కువ చదివిన వ్యక్తిని చేసుకోవడం నాకేం చిన్నతనంగా అనిపించదు.''

''నేను చెప్పేది పూర్తిగా విను నీలూ'' ఓపిగ్గా అన్నాను. ''ఇప్పుడు నీకు అభ్యంతరం ఉందని కాదు నేను చెప్పడం. సురేష్‌వైపు నుంచి కొంచెం ఆలోచించు. ఏ మగవాడికీ తన భార్య తనకంటె



# లోకజ్ఞానం

1. భూమి మీద నుంచి అంతరిక్షంలోకి మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహాన్ని ప్రవేశ పెట్టిన దేశం ఏది? ఏ సంవత్సరంలో?

2. ఇటీవల ఉత్తర భారతదేశాన్ని వరదలు, గాలివాన ముంచెత్తాయి. అలా ఏర్పడిన గాలి వాన తీవ్రత ఇంత అని కొలిచినట్లు చెబుతూ వుంటారు శాస్త్రజ్ఞులు. అయితే ఈ గాలివాన తీవ్రతను ఏవిధంగా కొలుస్తారో చెప్పగలరా? ఆ కొలమానం కనిపెట్టిన వ్యక్తి ఎవరు?

3. మనదేశంలో ఐదేళ్ళకొకసారి రాష్ట్రపతి ఎన్నికలు జరుగుతూ వుంటాయి. కాని యూరోప్‌లో ఒకదేశం తమ అధ్యక్షుని వరుస క్రమంలో సంవత్సరానికొకసారి ఎన్నుకుంటుంది. ఆ దేశం ఏది?

4. ప్రపంచంలోకల్లా ప్రప్రథమ 'న్యూక్లియర్ రియాక్టర్' ఎక్కడ, ఎప్పుడు నిర్మింపబడింది?

5. నవంబరు 11, 1918 ఉదయం పదకొండు గంటలకి ప్రపంచ ప్రజలందరూ స్వేచ్ఛగా వూపిరి పీల్చుకున్నారు. కారణం ఆ రోజు సరిగ్గా ఆ సమయానికి మొదటి ప్రపంచ యుద్ధం అంతమైంది. ఆరోజు ఏమని పిలువబడుతోంది?

6. మొదటి తెలుగు – ఇంగ్లీషు నిఘంటువు ఏ సంవత్సరంలో ప్రచురింపబడిందో చెప్పగలరా?

7. పాఠశాలలోనూ, కళాశాలల్లోనూ చదివిన విద్యార్థులు తాము చదివిన విద్యాలయాలను 'ఆల్మామాటర్' అని సంబోధిస్తూ వుంటారు. ఈ 'అల్మామాటర్' అంటే అర్థం ఏమిటి?

8. మన జాతీయ గీతం 'జన గణ మన....' అని అందరికీ తెలుసు. రవీంద్రనాధ ఠాగూర్ తను రాసిన ఈ జాతీయ గీతాన్నే ఆయన ఆంగ్లంలోకి అనువదించారు....దాని పేరేమిటి?

9. మైక్‌లలో మాట్లాడే మాటలను అతి స్పష్టంగా దూరంగా కూర్చున్న వారికి కూడా చేరవేస్తాయి లౌడ్ స్పీకర్లు. అయితే ఈ లౌడ్‌స్పీకర్‌ని కనిపెట్టిన వ్యక్తి ఎవరు? ఏ దేశస్థుడు?

10. ఉత్సవాలలోను, పెళ్ళిళ్ళలోనూ కూడా రికార్డు సంగీతం పెడుతూ వుంటారు. మరి ఈ గ్రామఫోను రికార్డును ఏ సంవత్సరంలో, ఎవరు కనుగొన్నారో చెప్పగలరా?

**[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. తెలియకపోతే, చూసి తెలుసుకోండి]**

అధికురాలు కావడం ఇష్టం వుండదు. అందులోనూ చదువు విషయంలో. తనతో సమానంగా చదివిన స్త్రీనే సహించలేని మగవాడు ఇక తనకంటె ఎక్కువ చదివిన అమ్మాయినెలా భరిస్తాడు?....''

''ఆ రోజులు పోయాయి మనూ. 'స్త్రీకి పురుషుడితో సమానమైన హక్కులు లేవ'ని ఇప్పటికీ చాలామంది అరుస్తున్నారు గానీ, నిజం చెప్పాలంటే చదువు విషయంలో ఆ భేదం పోయింది. పైగా, నేను తనకంటె ఎక్కువ చదువుకున్నానని సురేష్‌కు తెలీదేమిటి? అదేం కొత్త విషయం కాదుగా. నువ్వన్నట్టు ఈర్ష్యలాంటి భావాలు అతనికి వుంటే అసలెందుకు ప్రపోజ్ చేస్తాడు?''

''అక్కడే పొరబడుతున్నావు. పెళ్ళికి ముందు తెలిసినవే అయినా, పెళ్ళైన తర్వాత ఆ లోపాలు ద్విగుణీకృతమైనట్టు కనిపిస్తాయి. మనం రోజూ ఎన్ని సంఘటనలు చూడడం లేదు! మా పక్కింటాయన కోపం వచ్చినప్పుడల్లా భార్యను 'నా ఖర్మ కొద్దీ చింతమొద్దువి దొరికావ్' అంటూంటాడు. ఏం? ఆవిడ నల్లగా ఉన్నట్టు పెళ్ళి చూపుల్లో తెలీ లేదా? అప్పుడు ఊరుకున్న మనిషి ఇప్పుడెందు కేడవడం?''

ఒక్కక్షణం ఆగి, ఆవేశాన్ని దిగ మింగుకుని మళ్ళీ అన్నాను. ''ఒక విషయం చెప్పనా, నీలూ? పెళ్ళయ్యాక అందరూ మారి పోతారు. ముఖ్యంగా మగవాళ్ళు. లోకం తన గురించి, తన భార్య గురించి ఏమనుకుంటోందో అనే చింత ప్రతి మగవాడికీ ఉంటుంది. ఇప్పుడు నీ విషయమే తీసుకో. మీరిద్దరూ స్నేహితులుగా ఉన్నంతకాలం ఎవ్వరూ మీ డిగ్రీలను పట్టించుకోరు. అదే పెళ్ళయ్యాక చూడు. 'మీ ఆవిడ ఎం. ఏ. అటగా' అనో 'మీ కంటె ఓ డిగ్రీ ఎక్కువే చదివిందన్నమాట' అనో, 'ఎంతైనా ఈ కాలం ఆడవాళ్ళు చదువులో మనకంటె నయం' అనో—ఏదో అంటుంటారు. ఇంకొకటి కూడా ఆలోచించు. ఇంత చదివాక నీకు ఇంట్లో కూర్చో బుద్దేస్తుందా? ఎలానూ ఫస్ట్ క్లాసులో ప్యాసవుతావు కాబట్టి లెక్చరర్ ఉద్యోగం సులభంగానే వస్తుంది. బ్యాంక్ క్లర్క్ హోదా, లెక్చరర్ హోదా కంటె తక్కువని నేను నీకు చెప్పనక్కర లేదుగా?'' నేను మాట్లాడుతున్నంతసేపూ నీలిమ ముఖంలోకి రెప్ప వాల్చకుండా చూస్తున్నాను. నేను వూహించినట్టుగానే తన మొహంలో అంతవరకు ఉన్న ధీమా తగ్గింది. నా మాటలు జాగ్రత్తగా వింటున్నట్టు కనిపించింది. తిరిగి అన్నాను. ''ఇవన్నీ నువ్వు ఆలోచించలేదు కదూ. ఒక్క మాట నీలూ. స్నేహితుల మధ్యగానీ, భార్యాభర్తల మధ్యగానీ ఈర్ష్య అనే భావం ఒకటొస్తే ఇక ఆ బంధం నిలవదు.'' ఇలా మాట్లాడుతుంటే నీలిమ కంటె నేనేదో చాలా పెద్దదానైపోయినట్టు అనిపించింది. అప్పటికీ నీలిమ ఏమీ మాట్లాడక పోయేసరికి మళ్ళీ అన్నాను. ''నువ్వే ఆలోచించు, నీలూ. సురేష్‌కు నువ్వంటే అసూయ కలగడానికి అవకాశం ఉందంటావా లేదా! అతను స్వతహాగా అలా ఆలోచించకపోయినా స్నేహితులు అతన్ని బతకనివ్వరు. భార్యకంటె భర్త ఎందులో తక్కువైనా— ఒక అందంలో తప్ప, అనుకుంటూ— లోకానికి అది చాలా నీచంగానే అనిపిస్తుంది.... ఇక నీ రిసెర్చ్‌కి తిలోదకాలిచ్చుకోవాల్సిందే.''

నీలిమ వంచిన తల ఎత్తలేదు. దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టుంది. కాస్సేపు ఇద్దరం నిశ్శబ్దంగా ఉండిపోయాం. తర్వాత తలెత్తి మెల్లిగా అంది.

''నువ్వు చెప్పింది సమంజసంగానే వుంది కానీ....సురేష్ అలాటివాడు కాదనిపిస్తుంది

మనూ. ప్రపంచంలో మగవాళ్ళందరూ ఒకేలా ఉంటారా ?''

నాకు చిరాకేసింది ఈ ప్రశ్నకు.

''బావుంది. సురేష్ అందరిలాంటి వాడేనా కాదా అని ఎక్స్‌పెరిమెంట్ చెయ్యడానికి అతన్ని పెళ్ళి చేసుకుంటావేమిటి ? అసలతను అలాటివాడు కాదని మాత్రం నీకేం నమ్మకం ? ఏదో నాలుగు కబుర్లు నవ్వుతూ చెప్పినంత మాత్రాన మనిషి స్వభావం తెలిసిపోదుగా ?'' అన్నాను. 'కొంత కాలంగా పరిచయమున్న సురేష్ స్వభావమే తెలీదంటే, ఎవడో ముక్కు, మొహం తెలీనివ్యక్తి రేపొద్దున్న వచ్చి నన్ను ఉద్ధరిస్తాడని నాకేం నమ్మకం' అనిగానీ నీలిమ అప్పుడనివుంటే నేనేం జవాబివ్వలేకపోయేదాన్ని. కానీ తనలా అనలేదు. నేనేమన్నా వినడమేగానీ, తిరిగి మాట్లాడడం నీలిమకు చేతకాదు. అసలింతవరకు వాదించడమే గొప్ప. కాస్సేపు ఇద్దరం నిశ్శబ్దంగా ఉన్నాక, నేను మాటమార్చే ఉద్దేశంతో అడిగాను.

''అమధ్యెప్పుడో చెప్పావు ఒక ఐ. ఏ. ఎస్. ఆఫీసర్ గురించి. మీకు దూరం చుట్టం కూడా ననుకుంటా. మీ అమ్మావాళ్ళు ఆ సంబంధం చూస్తున్నారన్నావ్....''

నీలిమ మాట్లాడలేదు. తర్వాత తనన్న మాటలను బట్టి చూస్తే అంతకుముందు నేనడిగింది విన్నట్టులేదు.

''సురేష్‌కెలా చెప్పను ?....మొన్న నేనేమీ చెప్పకపోయేసరికి, అదే అంగీకారంగా భావించాడేమో...అసలు నేనీ విషయం కొంచెం ఆలోచించుకోవాలి'' తనలో తను అనుకుంటున్నట్టుగా అంది. నేనిక సంభాషణ పొడిగించలేదు. అయినా, తను నా మాట వింటుందనే నమ్మకముంది.

*

రెండు రోజుల తర్వాత-ఆ రోజు సాయంత్రం నేను వరండాలో కూర్చుని ఏదో నవల చదువుతూండగా నీలిమ మా యింటికొచ్చింది. కాస్సేపు అవీ, ఇవీ మాట్లాడుకున్నాం. మేం మాట్లాడుతున్న విషయాలపై మాకే ఆసక్తి లేదు. తనే చెపుతుందని నేనూ, నేనడుగుతానేమోనని ఉద్దేశంతో కాబోలు తనూ జాప్యం చేస్తున్నాం. కాస్సేపటికి తనే అంది.

''నేను సురేష్‌ను చేసుకోనని చెప్పేసాను''. నా గుండెల మీద నుంచి పెద్ద బరువు దించినట్టైంది. కానీ నీలిమ కొంచెం బాధపడుతున్నట్టు కనిపించడంతో, నేను మనసారా సంతోషించలేకపోయాను.



## వేదవతీ ప్రభాకర్

''సాధారణంగా ఒక పాట ప్రజలను ఆకర్షించింది అంటే అందుకు ముఖ్య కారణం – సంగీతం అని నా అభిప్రాయం. లయబద్ధమూ, రాగయుక్తమూ అయిన సంగీతం పామరులను కూడా ఆకట్టుకుంటుంది. విన సొంపుగావుండి శ్రోతలను మైమరపింపజేస్తుంది. అలాగని సాహిత్యం పాటకి జీవం కాదు – అని నేను అనడం లేదు. కాని సాహిత్యం అర్థం కాని ఎన్నో పాటలు మనం విని ఆనందిస్తూనే వున్నాం కదా.'' అంటారు ప్రముఖ గాయకురాలు శ్రీమతి వేదవతి ప్రభాకర్.

శ్రీమతి వేదవతి స్వస్థలం బెంగళూరు. ఆమె బి. ఏ. పట్టభద్రురాలు. బెంగళూరులో ఆమె ఐదేళ్ళపాటు శ్రీమతి జి. చెల్లమ్మ వద్ద సంగీతం నేర్చుకున్నారు. శాస్త్రీయ సంగీతం అభ్యసించినా ఆమెకు లలిత సంగీతం మీద ఆసక్తి మెండు. అయితే 'శాస్త్రీయ సంగీతజ్ఞానం లేకపోతే స్వరాలు సరిగ్గా పలకవని, లలిత సంగీతానికి కూడా అది ఎంతో అవసరమని' అంటారు ఆమె.

శాస్త్రీయ సంగీతంలో ఆమె అభిమాన గాయకురాలు శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి.

హైద్రాబాదు ఆకాశవాణి కేంద్రంలో వేదవతి కంఠస్వరం తరచు వినిపిస్తూనే వుంటుంది. దూరదర్శిని కార్యక్రమాలలో కూడా ఆమె పాల్గొన్నారు. అంతేకాదు. ఆకాశవాణి ఏర్పాటు చేసే రంగస్థల కార్యక్రమాలలోనూ ఆమె తరచు పాల్గొంటూ వుంటారు.

''శాస్త్రీయ సంగీతం ప్రజలలో అంతగా ఆదరణ పొందకపోవడానికి కారణం ఏమిటి ?–అని ప్రశ్నిస్తే 'ఆదరణ ఎందుకులేదు? ఏ రకమైన సంగీతానికైనా దానికితగ్గ అభిరుచిగల శ్రోతలు ఎందరో వుంటూనే వుంటారు. ఎటొచ్చి సినిమా సంగీతమైతే తేలికగా పాడుకోవచ్చు. కాబట్టి అందరినోళ్ళలో నానుతూ వుంటుంది. అంతే,'' అన్నారు వేదవతి.

చక్కగా పాడిన ఏ పాట అయినా — తనకి యిష్టమని, జానపదాలు అయితే జీవితానికి దగ్గరగా వుంటాయని, దాని భావం నలుగురిని ఆకట్టుకునే విధంగా వుంటుందని–అందుకే ఆ పాటలంటే తనకి ప్రత్యేకించి యిష్టమని— చెప్పారు వేదవతి.

ఆమె భర్త శ్రీ ఆర్. ప్రభాకరరావు ప్రస్తుతం ఎ. పి. ఎస్. ఆర్. టి. సి. లో జనరల్ మేనేజర్‌గా వుంటున్నారు. వారికి ఒక కుమారుడు వెంకటేష్, కుమార్తె ప్రేమ. వెంకటేష్ సితార్ వాద్యం నేర్చుకుంటున్నాడు. ప్రేమ శాస్త్రీయ సంగీతం అభ్యసిస్తోంది. భర్త, స్నేహితులు యిస్తున్న ప్రోత్సాహం తనకి ఎంతో వుత్సాహాన్ని కలుగజేస్తోందంటారు వేదవతి.

శ్రీ సి. నారాయణరెడ్డి రాసిన 'మీరా భజన్' ఆమె గానం చేయగా ఇటీవల రికార్డు రూపంలో విడుదలయింది. అది విన్న కొందరు సంగీత దర్శకులు తమ చిత్రాలలో అవకాశం యివ్వడానికి ముందుకు వచ్చారు. చలన చిత్రాలలో పాడడం పట్ల తనకు వుత్సాహం వుంది కాని— అందుకోసం ప్రత్యేకించి ప్రయత్నమేదీ చెయ్యలేదు— అంటారు ఆమె.

భవిష్యత్ కార్యక్రమాల గురించి ప్రశ్నించగా– ''ఈ రంగంలో కృషి చేసి పేరు తెచ్చుకోవాలని వుంది. కాని అవకాశాలు వచ్చినప్పుడే కదా ఆశయాలు ఫలిస్తాయి ప్రస్తుతానికి ఆకాశవాణి ద్వారా లభ్యమవుతున్న అవకాశాలు నాకు ఎంతో వుత్తేజాన్ని, వుత్సాహాన్ని యిస్తున్నాయి. నిజానికి నేను ఈనాడు ఒక స్థాయికి చేరుకోవడానికి కారణం ఆకాశవాణి అందించిన ప్రోత్సాహమే. అందుకు ఆకాశవాణికి నేను ఎంతో ఋణపడి వున్నాను'' అంటారు శ్రీమతి వేదవతి ప్రభాకర్. —భార్గవి

క్రమంగా ఇద్దరం పరీక్షల గొడవలోపడ్డాం. నీలిమ సురేష్‌ను గురించి పెద్దగా ఆలోచించడం లేదని గ్రహించి, తేలిగ్గా ఫీలయ్యాను.

ఒక రోజు నీలిమ ఇంట్లో కూర్చుని చదువుకుంటూండగా, వాళ్ళమ్మ వచ్చి నీలిమకు పెళ్ళి నిశ్చయమైందని చెప్పారు. నాకు చాలా సంతోషం అనిపించింది.

"ఎవరండీ అతను?" కుతూహలంగా అడిగాను.

"ఒకసారి నీకు చెప్పాననుకుంటా........ మా చుట్టాలబ్బాయే. మొన్ననే ఐ. ఏ. ఎస్. పాసయ్యాడు....బాగా ఉన్నవాళ్ళు" ఆవిడ చెప్పుకుపోతోంది. నేను చప్పున నీలిమ కేసి చూసాను. తన మొహం ప్రసన్నంగా ఉంది. 'హమ్మయ్య' తృప్తిగా అనుకున్నాను. నేనేదో పెద్ద ఘనకార్యం చేసినట్టనిపించింది. 'సురేష్‌తో తన వివాహాన్ని ఆపేసి ఎంత మంచి పని చేసాను! ఇప్పుడు తన విద్యకు తగిన వరుడు దొరికాడు నీలిమకు. తను రిసెర్చ్ చెయ్యడానికి కూడా అవకాశం ఉంది. భార్యాభర్తల మధ్య 'ఇంటలెక్చువల్ ఈక్వాలిటీ' ఉండాలని నా గాఢవిశ్వాసం. భర్త ఐ. ఏ. ఎస్. ఆఫీసర్-భార్య ఎం. ఏ. పి. హెచ్. డి-ఆ జంట ఎంత ముచ్చటగా ఉంటుంది! అంత విద్యావంతుడైన వ్యక్తి నీలిమ ఆశయాలకు అడ్డురాడు.' నీలిమ కంటె ఎక్కువగా నేనే ఊహల్లో తేలిపోయాను.

తర్వాత నీలిమతో ఈ విషయం మాట్లాడినప్పుడు తను చాలా సంతోషంగా ఉన్నట్లనిపించింది. భవిష్యత్తులోకి ఆశతో, ఉత్సాహంతో ఎదురు చూడసాగింది.

పరీక్షలైన నెల రోజులకే నీలిమ పెళ్ళి అయిపోయింది. ఆ తర్వాత కొన్ని రోజులకే తను భర్తతో వైజాగ్ వెళ్ళిపోయింది.

నీలిమ పెళ్ళైన 6 నెల్ల తర్వాత —

ఆ రోజు నేను వాళ్ళమ్మగార్ని పలకరిద్దామని వెళ్ళాను. కొంతసేపు మామూలు కబుర్లు చెప్పుకున్నాక అడిగాను, "నీలిమ రిసెర్చికి అప్లై చెయ్యలేదేమండీ! టైం కూడా అయిపోనట్టుంది...."

ఆవిడ నా వేపొకసారి చూసి, "రిసెర్చ్ చెయ్యదటమ్మా. వాళ్ళాయనకి యిష్టం లేదట." అంది. నేను నిర్ఘాంతపోయాను. ఆవిడ దాన్నంత ముఖ్య విషయంగా భావించలేదు కాబోలు ఏవో వేరే విషయాలు చెపుతోంది. కొద్దిసేపు మర్యాద కోసం వుండి, తర్వాత పనుందని చెప్పి ఇంటికి వచ్చేసాను.

నీలూ రిసెర్చ్ చెయ్యదన్న వార్త నమ్మశక్యం కాకుండా వుంది. తను నా ప్రోద్బలం మీదే బి. ఏ. లో చేరినా, త్వరలోనే ఇంగ్లీష్ లిటరేచర్ పై ఆసక్తి పెంచుకుంది. మేమిద్దరం ఎలాగైనా సరే ఎం. ఏ. చేసి రిసెర్చ్ చెయ్యాలని ఆ రోజుల్లోనే నిశ్చయించుకున్నాం. అసలు సురేష్‌ను తిరస్కరించడానికి కూడా ముఖ్య కారణం రిసెర్చ్‌కి తను అంగీకరించడేమో నన్న అనుమానం నీలిమకు కలగడమేనని నాకు తెలుసు. ఒక కవి రచనలు అంశంగా రిసెర్చ్ చెయ్యడం, ఒక మంచి లెక్చరర్‌గా పేరు తెచ్చుకోవడం నీలిమ ఆశయాలు. 'వాళ్ళాయనకి యిష్టం లేదట' నీలిమ వాళ్ళమ్మ మాటలు గుర్తొచ్చి, నా మనసంతా చికాకై పోయింది. పెళ్ళి ముందు నీలిమ తన ఆలోచన్ల గురించి, ఆశయాల గురించి చెప్పడానికి వీలు కా లేదా? ఏమో. పరీక్షల గొడవలో నేనప్పుడు పెద్దగా పట్టించుకోలేదు.

ఆ మరుసటి రోజూ నాకు నీలిమ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ఆత్రంగా విప్పి చదివాను.

ప్రియమైన మనూ,

ఉపోద్ఘాతం లేకుండా నేను నీకు కొన్ని విషయాలు చెప్ప దలుచుకున్నాను.

మనూ, నాకీ మధ్య సురేష్ తరచు జ్ఞాపకం వస్తున్నాడు. అతననేవాడు 'పొయిట్రీలో రీసెర్చ్ చేస్తాననేదానివి, ఎక్కువ డిటెక్టివ్ నవలలు చదువుతావేం, నీలూ' అని. అతనలా మందలించినప్పుడు సీరియస్‌గా పొయిట్రీ చదివేదాన్ని. ఇప్పుడాబెడదలేదు. నేను ఇష్టం వచ్చినట్లు నవలలు చదువుకోవచ్చు. నేనసలేమీ చదవకపోయినా ప్రశ్నించేవాళ్ళు లేరు. పైగా చదవకపోతే సంతోషిస్తారు కూడా. ఏమిటిలా తల తిక్కగా రాస్తున్నాననుకుంటున్నావా, మనూ? నీకు తెలుసు-నాకు లెటర్స్ రాయడం చాతకాదని.

లెక్చరర్‌గా పనిచేస్తే పాఠాలు చెప్పడం కోసమైనా రకరకాల పుస్తకాలు చదవాల్సి వుంటుంది. కానీ, నాకా బెడద కూడా లేదు. ఐ. ఏ. ఎస్. ఆఫీసర్ భార్యని. నాకేం ఖర్మ పాఠాలు చెప్పేందుకు?

అసలు ఇంకొకరికి పాఠాలు చెప్పే అర్హత నాకు లేదు, మనూ. నేనే ఇప్పుడిప్పుడు జీవిత మంటే ఏమిటో నేర్చుకుంటున్నాను. పెళ్ళయ్యాక రెండు విషయాలు నేను ప్రధానంగా తెలుసుకున్నాను-ఉన్నత విద్య నేర్చినంత మాత్రాన మనిషికి సంస్కారం, విశాల దృక్పథం ఉండనవసరం లేదని; ఎవరి జీవితానికి సంబంధించిన నిర్ణయాలు వాళ్ళే తీసుకోవాలి గానీ ఇంకొకరి సలహాలను గ్రహించకూడదని. కానీ మనూ, నేను నిన్ను నిందించడం లేదు. నీ మీద నాకేం కోపం లేదు. ఇది స్వయంకృతాపరాధం.

ఇంకేం వ్రాయను? నువ్వు చాలా తెలివైన దానివి. నేను స్పష్టంగా చెప్పలేకపోయినా అంతా గ్రహించే సామర్థ్యం నీకుంది.

నేను హాయిగా ఉన్నానని అమ్మకు చెప్పు. వంటవాడు వండింది తినడం, పడుకోవడం, అప్పుడప్పుడు సినిమాల కెళ్ళడం, వాళ్ళతో, వీళ్ళతో బాతాఖానీ వెయ్యడం - ఇంతకంటె నాకేం కావాలి?

జీవితాన్ని ఇప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నాన్నాను. దాన్ని భరించే శక్తిని నాకు దేవుడివ్వాలని ప్రార్థిస్తావా, మనూ?

— నీలిమ

నేను మెల్లిగా, జాగ్రత్తగా ఉత్తరాన్ని మడిచాను. నా కళ్ళ ముందు సురేష్ మెదిలాడు. ఒకప్పుడు చెక్కు చెదరని చిరునవ్వుతో, గలగలా మాట్లాడే సురేష్-ఇప్పుడు నవ్వడమే మరిచి పోయినవాడిలా, ఏ సరదాలూ లేకుండా రోజుల్ని గడిపేస్తున్నాడు.

నేను నీలిమతో సురేష్ విషయం మాట్లాడినప్పుడు చెప్పినవన్నీ నేను త్రికరణశుద్ధిగా నమ్మినవే. అప్పుడు చాలా హేతుబద్ధంగా వాదించాను. నిజమే. కానీ, మానవ స్వభావానికి హేతువాదంతో సంబంధముందా? 'ఉన్నత విద్యనభ్యసించిన వ్యక్తి తన జీవిత సహచరిణిలో అదే కోరుకోవాలి. మగవాడు తనకంటె విద్యాధికురాలైన భార్యను ద్వేషిస్తాడు' — ఇది నేను ప్రమాణాలుగా పెట్టుకున్నవి. హేతువాదం ప్రకారం అదలా జరగాల్సిందే. కానీ జరగలేదేం?

నేను సిద్ధాంతాన్ని నమ్మడం పొరబాటు కావచ్చు, కాకపోవచ్చు. కానీ నా నమ్మకాన్ని నీలిమ నిర్ణయంతో ముడిపెట్టడం పొరబాటు మాత్రమేనని సరిపెట్టుకోగలనా?

నీలిమ ఉత్తరంలో 'నువ్వు చాలా తెలివైన దానివి' అంది. నాకు నవ్వొచ్చింది. 'జూలియస్ సీజర్'లో మార్క్ ఆంటోనీ అంటాడు-"బ్రూటస్ ఈజ్ ఎన్ ఆనరబుల్ మాన్" అని. అలా వుంది నీలిమ మాటల్లో భావం. □



# బాస్కెట్ బాల్

మనదేశంలోని ప్రతి రాష్ట్రంలోనూ స్త్రీలకి ప్రత్యేకించి క్రీడా సమాఖ్యలు వున్నాయి. ఈ సమాఖ్యలన్నీ కూడా 'వనిత'లు క్రీడారంగంలో పైకి రావడానికి యింత కృషి చేశాం.... అంత చేశాం' అని చెబుతూ వుంటాయి. కాని – మన దేశంలో వనితలు అటు పరుగు పందాలలోగానీ, యిటు క్రికెట్, హాకీ, టెన్నిస్, వాలీబాల్, బాస్కెట్ బాల్ వంటి ఆటలలోగానీ ఏ మాత్రం ముందంజ వేయలేదన్నది నిర్వివాదాంశం. అందుకు కారణం తగిన వుత్సాహంగల క్రీడా కారిణుల కొరత ఎంతమాత్రం కాదు. ఇంతటి జనాభాగల విశాలవనిలో ఆ మాత్రం వనితలు కూడా లేరనడం హాస్యాస్పదమే అవుతుంది. మునుపటి రోజుల్లో అయితే స్త్రీలు గుమ్మందాటి బయటికి వచ్చేవారు కారు కాబట్టి ఆటలు–పోటీలు అనేవి పురుషులకే పరిమితమయ్యాయి. అనుకో వచ్చును. కాని నేడు స్త్రీలు అన్నివిధాలా ...అన్ని రంగాలలోనూ పురుషులతోపాటు సమాన స్థాయిని చేరుకుంటున్నారు. అందువల్ల క్రీడారంగంలో వనితలు అంతర్జాతీయ స్థాయికి చేరుకోకపోవ డానికి కారణం – అధికారుల నిర్లక్ష్యత, తగిన ప్రోత్సాహాన్ని కలుగజేయకపోవడమూ అన్నది స్పష్టంగా అవగాహన అవుతున్నది.

గత పది సంవత్సరాలుగా నేను అధిక కాలాన్ని బాస్కెట్‌బాల్ కోర్టులోనే గడిపాను. ఆరేళ్ళపాటు కేరళ రాష్ట్ర స్త్రీల బాస్కెట్ బాల్ జట్టులో వున్నాను. ఒక సంవత్సరం కేరళ విశ్వ విద్యాలయం జట్టుకి నాయకురాలిని కూడా. అందు వల్ల యితర క్రీడలకన్న బాస్కెట్ బాల్ గురించి నేను కొంతవరకు చెప్పగలను.

1970వ సంవత్సరంలో కౌలాలంపూర్‌లో ఆసియా ఆటల పోటీలు జరిగాయి. ఆ పోటీలలో భారతదేశం తరపున స్త్రీల బాస్కెట్ బాల్ జట్టు కూడా పాల్గొన్నది. అయితే ఆ జట్టు ఘోర పరాజయాన్ని పొందింది. అంతే. అప్పటినుంచి నేటివరకు మనదేశం తరపున ఏ అంతర్జాతీయ పోటీలలోనూ స్త్రీల బాస్కెట్ బాల్ జట్టు పాల్గొన లేదు. అలా పంపకపోవడమన్నది శోచనీయమైన విషయం. ఎందుకంటే ఈలోపల చక్కని క్రీడా కారిణులు ఎందరో వుద్భవించారు. ఉదాహరణకి మహారాష్ట్రకు చెందిన శుభాప్రభు. ఆమె-బాస్కెట్ బాల్‌కి మాతృదేశమైన అమెరికా దేశపు కోచ్ అలెగ్జాండర్ అమలేవ్‌వంటి వారి ప్రశంసలు పొందింది. కాని ఏం లాభం? .... అంతర్జాతీయ పోటీలలో పాల్గొన్నప్పుడే కదా అటువంటి వారి ఖ్యాతి నలుగురికి తెలిసేది. అంతే కాదు. అలా పాల్గొన్నప్పుడే మన క్రీడాకారిణుల ఆట కూడా మెరుగుపడుతుంది.

అయితే ఎక్కడో నూటికో, కోటికో ఒక్క శుభాప్రభు వుంటే చాలదు. అటువంటి క్రీడా కారిణులు మరెంతో మంది వుత్పత్తి కావాలి.

అసలు లోపం ఎక్కడ వుందీ అని ఆలోచిస్తే మనకి ఒక విషయం బోధపడుతుంది. మన దేశంలో స్త్రీలు ఈ బాస్కెట్ బాల్ ఆటని చాలా ఆలస్యంగా నేర్చుకోవడం ప్రారంభిస్తారు. తీరా వారు బాగా నేర్చుకున్నాక 'రిటైర్' అయ్యే వయసు వచ్చేస్తుంది. (సాధారణంగా ముప్పై– ముప్పై అయిదు దాటిన తరువాత క్రీడారంగంలో రిటైర్ వయసు క్రింద లెక్క).

అయితే యిందుకు కారణం ఏమిటీ అంటే – ఒక్క బాస్కెట్ బాల్ అనేమిటి—ఏ ఆట ఐనా నేర్చుకునేందుకు తగిన అవకాశాలు మనదేశంలో కళాశాలలో చేరిన తరువాతనే లభిస్తున్నాయి. పాఠశాలలో ఆ అవకాశాలు అరుదుగా వున్నా తగిన ప్రోత్సాహం, నేర్పించే వారు కూడా అరుదు గానే కనిపిస్తున్నారు. అలా కళాశాలల్లో నుంచి బయట పడిన తరువాత వారికి ఆ ఆట ఆడ డానికి బయట ప్రపంచంలో బాస్కెట్ బాల్ కోర్టులు ఏవి? – దాంతో చదువైపోగానే చాలా మంది బాస్కెట్ బాల్‌కి స్వస్తి చెబుతున్నారు. టెన్నిస్‌కైనా మహిళా మండలుల్లో 'కోర్ట్' లుంటాయిగానీ బాస్కెట్ బాల్‌కి మాత్రం ఎక్కడా లేవు.

అందువల్ల మనదేశంలో స్త్రీలు ఆట నేర్చు కోవడం కేవలం ఏ నాలుగైదేళ్ళకో పరిమితమై పోతోంది. దాంతో ఆ ఆటలో ప్రావీణ్యత సంపా యించడానికి, క్రొత్త పద్ధతులు నేర్చుకోవడానికి అవకాశం లేకుండా పోతోంది.

అదీగాక మనదేశంలో బాస్కెట్ బాల్ మట్టి నేలమీద ఆడుతున్నాం – అదీ బహిరంగ ప్రదే శాలలో ఏర్పాటు చేసిన 'కోర్ట్'ల మీద. కాని విదేశాలలో అలా కాదు. వారు చెక్కలతో చేసిన నేలమీద అంటే 'వుడెన్ కోర్ట్' మీద ఆడు తున్నారు. ఆ దేశాలలో అది 'ఇన్‌డోర్ గేమ్'. మట్టి కోర్ట్‌లకన్న వుడెన్ కోర్ట్‌ల మీదైతే కదలికలు త్వరితంగా వుంటాయి. ఆటలో వేగం హెచ్చుగా వుంటుంది. అందువల్లనే విదేశాలలో మన క్రీడాకారిణులు ఆడినప్పుడు వింతగా అను భూతి చెందడం జరిగింది.

ఈనాడు ప్రతి ఆటలోనూ వేగం హెచ్చుగా వుంటోంది. అలాగే బాస్కెట్ బాల్‌లో కూడా. అందుకు శరీర పటిష్ఠత ఎంతైనా అవసరం. మన క్రీడాకారిణులు కేవలం ఆట నేర్చుకోవడం లోనే కాక పోషకాహారం విషయంలో కూడా శ్రద్ధ తీసుకోవాలి. అలాగే ఔత్సాహిక క్రీడా కారిణులకు దీర్ఘకాలిక ప్రణాళికలతో శిక్షణావకా శాలు కల్పించాలి. చక్కటి ప్రోత్సాహమూ, ఆదరణ వుంటే మన దేశపు క్రీడాకారిణులు కూడా అంతర్జాతీయ ఖ్యాతి పొందుతారు.

చివరిగా ఒక్కమాట – 'విదేశాలకు వెళ్ళడం ఘోరపరాజయంతో తిరిగి రావడం మన క్రీడా కారిణులకు అలవాటైపోయింది' అని విమర్శిస్తూ వుంటారు అధికారులు. అందువల్ల విదేశీమారక ద్రవ్యం కూడా అనవసరంగా ఖర్చవుతున్నదని వాపోతూ వుంటారు. కాని సాధారణంగా చీటికి మాటికి విదేశాలకు వెళుతూ వుంటారు ఈ అధి కారులు. అందువల్ల ప్రయోజనం వున్నా లేక పోయినా. విదేశీ మారకద్రవ్యం అప్పుడుమాత్రం వ్యర్థం కావడం లేదా? కళాకారులను, క్రీడా కారులును, 'సాంస్కృతిక రాయబారుల'ని అంటూ వుంటారు. వారు ఆ విధంగా విదేశాలకు వెళ్ళడం వల్ల సుహృద్భావం పెంపొందడమే కాక, ఆటలో ప్రావీణ్యత సంపాయించడానికి కూడా దోహదకారి అవుతుంది. ఏ ఆట ఐనా ఆడగా ఆడగా రాట దేలుతుందికదా. కాబట్టి ఈసారి ఐనా వచ్చే నెలలో జరుగబోయే–ఆసియా ఆటల పోటీలలో – మన దేశం నుండి స్త్రీల బాస్కెట్ బాల్ జట్టు పాల్గొనడానికి అనుమతి లభిస్తుందని ఆశిద్దాం. □

—సూనమ్మ జాన్

# నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నాయా? తగ్గుతున్నాయా?

ఈ మధ్య ఏది చూసినా కొందామంటే కొరివిగా వుంది; ఏది కొందామన్నా ధర చూడగానే వెనకంజ వెయ్యాల్సి వస్తోంది. మునుపటి రోజుల్లో సంచి నిండుగా వచ్చే కూరలు, పప్పుదినుసులు మొదలైన నిత్యావసర వస్తువులు ఈ నాడు అదే వెలకి సంచికి సగానికి కూడా రావడం లేదు. పోనీ దేశం ఎంతో ప్రగతి సాధించింది; ప్రజల సగటు ఆదాయం బాగా పెరిగింది—అనుకుంటే అదీ లేదు. నిజానికి రోజు రోజుకీ సామాన్య మానవుల స్థితి దుర్భరమవుతోంది. 'ధరలను అదుపులో పెట్టడానికి ఎన్నో చర్యలు తీసుకుంటున్నాం' అని అప్పుడప్పుడు ప్రభుత్వం ప్రజల్ని వూరడించడానికి పత్రికా ప్రకటనలు చేస్తూ వుంటుంది. కాని అలా చర్యలు తీసుకుంటున్నా ధరలు పెరుగుతున్నాయా, నల్లబజారు నానాటికీ వికృతరూపం దాలుస్తోందీ అంటే ఎక్కడో ఏదో లోపం వున్నదన్న విషయం స్పష్టంగా అవగాహన అవుతోంది కదా.

'తుపాను, వరదలు వచ్చాయి. పంటలు పోయాయి. దాంతో వెలలు పెరిగాయి' అని కొందరంటూ వుంటారు. ఐతే మనదేశంలో సాధారణంగా ఒకసారి దేని వెల అయినా పెరిగితే అది తగ్గడమంటూ వుండదు. అందుకు ఒక చిన్న వుదాహరణ. ఆ మధ్య ఎప్పుడో నాలుగైదేళ్ల క్రితం కుంభకోణంలో తుపాను తాకిడికి తమలపాకుల పంట నష్టపోయింది. దాంతో అంతవరకు నలభై పైసలు వున్న తమలపాకుల కట్ట ఎనభై పైసలకు చేరుకుంది. ఆ తరువాత అక్కడ వరదలు, వర్షాలు విపరీతంగా ఎన్నడూ రాలేదు. పంటా బాగుంది. కాని ఆ వెల మాత్రం తగ్గలేదు! 'పెరుగుట తరుగుట కొరకే' అంటారు. కాని ఆ సామెత మన ధరల పట్ల వర్తించదన్నమాట!

ఒక ఉదాహరణ :

డిసెంబర్ 15, 1975 'వనిత' లో 'నిత్యావసర వస్తువుల ధరల పట్టిక' ప్రచురించారు. అందులో మద్రాసు కామధేను సూపర్ మార్కెట్ ధరల పట్టిక యివ్వబడింది. అదే సూపర్ మార్కెట్‌లో అప్పటికి యిప్పటికి ధరలలో ఎంత తేడా వుందో ఈ పట్టిక చూస్తే తెలుస్తుంది.

| | | డిసెంబర్ '75 | అక్టోబర్ '78 |
|---|---|---|---|
| | | రూ. పై. | రూ. పై. |
| కందిపప్పు | 1 కిలో | 3-26 | 6-10 |
| మినపప్పప్పు | .. | 3-36 | 4-80 |
| సెనగపప్పు | .. | 3-10 | 3-70 |
| పెసరపప్పు | .. | 2-70 | 4-56 |
| వేరుసెనగనూనె | ,, | 6-30 | 7-40 |
| జీడిపప్పు | .. | 22-10 | 35-00 |
| ఆవాలు | 100 గ్రాములు | 0-35 | 0-57 |
| మెంతులు | .. | 0-32 | 0-39 |

## వినియోగదార్ల సమస్యలు

మనం నిత్యం ఏదో ఒక వస్తువు కొంటూనే వుంటాం. అలా కొన్న వాటిల్లో ఒక్కోసారి కొన్ని పాడయిపోయినవి, పురుగులు పట్టినవి—అలా వుంటూ వుంటాయి. అందుకు కారణం తయారీలో లోపం కావచ్చు. ప్యాకింగ్‌లో నిర్లక్ష్యత కావచ్చు. ప్రముఖ సంస్థలు తయారు చేసే వస్తువులలో కూడా యిటువంటివేవో జరుగుతూనే వుంటాయి. ఇలాంటి సమస్యలే మీరూ ఎదుర్కొంటూ వుండవచ్చును. అలాంటివేవైనా జరిగితే—(ఏ వస్తువైనా సరే) వాటిని 'వినియోగదార్ల సమస్యలు' అన్న శీర్షికకు పంపవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాము. సమస్యలు పంపేటప్పుడు వస్తువు పేరు, లోపం ఏమిటి, ఎక్కడ, ఎప్పుడు కొన్నది, కంపెనీ పేరుతో సహా పూర్తి వివరాలు రాయాలి. వివరాలు పూర్తిగా ఇవ్వకపోతే, ఆ సమస్యను ప్రచురించడం సాధ్యపడదని మనవి చేస్తున్నాము.

—వ. సం,

ఇలా జాబితా వేస్తూపోతే, ఎన్నో కనిపిస్తాయి!

ప్రభుత్వం నిత్యావసర వస్తువుల ధరలు తగ్గాయని ప్రకటనలు చేస్తూనే వుంది. ధరలనూ, వ్యాపారస్తులనూ అదుపులో వుంచుతామని అంటూనే వుంది. కాని ఏ ఒకటో, అరో తప్పించి అన్నిటి ధరలూ పెరుగుతూనే వున్నాయి.

మరి మహిళామండలులూ, లేడీ లయన్స్ క్లబ్‌లూ ఏం చేస్తున్నట్లు?

'సభలూ, సన్మానాలు జరిపాం. వంటల పోటీలు, అల్లికల పోటీలు నిర్వహించాము—ఏదో నలుగురు పిల్లలకి బొమ్మలు పంచిపెట్టాం. విటమిన్లు పంచాం' అంటూ పత్రికలలో ఫోటోలు చూసి మురిసిపోవడమే ధ్యేయంగా పెట్టుకోకుండా—ఈ మహిళా సమాఖ్యలు పెరుగుతున్న ధరలను ఎలా అదుపులో పెట్టడం అన్న విషయం కూడా ఆలోచించాలి.

కేవలం స్త్రీలకు వినోదాన్ని అందించేందుకూ, వారిలోని కళలను ప్రోత్సహించేందుకే ఈ సమాఖ్యలు వుపయోగపడుతున్నాయి. కాని స్త్రీలను చైతన్యవంతం చేసేందుకు, వారికి సామాజిక స్పృహ కలిగించేందుకు కూడా ఇవి ప్రయత్నించాలి.

ఈ సమాజాలు—ధరల పెరుగుదలను అరికట్టడానికి తగ్గ వుద్యమాలు లేవదియ్యాలి. ప్రభుత్వానికి ఈ విషయంపై తమ నిరసన తెలియజేయడానికి ప్రయత్నించాలి.

రాష్ట్రస్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ, మహిళామండలులూ, స్త్రీ సమాఖ్యలూ, లయన్ లేడీస్ క్లబ్‌లు సంఘటితమై ప్రతి వూళ్ళోనూ వినియోగదార్ల వుద్యమాలు—ప్రారంభించాలి. ఎప్పటికప్పుడు ధరల పెరుగుదలల గురించి, కల్తీల గురించీ ప్రభుత్వానికి తెలియజేస్తూ వుండాలి. అప్పటికిగాని ఆకాశాన్నంటుతున్న ఈ ధరలు అదుపులోకి రావు! రావు!

—తోపల్లి నిర్మల

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 41' చందమామ బిల్డింగ్స్. మద్రాసు – 600 026 చిరునామాకు నవంబర్ నెలాఖరులోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 జనవరి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. ప్రస్తుతకాలం
2. తదుపరిలో జాలం వుంది
3. కొన్ని సందర్భాల్లో భార్య వహించేది
4. పాము పట్టేది
5. వంటశాల్లో వాడే గింజలు
6. భూమిలో పండే పద్యం?
7. బలహీనత వల్ల తిరగబడిందా!
8. ఒక్క పలుకు
9. సూర్యుడు లేకపోతే లేదు; ఉన్నా ఇప్పుడు తిరగబడింది.
10. దావి దగ్గర కనిపించేదీ; చిన్నపిల్లల దగ్గర కనిపించేదీ ఒకటేనా?
11. మధ్యలో వున్న గుడి తొలగాలి; కొమ్ము కల గాలి - అప్పుడు అక్షరాల మార్పుతో చిన్న గుహలాంటిది బయటపడుతుంది.
12. చిన్నపిల్ల
13. మధ్యలో జారిపోయిన మేనల్లుడు
14. తొమ్మిది అర్థంతో కచ్చితంగా సంబంధం గలవాడు.

### ఆధారములు – నిలువు

2. ఆ, బయల్దేరు అంటే ప్రమాదమా!
5. నాలుగు కోసుల దూరం అంటే ఎంత?
6. శీతల బాధను నిరోధిస్తుంది.
8. సప్త ఋషులలో ఒకరి భార్య
11. ముపత్సరు
12. నేలమీదా నీటిమీదా నడవగలిగేది
13. గొప్పవాడు
15. అట్నుంచి చదివితే ఇంటితో సంబంధం గలది తెలుస్తుంది.
16. సాధు జంతువు
17. విచారం
18. చివరి అక్షరంలోని కొమ్ము కొట్టేసి, అక్షరాల్ని పేరిస్తేగాని, బంగారపు చోట్లు దొరకవు.
19. పండుతుంది – గోరింటాకు కాదు.
20. నోటికి తగిలితేనే ఇదవుతుందిగాని, చేతికి తగిలితే కాదు!
21. ఫలకం తేలిగ్గా వుండబట్టే చెల్లాచెదురైందా!
22. అటూ ఇటూ ఎగిరిన పిట్ట

## వనిత మాటల కొలువు - 41
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 15 | ■ | 16 | ■ | 2 | 17 | |
| ■ | 3 | 18 | | ■ | 4 | | ■ |
| 5 | | | ■ | 6 | | ■ | 19 |
| | ■ | 7 | | | ■ | 8 | |
| 9 | 20 | ■ | ■ | | ■ | | ■ |
| ■ | 10 | 21 | | ■ | 11 | | 22 |
| 12 | | | ■ | 13 | | ■ | |
| | ■ | 14 | | | | | |

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________

______________________________

______________________________

# వార్తా వనిత



గుంటూరు లయన్ లేడీస్‌క్లబ్ 1978–79 సంవత్సరానికి అధ్యక్షురాలుగా శ్రీమతి పి. లక్ష్మి కృష్ణన్, కార్యదర్శిగా శ్రీమతి కె. లక్ష్మి నిర్మల్, ఉపాధ్యక్షురాలుగా శ్రీమతి యస్. రమణకుమారి, కోశాధికారిగా శ్రీమతి వాయసుత ఎన్నికయ్యారు. పై చిత్రంలో వారితో పాటు యితర కార్యవర్గ సభ్యులు కూడా వున్నారు.



1. హైద్రాబాదు నృత్య నికేతన్ తరఫున కుమారి జి సరళ ఇటీవల తాడేపల్లి గూడెంలో కూచిపూడి నాట్య ప్రదర్శనలు యిచ్చారు. కుమారి సరళ ఆ మధ్య హవానా (క్యూబా)లో జరిగిన అంతర్జాతీయ యువజనోత్సవాలలో పాల్గొన్నారు.

—తా. వి.



3. తిరుపతి ఇన్నర్‌వీల్ క్లబ్ ఛార్టర్ బహూకరణోత్సవం యిటీవల స్థానిక శ్రీనివాస ఇంగ్లీషు మీడియం స్కూలు ఆవరణలో జరిగింది. ఇన్నర్‌వీల్ డిస్ట్రిక్ట్ 319 అధ్యక్షురాలు శ్రీమతి అహల్యాబాయి అధ్యక్షత వహించారు.



కె. ఉష

"మనకి స్వాతంత్ర్యం వచ్చి మూడు దశాబ్దాలు దాటింది. అయినా స్త్రీల సాంఘిక స్థితి గతులలో మాత్రం చెప్పుకోదగ్గ మార్పంటూ అంతగా రాలేదు. నూటికో, కోటికో ఏ ఒకరో, యిద్దరో వున్నత స్థాయికి చేరుకున్నా, నేటికీ సామాజికంగా స్త్రీకి అన్యాయం జరుగుతూనే వుంది. ఇటీవల కాలంలో జరిగిన కొన్ని సంఘటనలు చూస్తూ వుంటే నేడు స్త్రీ అభద్రతతో జీవిస్తోందా అన్న అనుమానం కూడా కలగక మానదు. ఇటువంటి పరిస్థితి పోవాలి. అందుకు స్త్రీలంతా ఏకమై కృషి చేయాలి" అంటుంది నేడు మన దేశంలో స్త్రీల స్థితిగతుల గురించి చెబుతూ కుమారి కె. ఉష.

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' యిటీవల మద్రాసులోని కళాశాల విద్యార్థినులకు వక్తృత్వపు పోటీలు నిర్వహించింది. ఆ పోటీలో ఈ సంవత్సరం ప్రథమ స్థానం సంపాయించి – 'లిటరరీ అవార్డు' అందుకున్న ఘనత కుమారి ఉషకు దక్కింది!

అనకాపుత్తూరులోని ప్రభుత్వ వున్నత పాఠశాలలో చదువుతున్నప్పుడే ఆమె వక్తృత్వపు పోటీలలోనూ, వ్యాసరచన పోటీలలోనూ పలు బహుమతులు గెలుపొందింది. ప్రస్తుతం ఉష మద్రాసు చెల్లమ్మాళ్ కళాశాలలో ప్రియూనివర్సిటీ విద్యార్థిని.

'నేడు విరివిగా వుత్పత్తి అవుతున్న సాహిత్యం చాలామటుకు వ్యాపార దృష్టితో సాగుతోందని– సమాజంలోని సమస్యలని, కల్మషాన్ని, దురన్యాయాలని చాటి చెప్పేవిధంగా లేదని' అంటూ తన అభిప్రాయాన్ని తెలియజేసింది ఉష. ఆమె అభిమాన రచయిత్రి కె. రామలక్ష్మి.

తీరిక సమయాల్లో-నవలలు చదవడం, సైకిలింగ్, చేపలు పెంచడం ఆమె హాబీలు.

'డిగ్రీ పూర్తి చేసిన తరువాత సి. ఎ. చదవాలని వుంది' అనే ఉష 'వక్తృత్వపు పోటీలలో యింకా ఎన్నో బహుమతులు పొందడం కూడా తన ఆశయాలలో ఒకటి' అంటుంది.



విశాఖపట్నంలోని ఆంధ్రా యునివర్శిటీ లేడీస్‌క్లబ్బు (సిరిపురం) మహిళలు ఇటీవల తమ వార్షికోత్సవాన్ని జరుపుకున్నారు. ఈ సభకు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు అధ్యక్షత వహించగా, కార్యదర్శి శ్రీమతి సరళాశాస్త్రి గత సంవత్సరపు కార్యక్రమాల నివేదిక సమర్పించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ పాలిటిక్సు ప్రొఫెసరు శ్రీ చంద్రశేఖరరావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి రాజరాజేశ్వరి అప్పారావు విజేతలకు బహుమతి ప్రదానం చేసారు. క్లబ్బు మెంబర్ల పిల్లల పాటలతోను, నాటక ప్రదర్శనతోను ఆనాటి సభ ముగిసింది. —విలేకరి



రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్ తరఫున— ఇటీవల క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి ఎ. ఎల్. ఎన్. కామేశ్వరి—సమరంలో పాల్గొని జైలు శిక్షను అనుభవించిన త్యాగశీలి శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారికి సన్మానం చేశారు.



8. గత వెల చీరాల మహిళామండలి భవన నిర్మాణ నిధికొరకు సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేయబడ్డాయి. ఆ సందర్భంగా విచ్చేసిన ముఖ్య అతిథి ప్రముఖ నటి కుమారి వాణిశ్రీతో మండలి అధ్యక్షురాలు పి. అనసూయ, కార్యదర్శి జి. ఉమాదేవి, జి. ఎల్. పద్మావతి, కె. కమలాదేవి తదితరులు.

## ఆదర్శ వివాహాలు

సామూహిక వివాహాలు జరగడమన్నది సర్వసామాన్యమైన విషయం. కాని ఈ సామూహిక వివాహాలలో విభిన్న జాతులకు, మతాలకు చెందిన వారు పాల్గొనడమన్నది అరుదుగా జరిగే విషయం. అసలు యింతకు ముందు ఎన్నడూ జరగలేదేమో కూడా.

అటువంటి సంఘటన ఒకటి అక్టోబరు 2 నాడు గాంధీ జయంతి ఉత్సవాల సందర్భంగా మద్రాసు మెరీనాబీచ్‌లో జరిగింది. ఈ సామూహిక వివాహాలలో నూట ఆరుమంది కలిసి అరవైముగ్గురు దంపతులుగా వివాహబంధంతో ముడివేయబడ్డారు. ఆ నాడు సాయంత్రం మెరీనాలో ఏర్పాటు చేసిన ప్రత్యేక షామియానాలో ఈ వివాహాలు జరిగాయి. తమిళనాడు గవర్నర్ శ్రీ ప్రభుదాస్ పట్వారి ముఖ్య అతిధిగా విచ్చేశారు. మద్రాసులోని వర్కింగ్ విమెన్స్ ఫోరమ్ ఆధ్వర్యంలో ఈ వివాహాలు జరిగాయి. ఈ విధంగా యిందులో వనితాసంఘం పాత్ర వహించడం విశేషం!

"ఈ అరవై మూడు వివాహాలలో వధువుగాని, వరుడుగాని హరిజనులు కావడం ఒక విశేషం" అన్నారు ఫోరమ్ అధ్యక్షులు శ్రీమతి జయ అరుణాచలం.

ఈ వివాహాలలో మరో విశేషమేమంటే హరిజనులు కాని వారిలో అందరూ శుద్ధ హిందువులు కారు. నఫీసా అనే ఇరవై ఆరేళ్ళ ముస్లిం యువతి సెల్వరాజ్ (28) అనే హరిజనుడిని పెళ్ళాడింది. అల్లాగే ప్రేమ అనే బ్రాహ్మణ యువతి బస్ కండక్టరుగా పనిచేస్తున్న తంగరాజ్ అనే హరిజన యువకుడిని వివాహమాడింది. కాంతి (21) అనే మార్వాడి కన్య దేవన్ (28) అనే హరిజనుడిని పరిణయమాడింది. వీరు కాక క్రైస్తవ మతస్థులు కూడా వున్నారు.

విశేషమేమంటే ఈ వివాహ తతంగమంతా ఐదు నిమిషాలలో పూర్తయింది. ముందుగా వధూవరులను షామియానాలో కూర్చోబెట్టారు. వారందరూ కూడా వివాహ దుస్తులలోనూ, పూల మాలలతోనూ వున్నారు. వేదికమీద కూర్చున్న గవర్నర్–కాబోయే దంపతులలో ఆరుగురిని వేదికమీదకి పిలిచారు. నాదస్వర వాద్యం వినవస్తూంటే ఆ ఆరుగురు వరులూ తమ వధువుల మెడలో తాళి కట్టారు. షామియానాలో కూర్చున్న యితరులు వారిని అనుసరించారు.

"మా ఫోరమ్ తరఫున వరుడికి ధోవతి, వధువుకి చీర బహుమతిగా ఇచ్చాము. అదికాక ఒక్కొక్కటి 215 రూపాయల ఖరీదు చేసే తాళిబొట్టు కూడా యిచ్చాము" అన్నారు ఫోరమ్ అధ్యక్షురాలు శ్రీమతి జయా అరుణాచలం.

'సభకు అధ్యక్షత వహించిన తమిళనాడు హరిజన సంక్షేమ మంత్రి శ్రీ సుందరపాండ్యన్ వివాహితులలో యితర కులస్తులను వివాహం చేసుకున్న నలభై మందికి ప్రభుత్వం ఒక్కొక్కరికి మూటయాభై రూపాయలు యిస్తుందని తెలియజేశారు.

"ఒకళ్ళతో ఒకళ్ళు పోట్లాడుకోకుండా, ఒకరి ఎడ ఒకరు గౌరవభావం కలిగి, కలిసి మెలిసి కలకాలం జీవించమనీ, ఇద్దరికంటె ఎక్కువమంది పిల్లల్ని కనకూడదనే నిర్ణయం తీసుకోమనీ' చెబుతూ గవర్నర్ ప్రభుదాస్ పట్వారి వారిని ఆశీర్వదించారు. —బన్ని

ప. అవకావల్లి 'జేసీరెట్స్ వారోత్సవములు' సందర్భంగా 'వంటల పోటీ' నిర్వహించారు.

ఆ పోటీలో పాల్గొన్న వనితలతో జేసీరెట్ ఛైర్మన్ శ్రీమతి వి. సత్యవతి.





జాతీయ స్త్రీల చదరంగ ఛాంపియన్ రోహిణి ఖాదిల్కర్ యిటీవల హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత చదరంగ పోటీలలో గెలుపొందింది. బళ్లారి జిల్లా చదరంగ సమాఖ్య ఈ పోటీలను స్త్రీలకు పురుషులకు కలిపి నిర్వహించింది.

మేటి ఆటగాళ్ళందరూ పాల్గొన్న ఈ పోటీలలో ఒక వనిత—అందునా పాఠశాల విద్యార్థిని ఛాంపియన్‌షిప్‌ను కైవసం చేసుకోవడం యిదే ప్రథమం! ఇంతకు మునుపు రోహిణి పురుషులతోపాటు ఇటువంటి జాతీయస్థాయి పోటీలలో పాల్గొనకుండా చేయాలని కొందరు విఫలయత్నం చేశారు. అయితే ప్రపంచ చదరంగ సమాఖ్య నియమావళిలో ఒక స్త్రీ పురుషులతోపాటు పాల్గొన కూడదన్న నియమం ఏదీ లేకపోవడంతో వారు తలవంచక తప్పింది కాదు.

తొమ్మిదవ తరగతి విద్యార్థిని అయిన రోహిణి మహారాష్ట్రకు చెందిన అబ్దుర్ జబ్బార్, ఆంధ్రప్రదేశ్ ఆటగాడు నసీరుద్దీన్ గాలిబ్ వంటి వారిపై విజయం సాధించడం విశేషం!



ఇటీవల విశాఖపట్నం లయన్స్ లేడీస్‌క్లబ్బు'77-78 సంవత్సరపు "ఉత్తమ క్లబ్బు" బహుమతిని అందుకుంది. ఈ లేడీస్ క్లబ్బునకు అధ్యక్షురాలిగా వ్యవహరించిన డా॥ శ్రీమతి ఎ. హైమవతిదేవి "ఉత్తమ అధ్యక్షు రాలు" బహుమతిని, "ఉత్తమ శిశు సంక్షేమ కృషి" బహుమతినీ అందుకున్నారు. ఈ క్లబ్బుకు యింకా "ఉత్తమ అంతర్జాతీయ అవగాహన" బహుమతి, కూడా లభించింది.

—విలేకరి

ఇటీవల దక్షిణ-పూర్వ రైల్వే భారత్ స్కౌట్స్, గైడ్స్ రాయపూర్ శాఖ మహిళావర్గం వారు ఆహార పౌష్టిక బోర్డువారి ఆధ్వర్యంలో పళ్ళు, కాయగూరలు నిలవచేసే విధానాల గురించి శిక్షణా శిబిరం నిర్వహించారు. ఈ శిక్షణలో పాల్గొన్న వనితలకు సర్టిఫికేట్లు యివ్వబడ్డాయి. శిబిరాన్ని శ్రీమతి అన్నపూర్ణాజీవన్ ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి కృష్ణావిండల్ ముఖ్య అతిథిగా విచ్చేశారు.





జె. దీపక్ (గుంటూరు) పుట్టిన తేదీ : 17-11-77
తల్లిపేరు : జె. కనకకుమారి

ఈ నెలలో పుట్టిన రోజులు గల శిశువుల్లో—ఏడాది పిల్లల గ్రూపులో జె. దీపక్; రెండేళ్ళ గ్రూపులో పెండ్యాల సుమన్ 'పుట్టినరోజు బహుమతుల'కు ఎన్నికైనారు. మూడేళ్ళ గ్రూపుకు చెందిన ఫోటోల్లో ఏదీ సరైనది కనబడకపోవడం వల్ల—ఆ గ్రూపుకు బహుమతి ఇవ్వలేదు. నిర్ణయింపబడిన పై ఇద్దరితోపాటు, మొత్తం మీద రెండు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గుర్ని ఎన్నికచేసి విడిగా ప్రచురిస్తున్నాము. డిసెంబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు—వివరాలతో సహా (ఫోటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫోటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫోటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు) నవంబర్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



పెండ్యాల సుమన్ (కర్నూలు) పుట్టిన తేదీ: 16-11-76 తల్లిపేరు : పెండ్యాల నీరజబాల






సి. విటోబా కృష్ణమహేష్ (మద్రాసు) పుట్టిన తేదీ : 6-11-77 తల్లిపేరు : సి. భారతి



పి. పావని (బెంగళూరు) పుట్టిన తేదీ : 5-11-77 తల్లిపేరు : పి. మీనాక్షి



చిరువోలు రవిశంకర్ (విజయవాడ) పుట్టిన తేదీ : 20-11-77 తల్లిపేరు : సి. శచీదేవి





Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

# చూడండి...

# సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్®









బట్టలను ఆఖరుసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి...
బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని—
నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి, చూపండి!**

నూలు దుస్తులకు **రానిపాల్®**
సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు **రానిపాల్®-ఎస్.**

Shilpi SG-2A/78 Tel